ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# వనితాలోకం వ్యాసరచనపోటీ

(దీపావళి ప్రత్యేక ఆకర్షణ)

విషయం

# 'వివాహం జూదమా?'

పెద్దలు కుదిర్చే వివాహాలలోనే కాక, ప్రేమించి చేసుకునేవాటిలో కూడా, వివాహానంతరమే వధూవరులు ఒకరి నొకరు పూర్తిగా అర్థం చేసుకొనగలుగుతారనే అభిప్రాయం నిజమయితే వివాహమూ ఒకరకమయిన జూదమే అవుతుంది. వనితాలోకం పాఠకులు ఇది ఎంతవరకు యదార్థమో తమ వ్యాసాలలో చర్చించి పై పోటీలో పాల్గొంటారని ఆశిస్తున్నాము.

**మొదటి బహుమతి రు. 60**

**రెండవ బహుమతి రు. 40**

**మూడవ బహుమతి రు. 25**

నిబంధనలు

* కవరుపైనా, వ్రాత ప్రతిపైనా 'వనితాలోకం దీపావళి పోటీకి' అని స్పష్టంగా వ్రాయాలి
* రచన 6 అరఠావు పేజీలు మించరాదు. కాగితం ఒకవైపునే వ్రాయాలి.
* బహుమతులకు అర్హములుకాని వ్యాసాలు కూడా ప్రచురణకు యోగ్యమైనవైతే ఇతర సంచికలలో ప్రచురిస్తాము.
* రచనలు త్రిప్పిపంపగోరేవారు తగిన పోస్టేజితోసహా పంపాలి.
* వ్యాసాలు మా కార్యాలయానికి 30-9-61 లోగా చేరాలి.
* పోటీలో తుది నిర్ణయం సంపాదకులదే. ఈ సందర్భంలో ఏవిధమైన ఉత్తర ప్రత్యుత్తరాలకూ అవకాశం లేదు.

# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

## మిమ్మల్ని హిమబిందువు వంటి తాజాదనముతో స్నానానంతరపు హాయితో రోజంతా ఉంచుతుంది!




నవోత్సాహము చేకూర్చే మరియు మనసుకు ఉల్లాసము కలిగించే పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను ఒంటిమీద జల్లుకోండి. అది ఎంతో త్వరగా చెమటను పీల్చి మండుతున్న ఎండ రోజున కూడ మీకు స్నానానంతరపు తాజాదనమును మరియు సువాసనను కలిగిస్తుంది. చాలసేపు తాజాదనముతో ఉండుటకు ఎల్లప్పుడూ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరును వాడండి.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు ఎస్ ఎ లో స్థాపింపబడినది)

# ఉత్తరాలు

## గిరీశం ప్రజ్ఞ

ధన్యవాదాలు గిరీశం ! ఇన్నాళ్ళూ ఏదో మామూలు గిరీశంవి అనుకున్నాను కథ అడ్డం తిరిగింది తెలుగు వెలుగునై కూర్చున్నావు నిన్నభినందించకుండా ఎలా ఉండగలను

జె నారాయణమూర్తి (రాజమండ్రి)

## బంగారం-సింగారం

బంగారం—సింగారం రేఖాచిత్రకథలో పిడకలు దబ్బుకింద చెలామణి అయినప్పుడు బాగానే ఉంది కాని వెంటనే గుడ్డలుకింద, కాగితాలుకింద మారి పోయినట్లు వ్రాశారు అంత అనాలోచితంగా వ్రాయడం రచయితకు సమంజసం కాదు అసలు వారు గోళంలోకి వచ్చిన కారణం అర్థంకాలేదు

వి మురళీకృష్ణారావు (రాజమండ్రి)

*  *  *

బంగారం—సింగారం సీరియల్ కథలో "గంద్ర గోళిలు సింగారం, అప్పారావులమీద పడి, గోళ్ళన్నీ ఒల్చుకుపోయార"ని ఒక బొమ్మలో తెలియ జేశారు కానీ, బంగారం, సింగారం తాలూకు చేతిని అడిగినపుడు "సింగి ఇవ్వకురోయ్ — గోళ్ళ కోసం అడిగాడు దొంగపీనుగ" అని ఎందుకన్నట్లు ? సింగారానికి అప్పటికప్పుడే గోళ్ళు మొలిచేశాయా ?

కొండపల్లి బ్రహ్మానందం (సాలూరు)

## మనమూ-మనరాష్ట్రం

'మనమూ — మనరాష్ట్రం' అన్న శీర్షికలో స్వతంత్రపార్టీ భవితవ్యంగురించి శ్రీ కౌండిన్య వ్రాసినది చదివాను చదివినదానినిబట్టి అను కున్నది "కొంపతీసి ఈయన కాంగ్రెస్ మహా భక్తుడు కాదుకదా !" అని స్వతంత్రపార్టీ భవి తవ్యంగురించి రాస్తూ, "దక్షిణాదిన ద్రవిడ కజగంతోను, ఉత్తరాదిన మతవక్తాలైన జన సంఘం, రామరాజ్య పరిషత్ లాంటి వాటితోను చేరితే పార్టీప్రతిష్ఠ పెరిగి బలపడుతుందనా ?" అని అడిగారు ఇంకోచోట ఆంధ్రలో ఉన్న పార్టీ లను గురించి చెపుతూ, "జనసంఘం ఇత్యాదులు ఉన్నా లేనట్లే" అని వ్రాశారు వారు వ్రాసిన విషయాలుబట్టి చూస్తే జనసంఘం, స్వతంత్ర పార్టీ ఇత్యాదులగురించి వారికి సరిగా ఏమీ తెలియ దని నిరూపించుకొంటున్నారేమో ననిపిస్తోంది ఇక ముందు 'మిడిమిడి' జ్ఞానంతో కాక, పూర్తి పరి జ్ఞానంతో ఏవిషయంగురించైనా రాయడం మంచి దని వారికి నా ఉచిత సలహా

ఎన్ వి వి సత్యనారాయణ (కొత్తపేట)

*  *  *

"ఉస్మానియా విశ్వవిద్యాలయాల వ్యవహారము" ను బాగా విమర్శించినారు ఈ సందర్భమున నేను రెండుమాటలను వ్రాయాలనుకొన్నాను ఆర్థి కంగా బాధపడుచున్న ఈస్థితిలో విశ్వవిద్యాలయంవారు అంతలేసి టరంజీతాలను పెంచుటం చాల అన్యాయము కనుకనే విద్యార్థులు తమ తల్లిదండ్రుల తరఫున సమ్మె చేయడానికి పూనుకొన్నారు దౌర్జన్యంగా ప్రవర్తించి అన్ని

విద్యాలయాలు మూసివేయించినారు నెమ్మదిగ అది
గాక, విశ్వవిద్యాలయంవారు ఈ విషయం చెవిలో
వేసుకొనలేదు సరిగా, ఇతర విశ్వవిద్యాలయాలతో
పోలిస్తే ఉస్మానియా ఫీజులేమంత ఎక్కువ కాదని
జవాబులు చెప్పుకుపోయారు కాని ఇతర విశ్వవిద్యా
లయాలతో ఎందుకు పోల్చవలెనో అర్థముకాదు
ఉస్మానియా ఫీజుల ననుసరించి ఇతర విశ్వవిద్యా

## ఉత్తరాలు

లయా లెందుకు తమ టరం ఫీజులను తగ్గించ
కూడదు ? ఎప్పుడు చూసినా ఫీజులను పెంచడ
మేకాని, తగ్గించాలని ఏందు అనుకోరు ? ఒక్క
లక్షరూపాయలకై ఇంత ఆర్భాటమా ? మన
దేశమున ఎన్ని కోట్ల రూపాయలు వెచ్చించి ప్రాజెక్టు
లను నిర్మించదలచారు ? వాటిలో ఎంత వృథా
జర్గుచున్నది? నికరముగ ప్రాజెక్టు నిర్మాణానికై
ఎంత చేరుచున్నది ? ఈ ప్రశ్నలు వేసుకొన్న, లక్ష
రూపాయలకై విద్యార్థులను, వారి తల్లిదండ్రు
లను బాధించుట ఎంతమాత్రము సమంజసము
కాదు వ్యాసకర్త "శ్రీ కౌండిన్య" కు నా అభివంద
నలు తెలిపేది

ఎం. వి. శ్రీహరి (పెనుగొండ) ★

బుధవారం · 23-8-61
ప్లవ సం॥ శ్రావణ శుద్ధ ద్వాదశి
సంపుటము · 53 సంచిక : 50

స్థాపితము:
1908

* * *

ముఖ్యసంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

* * *

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

* * *

విడిప్రతి: 25 న. పై
సంవత్సర చందా: 13-0-0 రు.

* * *

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

★

## లోకంపోకడ



"నేను సహజంగా నేరస్థుణ్ణి కాదండీ కాని, ఇవలే నాకు ఒక నేరస్థుని రక్తం ఎక్కించారు అందువల్ల ఇప్పుడు నాలో నేరస్థుని ధోరణి ఉంటే ఉండవచ్చు!"

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

## విషయానుక్రమణిక

ముఖచిత్రం అనితా గుహ

### కథలు

| | | |
|---|---|---|
| సమస్య | — | 16 |
| నిరాశ్రయులు | — | 20 |
| చతురంగతురంగం | — | 27 |
| వరదరాజీయం | — | 32 |

### వ్యాసాలు

| | | |
|---|---|---|
| నాజూకుతిండ్లు | — | 19 |
| స్త్రీ ధర్మం – గృహిణీత్వం | — | 31 |

### సీరియల్ కథలు

| | | |
|---|---|---|
| ధృవతార | — | 8 |
| హరివంశం | — | 15 |
| ఆదర్శాలు–అంతర్యాలు | — | 18 |
| 'రేఖా' చిత్రకథ | — | 22 |
| బియోవుల్ఫ | — | 26 |

### బాలసాహితి

| | | |
|---|---|---|
| విలువ | — | 23 |

### శీర్షికలు

| | | |
|---|---|---|
| ఉత్తరాలు | — | 3 |
| ఊమెన్ కార్టూన్ | — | 6 |
| న్యూఢిల్లీ లేఖ | — | 7 |
| కథ కానికథ | — | 9 |
| వారఫలాలు | — | 10 |
| మనమూ – మనదేహస్థితీ | — | 12 |
| మనమూ – మనరాష్ట్రం | — | 13 |
| ఎప్పుడూ – ఇంతే | — | 19 |
| సినిమా | — | 24 |
| వనితావాణి | — | 28 |
| చిత్రసమీక్ష | — | 49 |
| గళ్ళ నుడికట్టు | — | 63 |
| పొట్టికథలు | — | 64 |

48 వ పేజీ బొమ్మ: నందా ఫిలింస్ వారి "ఛాలక్" చిత్రంలో మధుబాల.

### శ్రీశైల ఆలయ ఉద్ధరణ నిధి

'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున స్వామివారి ఆలయ ఉద్ధరణ నిధికి ఆగస్టు 12 వ తేదీనాటికి రు. 31,753=56 వసూలు అయింది. యథాశక్తి విరాళాలు ఇచ్చి, ఈ పవిత్రమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిందని ప్రజలకు, ప్రజాసంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

మూడవ ప్రణాళిక

చంద్రమండలానికి మన రాకెట్

చూడండి డాక్టరుగారు! నా మెదడన్నా భూకాయి నా వెన్నుపూస తట్టుకొని గలదంటారా

కెన్నెడీ తమ వెన్నుపూస వ్యాధిని గూర్చి డా॥ బి.సి. రాయ్‌తో అధికంగా ముచ్చటించారు!

ఉభయతారకం అమెరికా దౌత్యనీతి

ఎన్నికల పందాలు

రా! రా! మనమూ పందాలల్లో పోటీ చేద్దాం

సంస్థానాధీశుల గతప్రాభవాన్ని పునరుద్ధరించేందుకు బదులు సంస్థానం మాజీ అధిపతి పార్టీ నెలకొలుతారు-

25 గంటలలో 17సార్లు భూప్రదక్షిణం చేసి, వియన్మండలం నుంచి సురక్షితంగా దిగి వచ్చిన రష్యన్ మేజర్ ఘెర్మన్ స్టీపానోవిచ్ టిటోవ్

న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# అహింసా సిద్ధాంతం మీద రక్షణశాఖ మక్కువ : నేరనిరోధక చట్టానికి వివియన్ బోస్ మద్దతు

రాష్ట్రపతి ఇప్పుడు బాగా కోలుకున్నారు అయితే ఆయన ఆరోగ్యం దృష్ట్యా దేశ శ్రేయస్సు దృష్ట్యా రాష్ట్రపతి ఇంకా కొన్ని మాసాలపాటు తమ బాధ్యతలను స్వీకరించకుండా విశ్రాంతి తీసుకోవాల్సివుంటుంది రాజ్యాంగంలో రాష్ట్రపతికి ఇలాంటి సౌకర్యం లేకపోయినా తమ పదవీ విరమణకు ప్రాతిపదికగా రాష్ట్రపతికి సెలవు అవకాశం కల్గించటం అవసరం ఆయన చాలా భారం వహిస్తున్నారు 1950 జనవరినుండి రాష్ట్రపతి పదవిలో వున్నారు ఆయన కిప్పుడు విశ్రాంతి చాలా అవసరం

* * *

శ్రీ నెహ్రూ కార్తేజియన్ సిద్ధాంతంకు అటు చైనానుంచి ఇటు పాకిస్తాన్‌నుంచి ఎడా పెడా పవాళ్ళు ఎదురౌతున్నవి కార్తేజియన్లు ప్రాచీన కాలంలో ఔన్నత్యం పొందిన జాతుల్లో ఒక జాతి సముద్రవాణిజ్యంలో ఆరితేరినది ఈ జాతి పశ్చిమ మధ్యధరా ప్రాంత మంతా తమదేనని చెప్పుకొంటుండేవాళ్ళు ఔన్నత్యంలో పరాకాష్ఠను పొందిన కాలంలో ఈ జాతిలో సుమారు పదిలక్షల జనాభా వుండేది పారిశ్రామికంగా పేరు పొందిన ఈ జాతి తీరప్రాంతవాణిజ్యమేగాక, ఆఫ్రికాలో కూడా వ్యాపారం సాగిస్తుండేది నీగ్రో బానిసల అమ్మకం నుంచి దంతం, లోహాలు విలువైన రాళ్ళు దాకా క్రయవిక్రయం కొనసాగిస్తుండేది ఈ జాతి ప్రజలు స్పెయిన్ లోగి గనులనుండి తీసిన లోగిని తమ ఓడల్లో పోర్చుగల్లు ఫ్రాన్సు బ్రిటన్ దేశాలకు ఎగుమతి చేస్తుండేవాళ్ళు రోమన్‌లు ఈ జాతితో మూడు యుద్ధాలు చేశారు వీటినే ప్యూనిక్ యుద్ధాలని అంటారు మూడవ యుద్ధంతో చేటుమూడి కార్తేజ్ జాతి నాశనమైపోయింది

భారతదేశం ఆర్థికంగా పారిశ్రామికంగా పురోభివృద్ధి సాధిస్తుందే కాని సైనికంగా మాత్రంకాదు సైనిక పథకం అనేది గాలిలో తయారయ్యేది కాదు అతి బలసంపన్నుడైన శత్రువుకు దీటైనదిగా వుండాలి భారతదేశానికి ముఖ్యవిరోధులెవరో జగద్విదితమే అయినా భారత దేశాన్ని సైనికంగా పటిష్ఠం చేసేబదులు శ్రీ కృష్ణమీనన్ ప్రభుత్వ రంగంలో మోటారుకార్లు ట్రాక్టరు నిర్మించటం పట్ల ఆసక్తి చూపుతున్నారు

శత్రువును తగినవిధంగా ఎదుర్కోటమనే విషయమై లోగడ రక్షణశాఖ అందజేసిన సమాచారం గమనార్హం భారతదేశం అహింసా సిద్ధాంతానికి కట్టుబడి వుంటుందని—ఈ ప్రకటన సారాంశం ఈ మాటలకు అర్థమే లేదో, లేక అసలు ఈ పదజాలం వాడిన వాళ్ళకు తార్కిక శక్తిలేదో అనిపిస్తుంది అంత అహింసాసిద్ధాంతానికే కట్టుబడ్డామనుకొన్నవాళ్ళకు అసలు రక్షణ శాఖ మాత్రం ఎందుకు? రక్షణమంత్రి శ్రీకృష్ణమీనన్‌ని ఖాదీ ఉత్పత్తి శాఖకు మంత్రిగావుంటే బాగుండేదిగా ?

రెండు విషయాలు మాత్రం నిర్ధారణగా తెల్తున్నై ఒకటి చైనా తనశక్తిని పెంపొందింపజేసుకుంది శ్రీ ఆర్ కె నెహ్రూ పెకింగ్‌కు వెళ్ళి రావటంవల్ల చైనా దృక్పథంలో ఏమాత్రం మార్పులేదు గత 18 నెల్లక్రిందట ఎలా వుందో ఇప్పుడూ అంతే

సైనికంగా భారతదేశంకన్నా పాకిస్తాన్ బలంగా వుండనేది రెండో విషయం పాకిస్తాన్‌లోని ప్రస్తుత పరిపాలనకు ప్రజలు సుముఖులా విముఖులా అనే ఇక్కట్మైన చర్చలో ఈ దేశం సుముఖత చూపించకూడదు సిద్ధాంతరీత్యా చైనాలో అసంతృప్తి ప్రబలుతోందే అనుకుందాం భారతదేశం తన సామర్థ్యం, దార్ఢ్యం సైనికశక్తి వీటన్నిటికిమించి తన స్వాతంత్ర్యం వీటినిగూర్చే ఆలోచించుకోవాలి భారతదేశంలోని వాస్తవిక విషయాలు మరుగుపర్చి ప్రజలదృష్టి మళ్ళించుటమేగాక కల్లబొల్లి కబుర్లతో దేశ స్థయిర్యానికే వ్యతిరేకంగా కాంగ్రెస్ పాలకులు వ్యవరిస్తున్నారనే అభిప్రాయం రోజు రోజుకు పాతుకుపోతోంది ఈ విషయానికి కేంద్ర పాలిత ప్రాంతాలే నిదర్శనాలుగా వున్నాయి ఆంగ్లేయులు తమ పాల

(61-వ పేజీ చూడండి)




పెద్దిభొట్ల సుబ్బరామయ్య

## జరిగిన కథ

కాళిదాసు ఇంటి వరండాలో ఆ తెల్లవారుజామున ఎవరో నెలన్నా నిండని పసిపిల్లవాణ్ణి విడిచి వెళ్ళారు. భార్య మరణంతో, వృద్ధురాలైన తల్లి తప్ప వేరే ఆడదిక్కు లేని కాళిదాసు ఆ అనాధ బాలుణ్ణి పెంచడానికి ముందు సంకోచించినా, తరువాత సిద్ధపడి పని మనిషి అప్పలమ్మకు ఆ బాధ్యత అప్పగిస్తాడు. స్నేహితుడు పట్టాభి, మామగారు ఎంత చెప్పినా కాళిదాసు రెండో పెళ్ళి చేసుకునేందుకు ఇష్టపడడు. శంకరశాస్త్రి తనకూతురు రుక్మిణికి సంబంధం చూసి పెట్టమని కాళిదాసును అడుగుతాడు.

కాళిదాసు యింటికి వచ్చేసరికి ముందుగదిలో దీపం వెలుగుతున్నది ఉత్తరంవైపు వరండాలో మామగారూ మురళీ కూడా కూర్చుని చదువు కుంటున్నారు ముందుగదిలో పనిమనిషి పసిపిల్ల వాడిపక్కన పడుకుని తోకొడుతున్నది

తలుపుచప్పుడు విని మురళి లేచివచ్చి "మేష్టారూ! మీకోసం ఎవరో ఒకాయన వచ్చి అవైపు పంచలో కూర్చుని ఉన్నాడండి పేరు అడిగితే చెప్పలేదు మీరు వచ్చాక లేపమని అక్కడే నేలమీద పడుకున్నాడండి ముందుగదిలో కూర్చోమని చెబితే 'కాదు లెమ్మ'ని వెనక పంచలో చీకట్లోనే పడుకున్నాడండి" అని చెప్పాడు

కాళిదాసు ఆశ్చర్యంతో ఆవైపు నడిచిపోయి చీకట్లో పడుకునివున్న వ్యక్తిని చూసి "ఎవరూ?" అని అడిగాడు అవతలివ్యక్తి కాళిదాసు కంఠ స్వరం విని ఉలికిపడి లేచి, మళ్ళీ యథాస్థితికి వచ్చి "కాళిదాసూ! నువ్వేనా? నేను జానకి రామారావును" అన్నాడు

కాళిదాసు జ్ఞాపకంచేసుకొని నవ్వి "నువ్వు(ట్రా? ముందుగదిలో కూర్చోక దొంగలా యిలా వెనక పంచలో కూర్చోవడం ఏమిటో? రా లోపలికి పోదాం ఎక్కడి నుంచి వస్తున్నావు? ఏమిటీ కథ?" అని అడిగాడు

ఆ వ్యక్తి లేచి అతనివెంట నడిచి ముందు గదిలోకి వచ్చాడు అతడు సన్నగా బలహీనంగా ఉన్నాడు గళ్ళదుప్పటి నొకదాన్ని ఒంటినిండా కప్పుకుని ఉన్నాడు అతని గడ్డం బాగా పెరిగి ఉంది కళ్ళకు లావుపాటి అద్దాలుగల జోడుంది

అతడు కూర్చుని బలహీనంగా నవ్వుతూ "విశేషాలేవీ లేవులే ఏదో యిలా పోతూవుండగా నీ అడ్రసు డైరీలో కనుపించింది అప్పుడెప్పుడో ఒకనాడు వర్షం కురుస్తూ ఉండగా ఏదో చిన్న రైలుస్టేషనులో కలుసుకున్నాంగా? ఆ అడ్రసు చూడగానే నిన్ను చూడాలనిపించి వెంటనే రైలు దిగి యిలా వచ్చేశాను ఈ ఊళ్ళో నాకు ఏమీ తెలియదుకదూ! అందుకని దోవలో ఎదురైనవాళ్ళిద్దరు, ముగ్గుర్ని వాకబుచేసి యింటికి చేరుకున్నాను" అన్నాడు

తర్వాత అతడు కిటికీ పక్కగా చాపమీద పసిపిల్లవాడిపక్కన అటువైపు తిరిగి పడుకుని నిద్రపోతున్న పనిమనిషివైపు సాభిప్రాయంగా చూసి "మీ శ్రీమతిగారా?" అని అడిగాడు

కాళిదాసు చొక్కా విప్పుతూ "అబ్బే! మా పనిమనిషి" అని చెప్పాడు అతడు నివ్వెరపోయి "ఓహో" అని మాత్రం అన్నాడు

కాళిదాసు చొక్కాను వంకెకు తగిలించి మళ్ళీ అతనివంక చూసి "ఏమిటలా నీరసంగా కనిపిస్తున్నావు?" అని అడిగాడు అతడు తల వంచుకొని "ఈ ప్రయాణంమూలకంగా అన్నం, నీళ్ళూ వేళకు దొరక్క అలా ఉన్నా నంతే" అని చెప్పాడు కాళిదాసు "అంత తీరని ప్రయాణాలేమిటిరా నీకు? అయితే దబ్బున లే మధ్యాహ్నం ఒక స్నేహితుడు భోజనానికి వస్తే రెండు పూటలకూ సరిపడ వండాను అతడు, నేనెంత బలవంతంచేసినా యీపూట రాలేదు లేచి ముందు కాళ్ళూ చేతులూ కడుక్కుని నాలుగు మెతుకులు

(56-వ పేజీ చూడండి)

# కథ కాని కథ

## "పిలుల మందు"

### (మొదటి బహుమతి రు. 10 లు)

ఇది మా వూరి జనరల్ ఆసుపత్రిలో జరిగిన సంఘటన ఈ ఆసుపత్రిలోనికి క్రొత్తగానొక మళయాళవు డాక్టరును బదిలీమీద నియమించారు ఆయనకు సరిగా తెలుగురాదు కాని ఆయన రోగులతో మాట్లాడేప్పుడు తెలుగు మాట్లాడా అని ప్రయత్నిస్తారు. ఒకరోజున ఒక రోగికి కొన్ని మాత్రలుయిచ్చి ఆయన యిల్లా అన్నారు "ఈపిల్లిలను మూడు గంటలకు ఒక పిల్లి చొప్పున మొత్తము పిల్లులన్నీ మ్రింగిన నీ రోగము నయమగును" ఇది విని ఆ రోగి అత్యాశ్చర్యంతో నవ్వుకొంటూ పిల్లులు మ్రింగుట ఏమా అని ప్రక్కనున్న ఇంగ్లీషు తెలిసిన వాడ్ని అడుగ్గా ఇంగ్లీషులో "పిల్" అంటే మాత్ర అని తెలిసి నవ్వుకొన్నాడు

డి హనుమంతరావు (గుంటూరు)



## బోడ కాకరకాయలు

### (రెండవ బహుమతి రు. 5 లు)

నా చిన్నతనంలో మేమంతా ప్రైవేట్ స్కూల్లో చదివేవాళ్ళం అప్పుడు నాల్గవక్లాసు చదువుతున్నాను మా పంతులుగారివద్ద చనువుగా తిరుగుతూ, వారు చెప్పిన పనల్లా చేస్తూ శభాష్ అనిపించుకొనేవారం మా తత్వం గమనించిన పంతులు గారు "రాముడూ" అంటు నాకెక్కువ పని చెప్పేవాడు, (అప్పుడు నన్నురాముడు అంటు పిలిచేవారు) ఓరోజు పంతులుగారు "శ్రీరామచంద్రుడు" పాఠం చెబుతూ నన్ను, మధును, వనానికి (కాంతమ్మ గారి వనం వుందిలెండి) వెళ్ళి "బోడకాకర కాయలు" తీసుకురమ్మని పంపాడు వెంటనే పాఠం వదిలి తెంపుకొచ్చి యిచ్చాం తెల్లవారి "శ్రీరామ చంద్రుడి" పాఠంలోని ప్రశ్నలు అడుగుతున్నాడు "రాముడు వనానికి ఎందుకు వెళ్ళాల్సి వచ్చెను? నన్ను అడిగాడు తెలియక అట్లాగే నిల్చున్నాను మా కొంటె మధును అడిగాడు వెంటనే వాడు "మేష్టారికి బోడకాకరకాయలుతేను" అనేశాడు గభాలున అంతా గొల్లున నవ్వేశాము

కొండపల్లి రామారావు (గార్ల)



## పక్కవిరిగే సమాసం

### (రెండవ బహుమతి రు. 5 లు)

పేరిశాస్త్రిగారు మహా శాంత స్వభావం కలవారు ఎంతోకోపం వచ్చినా ఎవ్వరిని చేయెత్తి కొట్టేవారు కారు ఆ అలుసుతో ఆయనంటే మాకు ఒక విధమైన చులుకనగా కూడా వుండేది

ఒకమారు ఆయనక్లాసు కొచ్చిందే తడవుగా సమాసాలంటూ దుంపతెంచుతున్నారు మా బెంచిలో వాళ్ళ కందరికి వ్యాకరణమంటేనే తలనొప్పి, భయం అలాంటి, మాబోటి విద్యార్థులకు ఆయన చెప్పేది వినే శ్రద్ధలేక యిదేమిటా అన్నట్లుగా ఆయనగారి నున్నగా తళ తళ మెరిసే తలకేసి చూస్తున్నాము

మా మాష్టరు మా ముఖాలకేసిచూసి ఏమిటా అబ్బాయిలు అలా ఆముదం తాగిన ముఖాలేశారు అర్థం కావటంలేదా? అట్లా అర్థముకానివేమన్నా వుంటే అడగండి అంటూ మా బెంచీలో తొందరపెట్టారు మాలో మేము యేమి అడగాలా అని తర్జన భర్జనపడుతున్న సమయంలో ఆయన నున్నగా టెంకాయలావున్నతల మాత్రం మాకు గోచరించింది ఇక చేసేది యేమీలేక మాలో ఒకడు ధైర్యంగా టెంకాయ ఏసమాసం అండి? అన్నాడు పాపం అర్థంచేసికొన్నారు గామాలు ఎక్కడలేని క్రోషంతో 'అదా! అది "పక్క విరిగే సమాసం" అన్నారు అంతే క్లాసంతా ఒక్కమారు గొల్లుమని నవ్వాము.

డి సుబ్రహ్మణ్యం (గుంటూరు)

## తమ్ముడికి ట్యూషన్

### (రెండవ బహుమతి రు. 5 లు)

"నీకు పిల్లల్ని కొట్టడం అంటే సరదా అని మా స్నేహితురాలు నన్ను మాటి మాటికి ఎగతాళి చేస్తూ ఉంటుంది నాకు పిల్లలు చదువకపోతే చాల కోపం వస్తుంది దానికి తోడు మా చిట్టితమ్ముడు ఆటలో ఘనుడు, చదువులో మొండి ఖర్మ వశాత్తు సరిగ్గా మా తమ్ముణ్ణో లేదా మా అక్క బిడ్డల్నో చదువుకోలేదని చివాట్లు పెట్టేప్పుడు మా స్నేహితురాలు మా యింటికి వస్తుంది అందుచేత నేను ఎప్పుడు పిల్లల్ని మందలించాలన్నా అది వస్తున్నదో లేదో చూసి మరీ మందలించేదాన్ని కాని ఒకరోజు మా ఫ్రండు చెల్లెలితో సహా హాజరైంది సరిగ్గా అదే సమయంలో నేను మా తమ్ముణ్ణి కోప్పడుతున్నాను—"వెధవ 'ఒ' అంటే 'న' రాదు కాని మొండితనం హెచ్చు చదవరాఅంటే మొండికేసుకుంటావ్" అని ఇది విన్న మా ఫ్రెండ్ చెల్లెలు "అక్కయ్యా గిరికి 'ఒ' అన్నా వస్తుంది, నాకు అదీ రాదు" అంది దాంతో మాకు నవ్వాగిందికాదు

ఎస్. జి ఇందిరదేవి (కర్నూల్)



## గేటు ఎందుకు వేశారు?

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఆరోజు ఆదివారం నేను నా స్నేహితుడు అతని తమ్ముడు రవి (5 ఏండ్లవాడు) కలిసి సాయంత్రము వూరిబయటకు రోడ్డుమీదనుంచి వెళ్తున్నాం. ఆ రోడ్డుకు రైల్వేలైను క్రాసు చేస్తుంది. మేము ఆ గేటు దగ్గరకు వచ్చేసరికి రైల్వేగేట వేశారు. 'గేటువేశారు ఎందుకు?' అని ప్రశ్న వేశాను రవి వెంటనే రైలు రోడ్డుమీదనుంచి రాకుండా!' అని సమాధానమిచ్చానాడు

పెద్దాడ సత్యరామచంద్రరావు (పిఠాపురం)






దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

23-8-1961 బుధవారము మొదలు
29-8-1961 మంగళవారము వరకు

## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా)

మనస్సులో అనుకున్న విషయాన్ని కార్యరూపంలో పెట్టబోయే సమయంలో పరిస్థితులు మార్పుచెందుతూ ఉంటవి ధైర్యంమాత్రం విడువవద్దు ఖర్చులు పెరగగల సమయం కుటుంబంలో వస్తూవుండే చిన్నచిన్న కలతలను సవరించవలసిన బాధ్యత పెరుగుతుంది ఆదాయానికి మధ్య మధ్య ప్రతిబంధకాలు తోస్తున్నా మొత్తంమీద గతవారం కన్నా మేలుగా ఉంటుంది మీ క్రిందివారివల్ల జరిగే లోపాలకు బాధ్యత మీమీద పడగల అవకాశాలున్నవి ప్రయాణాలు సుఖంగా జరుగుతవి వ్యవహారరంగంలో చిక్కులు తొలగిపోయి స్నేహితుల ద్వారా అనుకూలత లభిస్తుంది వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి స్త్రీరామ్స్తులు మొదలయినవి కొనే ప్రయత్నాలు సుముఖంగా జరుగుతవి 26, 27 లలో స్నేహితులవల్ల మోసము, అనవసరమైన పనులలో ప్రవేశించటం.

*　　*　　*

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా )

బాహ్య ఆడంబరం అధికం తత్కాలంలో ఉపయోగంలేదని తెలిసినా భారం పైన వేసుకొనవలసిన అవసరం ఏర్పడుతుంది ఆరోగ్యం గురించి

### గ్రహస్థితి

కర్కాటకంలో శుక్రుడు, సింహంలో సూర్య, బుధ, రాహువులు, కన్యలో అంగారకుడు, మకరంలో గురు, శనులు, కుంభంలో కేతువు, ధను ర్మకర కుంభ మీనాలలో చంద్రుడు

జాగ్రత్తగా ఉండండి కుటుంబవిషయాలలో మనశ్శాంతి లభిస్తుంది ముందు ఎప్పుడో సహాయం చేస్తామని చెప్పి ముందు మిమ్ములను తమచేతిలో పెట్టుకొనటానికి చూచేవారుంటారు జాగ్రత్త వ్యాపార వ్యవహార విషయాలలో అనుకూలవార్తలు తెలుస్తవి పట్టుపట్టి జయం సాధించగలుగుతారు వరములయందున్ను, రొమ్ము, పొట్ట ఈ భాగములలో బాధ కలుగవచ్చు క్రొత్త మనుష్యులతో తో పరిచయం కలుగుతుంది వారం రెండవభాగంపరి దూరమందున్న మిత్రులవద్దనుంచి శుభవార్తలు వస్తవి అధికారం చలాయించగల అవకాశాలు లభిస్తవి. 28, 29 లలో ఆదాయ వృద్ధి, విలాస వస్తువులు కొనటం. పుణ్య కార్యాలు

*　　*　　*

## మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఈ వారం మరొకరి సలహాకు ఎదురు చూడకుండా మీ పనులను మీరు చక్కబెట్టుకో గలుగుతారు వృత్తివ్యాపారాలలో సాహసంతో అవతలివారి కుయుక్తుల నుంచి తప్పించుకో గలుగుతారు. ఖర్చులు అధికంగా కనుపించినా సుఖము, శాంతి లభిస్తవి పదిమందిలో మీరు చెప్పిన మాటను సకాలంలో నెరవేర్చుకోగలుగుతారు కుటుంబంలోనివారి మాట కొన్నిసమయాలలో భేదంగా ఉన్నా చివరకు అంతా మీ దారికి వస్తారు వృత్తికి సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరాలు వ్రాయటంతో ముందు యోచన అవసరం ప్రతి చిన్న విషయము జ్ఞాపకంపెట్టుకొనటానికి ప్రయత్నించటం అవసరం దూరపు ప్రయాణాలు మీరు అనుకున్నంతగా ఉపయోగించవు 23, 24 లలో వినోదకార్యక్రమాలు, ప్రయోజనంలేని ఆడంబరం

*　　*　　*

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

మీ బుద్ధిబలము, సమర్థత తోటివారికి బాగా ఉపయోగిస్తవి స్వవిషయంలో అనుకూలత తక్కువ ఒకపని వెనుక మరియొకపని చేయవలసి వస్తూ ఉండటంవల్ల ఉత్సాహం తగ్గుతుంది సభికార్యాలలో మిమ్ములను ప్రోత్సహిస్తూ మిమ్ములను పైకితీసుకొనిరావటానికి ప్రయత్నించేవారు ఉంటారు కొన్నిసమయాలలో అధికారులవల్ల మాట వస్తుందేమోనన్న భావం కలుగుతుంది అయితే న్యాయం మీపక్షంలో ఉంటుంది కనుక చిక్కు ఏమీ ఉండదు మొదట్లో చాలా స్వల్పంగా చేదామనుకుని ఆరంభించిన పనికూడా మీ శక్తిని మించిపోతుంది మిమ్ములను గురించి అసూయతో రకరకాలవార్తలను సృష్టించేవారుంటారు ధనసంబంధమైన లావాదేవీలలో జాగ్రత్తగా ఉండండి 25, 26 లలో నీచస్నేహం, వృథాప్రసంగాలు, వస్తునష్టం

*　　*　　*

## సింహం

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మీరు ఒకొక్క మెట్టు పైకిపోదామని ప్రయత్నించే ఈ సమయంలో మీ శక్తిని పరీక్షించటానికి చూసేవా రుంటారు దైవానుగ్రహంవల

నిలబెట్టుకుంటారు. ధనాదాయం పెరుగుతుంది. వృత్తిలో తోటివారికి సహాయంచేస్తూ మీరు కూడా తృప్తికరంగా లాభం పొందగలుగుతారు ఒకానొక సందర్భంలో మీకు ఇష్టంలేకపోయినా దండగ చాకిరీ చేయవలసి వస్తుంది కోర్టు కచేరీలలో అనుకూలమైన కాలం నిష్ఠురాలతో కూడిన వార్తలు వస్తవి అయితే వాటిని అంతగా పట్టించుకోవలసిన అవసరంలేదు విలువగల వస్తువులు కొనే ప్రయత్నాలు అనుకూలిస్తవి 24, 25 లలో సందేహాలు, దేహబాధలు, త్రిప్పట

* * *

## కన్య

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ సమయంలో మీ మనస్సులోని విషయాన్ని అవతలివారితో వివరించగల అవకాశాలు లభిస్తవి అందువల్ల సందిగ్ధంగా నిలిచిన సమస్యలు సులభంగా నివర్తి అవుతవి వ్యవహారఅనుభవంగల పెద్దమనుష్యుల పరిచయం లభిస్తుంది లోగడ మీరు అనుకున్న ప్లాను మార్చుకుని వృత్తిలో ముందడుగు వేస్తారు స్వయంకృషితో ఒక ఉపయోగం పొందేసమయంలో ఫలితాన్ని పంచుకునే మనుష్యులు తటస్థపడతారు పిల్లల శుభకార్యాలు నిర్విఘ్నంగా నెరవేరుతవి సాధ్యమైనంత వరకు తోటివారికి శ్రమకలుగకుండా చూచుకొనటం మంచిది అంగారకగ్రహ జపంవల్ల అనారోగ్యదోషం తొలగుతుంది శత్రుబాధకూడా నివర్తి అవుతుంది 23, 24 లలో మీ పనులలో ఇతరుల జోక్యంవల్ల అశాంతి ప్రయాణాలు, స్వల్ప లాభం

* * *

## తుల

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

"కౌపీనసంరక్షణార్థం మయం పటాటోపః" అన్నట్లుగా మీ ఆలోచనలు, కార్యక్రమాలు పెరుగుతూ పోతవి తోటివారి సలహాలు మీ శక్తిని మించి పోవటంవల్ల ప్రయాసపడవలసి వస్తుంది కుటుంబంలోనివారి సానుభూతి, సహకారము లభిస్తవి దుబారా ఖర్చులను క్రమంగా తగ్గించుకొనగలుగుతారు ఎంత మాట నేర్పుతో వ్యవహరించినా చివరకు ఒకసందర్భంలో మాట చెల్లించుకొనటానికి ప్రయాస అవుతుంది ఆస్తి మొదలయినవి కొనే ప్రయత్నాలు లాభించగలవు వృత్తికి సంబంధించిన శుభవార్తలు తెలుస్తవి ఈవారం రెండవభాగంలో వృత్తిలో మాంద్యము, అందువల్ల ఆందోళన ఉంటవి 28, 29 లలో అనారోగ్యం, అపవాదులు, వస్తువులు పోగొట్టుకొనటం

* * *

## వృశ్చికం :

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

పేరు ప్రతిష్టలు పెరుగుతవి రావలసిన ధనం సకాలంలో చేతికి వస్తుంది. మిమ్ములను తేలికగా చూచే మనుష్యులకు చక్కగా సమాధానం చెప్పగలుగుతారు హోదా పెరుగుతుంది చేపట్టిన పని సులభంగా నెరవేరుతుంది విలాసవస్తువులు కొంటారు ఈ సమయంలో పుణ్యకార్యాలు సులభంగా జరుగవు కుటుంబంలో మనశ్శాంతి లభిస్తుంది అనుభవంలో జరిగిన కొన్ని సంఘటనలు ఈ సమయంలో మీకు ముందు జాగ్రత్తపడటానికి ఉపయోగిస్తవి పైకి శత్రుత్వం కనపరచకపోయినా మీ ప్రక్కనే ఉంటూ సమయంలో చిక్కులు కలిగించటానికి యోచించేవారుంటారు జాగ్రత్తగా ఉండండి ఆర్థికంగా పెద్ద ప్రయోజనం లేకపోయినా అధికారము హోదా పెరుగుతవి 27, 28 తేదులలో సభాగౌరవం, ఆదాయవృద్ధి, శుభవార్తలు

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

ఈవారం గ్రహస్థితి అనుకూలంగా ఉంటుంది ఎదటివారి స్వభావాన్ని కనిపెడుతూ సమయంలో మీ కార్యం సఫలం అయేటట్లు చూసుకోగలుగుతారు కుటుంబ సమస్యలు ఒకదారికి వస్తవి తరచూ ప్రయాణాలు చేయవలసివచ్చినా ఉత్సాహము, ఉపయోగము కనిపిస్తూఉండటంవల్ల శ్రమ తోచదు శుభకార్యవిశేషాలలో పాల్గొంటారు మాటలసందర్భంలో మీ మిత్రులవల్ల నిష్ఠురాలు రాగల సమయం అయితే దైవబలంతో అన్ని రంగాలలోను మీ హోదా నిలుపుకోగలుగుతారు. వృత్తిలో సులభంగా ఉన్నత స్థితిని పొందగల సమయం రాజకీయాలలో ఎదటివారిని ఆకర్షించి మంచిపేరు పొందగలుగుతారు ఒకరిద్దరు పెద్దమనుష్యులు మిమ్ములను అన్నివిధాలా కనిపెట్టిఉంటారు 25, 26 లలో విశ్రాంతిలేని ఆలోచనలు, కార్యరంగంలో విసుగుదల, అలస్యము.

* * *

## మకరం .

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఇతరుల బెదరింపులకు భయపడవలసిన సమయంకాదు మీ రహస్యవిషయాలలో స్నేహితుల ప్రమేయం లేకుండా చూచుకొనండి ఆర్థిక బాధలు క్రమంగా తీరుతవి వృత్తివ్యాపారాలలో శ్రద్ధతో పనిచేసి, మీ ధర్మాన్ని నెరవేర్చుకుని గౌరవం పొందగలుగుతారు అనుకోకుండా ఈమధ్య జరిగే మార్పులు మీకు ధైర్యస్థైర్యాలను కలుగజేస్తవి బెట్టుసరిగాఉండి కుటుంబ గౌరవాన్ని నిలుపుకుంటారు అధికారులవల్ల ప్రస్తుత అనుకూలత కనుపించకపోవచ్చు పశ్చిమ దిశనుంచి లాభవార్తలు వింటారు వారాంతంలో అకస్మాత్తుగా వస్తువులు పోగొట్టుకుంటారు తెలియని ఖర్చులు రాగలసమయం. 26, 27 లలో కుటుంబంలో కలతలు, వృత్తిలో ఎదటివారి మాట తప్పటంవల్ల అశాంతి

## ఈవారము ధరలు

బంగారుధర ఈవారం ఆరంభంలో పెరిగినట్లు కనుపించినా 27 నుంచి తగ్గుతుంది వెండిధరలో కొద్ది పెరుగుదల రావచ్చు పసుపుధర తేజీ తప్పి నిలుస్తుంది. కందుల ధరలో మందీ సూచన లున్నవి. మినుముల ధర పెరిగి తగ్గుతుంది గోధుమల ధర మందీలో నిలుస్తుంది చింతపండుధర క్రమంగా పెరగగల అవకాశా లున్నవి. నూవులధర గతవారంకన్నా పెరుగుతుంది వేరుశనగపప్పు ధరలో తాత్కాలికంగా మందీ వస్తుంది నూనె ధర ముందు తగ్గి వారాంతంలో కొద్దిగా పెరుగుతుంది. నూలు ధరలో తరచు హెచ్చుతగ్గులు కనుపిస్తవి. (విలకడ తక్కు.ఉ.)

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా.)

తప్పనిసరిగా చేయవలసిన అవసరం వస్తేగాని ఏపనీ ప్రారంభించటానికి బుద్ధిపుట్టదు దేహం విశ్రాంతిగా ఉన్నట్లు కనుపించినా మనస్సు మాత్రం శ్రమపడుతూ ఉంటుంది అందువల్ల ప్రయోజనం ఏమీ ఉండదు తలవనితలంపుగా కలసివచ్చిన అవకాశాలు అప్పటికప్పుడు మిమ్ములను హడావుడిపెట్టినా చివరకు సక్రమంగా జరిగి పదిమంది ఆదరాభిమానాలను పొందగలుగుతారు వృత్తిలో కార్యభారం పెరుగుతుంది కాని, గౌరవము, అధికారము బాగుంటవి ఆదాయం మామూలుగా ఉంటుంది ఈ సమయంలో వచ్చే వార్తలు ముందుముందు చక్కగా ఉపయోగిస్తవి ఇతరుల వ్యవహారాలలో తల దూర్చవద్దు. 26, 27 లలో అనారోగ్యము, సాధారణ విషయాలలో పట్టుదలలు, త్రిప్పట

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ భాద్ర, రేవతి)

పనిసమయంలో పనిచూచుకుని వీలుంటే కబుర్లకు దిగటం మంచిది మీ మృదుత్వాన్ని కనిపెట్టి మిమ్ములను చల్లగా తమమార్గానికి త్రిప్పుకొనేవా రుంటారు అనేక సందర్భాలలో ముందు అనుకున్నమాట మరచిపోవటం, వృధా ఖర్చులు మీద వేసుకొనటం జరుగుతూ ఉంటుంది. ఈ సమయంలో అధికారులతో సంప్రదించటం వంటి పనులు వాయిదావేసుకొనటం మంచిది. తరచు కలహప్రసంగాలు వస్తూ ఉంటవి వృత్తిలో శ్రమను భరిస్తూ మాటను కాపాడుకోగలుగుతారు కుటుంబంలోనివారి ఆరోగ్యం బాగుండదు. మాటలలో మిమ్ములను టోకరా ఇచ్చి ఇబ్బంది కలిగించేవా రుంటారు జాగ్రత్తగా ఉండండి. 28, 29 లలో ఫలితంలేని పేరుప్రతిష్ఠలు, వినోద కార్యకలాపాలు, క్రొత్తవారి స్నేహం. ★

# మనమూ మనదేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## కంఠ వ్యాధులు: టాన్సిలైటిస్

శైశవంమంచి యౌవనకాలం వరకూ బహువంశ్యాకులను బాధించే కంఠ వ్యాధులలో టాన్సిలైటిస్ ఒకటి 'ఐ టిస్' అంటే ఇన్ఫ్లమేషను అని యిదివరకే తెలుసుకున్నాము టాన్సిలుయొక్క ఇన్ఫ్లమేషను టాన్సిలైటిస్ వాపు, వేడి, ఎరుపు బాధ, అందువలన విధినిర్వహణలో లోపం, ఇన్ఫ్లమేషన్ లక్షణములు టాన్సిలుయొక్క విధులను గురించి వైద్యశాస్త్రజ్ఞులలో భేదాభిప్రాయం వున్నది క్రిములను గుంజిపట్టి సంహరించడం తప్ప దానికి వేరే విధి లేదు పోతే మిగిలిన నాలుగు లక్షణములు టాన్సిల్ ఇన్ఫ్లేం అయినప్పుడు ఏర్పడతవి

టాన్సిలు ఇన్ఫ్లేం కావడానికి ప్రధానకారణం రక్త విధ్వంసకమైన ఒక క్రిమి ఒక్కొక్కప్పుడు నెమ్మోనియా వ్యాధి కలిగించే న్యూమోకాకస్ కూడా టాన్సిలైటిస్‌ను ఏర్పరచవచ్చు వ్యాధికారక క్రిమిజాతులలో బెక్టీరియా ఒకటిఅని, అందులో గుండ్రని ఆకారంకల క్రిమిని కాకస్ అంటారనీ, ఇదివరకే తెలుసుకున్నాము కాకస్(Cocus) బహువచనం 'కాక్సై'(Cocci)ఇందులో స్ట్రెప్టోకాక్సై,న్యూమోకాక్సై, సాధారణంగా టాన్సిలును వ్యాధిగ్రస్తం చేస్తవి ఇవికాక ధాతువును నశింపజేసి చీముగా మార్చగల క్రిములన్నింటివల్ల టాన్సిలు ఇన్ఫ్లేం కావచ్చును

ఒకమాటు టాన్సిలు ఇన్ఫ్లేం కాంగానే రోగికి జ్వరం వచ్చినట్లు తోస్తుంది మ్రింగడం కష్టంగా వుంటుంది క్రమంగా జ్వరం వస్తుంది 100డిగ్రీల నుండి 105 డిగ్రీలవరకూ యీ జ్వరం వుండవచ్చు టాన్సిలు మొదటిమారు ఇన్ఫ్లేం అయినప్పుడు చాలా పెద్దపెట్టున జ్వరం వస్తుంది ముఖం ఎర్రబడి గాండ్రించుతుంది నాలుకమీద తెల్లని కోటింగు యేర్పడి అది పొరలకు మీద లాగా నూగునూగుగా వుంటుంది

రోగకారక క్రిమి ఉధృతమునుబట్టి కంఠప్రదేశంలో టాన్సిలుకు సంబంధించిన లింఫుగ్లాండులు, పెద్దవై, తామూ ఇన్ఫ్లమేషనుకు గురిఅయి ముట్టుకున్నప్పుడు, మెడ కదిలినప్పుడూ బాధ కలిగించవచ్చును

టాన్సిలు బాగా ఎర్రబడి, పెద్దదై తన ప్రక్కన వుండే 'ఫాసెస్' (Fauces) అనే మ్యూకస్ మెంబ్రేను తడికలమధ్యప్రదేశమును నింపి, కంఠప్రదేశంలోకి చొచ్చుకుని రావచ్చును క్రమంగా యీ ఇన్ఫ్లమేషను ఫాసెస్‌కీ, కొండ నాలుకకూ అంగిలి వెనుక ప్రదేశానికీ కూడా పాకవచ్చును టాన్సిల్ పైభాగంనుంచీ, దానిలోవుండే గుంటలనుంచి చీముపైకి ఉబికి, పచ్చగానూ, తెల్లగానూ టాన్సిల్ మీద మచ్చలు యేర్పడతవి కాని దూదితో తుడిస్తే ఇవి తేలికగా ఉండిపోతవి టాన్సిల్‌మీద డిఫ్తీరియా పొర అంకురిస్తున్నప్పుడు ముందు మచ్చలు మచ్చలుగానే యేర్పడి తరవాత ఒక పెద్ద పొరగా యేర్పడవచ్చును కాని ఆ మచ్చలుగానీ, పొరగానీ దూదితో తుడిస్తే వూడిపోదు బలవంతంగా పీకితేగాని రాదు అప్పుడు పుండుమీద పెచ్చు పీకినప్పుడు రక్తం వచ్చినట్లుగా రక్తం వస్తుంది ఏమయినా టాన్సిల్ మీద తుడిస్తే పోనిమచ్చ, డిఫ్తీరియా దేవతకు ప్రతీహారి టాన్సిల్‌మీద మచ్చలు మేర్పడగానే వేడి నీళ్ళతో గట్టిగా పుక్కిలిస్తేనే అవి వూడిపోతవి అంతకుమించిన మోటు ప్రయత్నం రోగులు చేయరాదు

టాన్సిల్‌లో జీవకణములూ, చచ్చిపోయిన క్రిములు, శ్వేత రక్తకణములూ కరిగి చీముగా యేర్పడి యీ మచ్చలుగానూ మచ్చలు కలిసిన పొరగానూ ఏర్పడతవి నెమ్మోనియా క్రిమితో టాన్సిల్ ఇన్ఫ్లేం అయినప్పుడు ఈ స్థితి తరుచు ఏర్పడుతుంది

గొంతునెప్పి, మ్రింగలేకపోవడం, ఎంత మాత్రము మంచి లక్షణములుకావు గొంతు పూతనుంచి డిఫ్తీరియావరకూ ఉండే వ్యాధులన్నింటిలోనూ యీ లక్షణములు వుంటవి ఇవి యేర్పడగానే వైద్య సహాయం పొందడం అత్యవసరం

టాన్సిలైటిస్ యేర్పడగానే రోగిని మంచం మీద పడుకోబెట్టి పరిపూర్ణమైన విశ్రాంతి యివ్వాలి తేలికగా జీర్ణమయ్యే ద్రవాహారం యివ్వాలి ఇన్ఫ్లమేషనుతో ఏర్పడే వ్యాధులన్నింటిలోనూ ముఖ్యంగా కంఠ వ్యాధులలో ఎక్కువ ద్రవ పదార్థములు తీసుకోవాలి నీరు నిమ్మరసం పంచదర నీరు కలిపి చేసిన లెమొనేడు, పాలు, కాచిచల్లార్చిన నీరూ ఎక్కువ తీసుకోవాలి క్రిమిదోషం యేర్పడ్డప్పుడు వాటినుండి ఉత్పత్తిఅయ్యే వాక్సినులనే విష పదార్థములవల్ల, జ్వరం యేర్పడి జీవకణములలో నీటి పరిమాణం తగ్గిపోతుంది అల్లా నీరు తగ్గినప్పుడు దాహం యేర్పడుతుంది నాలుక తడి ఆరిపోతుంది దాహం, శరీరంలో నీరు అవసరమైనప్పుడు యేర్పడే లక్షణం జ్వరాది వ్యాధులలో దాహం, వ్యాధికారక క్రిమి ఉధృతాన్ని సూచిస్తుంది దాహం మంచిలక్షణం కాదండానికి కారణం యిదే కాని దాహం తీరేంతనీటిని యివ్వగూడదని కొందరు అనుకుంటారు ఇది ప్రాణాంతకమైన దుర ప్రాయము జ్వరంలో దాహం ఉన్నప్పుడు ఎంత నీరు ఎన్ని విధాలుగా యివ్వడానికి వీలుంటే అన్ని విధాలా యివ్వాలి టాక్సిన్లవల్ల వాంతి యేర్పడి నీరు ఇమడకపోతే మంచుగడ్డ మధ్యపెట్టి చల్లార్చి మెల్లిగా చెమ్చాడీద చెమ్చా తాగా త్రాగించాలి ఇందువల్లనే దాహం నిలిచిపోవచ్చును అప్పుడూ ఇమడక నాలుక తడియారిపోతున్నప్పుడు వైద్య సహాయం పొంది వెయిన్ ద్వారా నీటినీ ఆహార పదార్థమును శరీరానికి అందజేయవలసి వుంటుంది

టాన్సిలైటిస్ ఉన్నప్పుడు రోగికి మలబద్ధకం ఉండరాదు చిన్న పిల్లలలో విషజ్వరములున్నప్పుడు మలబద్ధకం కూడా ఏర్పడితే చిన్నబిడ్డ గుణం (Infantile Convulsions) ఏర్పడుతుంది

గ్లిసరిన్ ఎనిమా ఇచ్చిగానీ గ్లిసరిన్ సప్పోజిటరీ (Glicerine Suppsitory) ఉపయోగించికాని ప్రతిదినం విరేచనం అయ్యేటట్లుగా చూడాలి ప్రతి యింట్లోనూ థర్మామీటరులాగే గ్లిసరిన్ ఎనిమా సిరింజీ, గ్లిసరిన్ వుండడం చాలా అవసరం ఇది పెద్ద ఖరీదయిన పరికరం కాదు మూడు నాలుగు రూపాయిలకన్నా ఎక్కువ వుండదు కానీ వైద్య సహాయం అందుబాటులో లేనిచోట దీనిని ఉపయోగించడం తెలిస్తే ప్రాణ రక్షణం చేసుకోంటానికి వీలుంటుంది చిన్న బిడ్డ గుణం నూటికి 90 మందిలో మలబద్ధకంవల్ల యేర్పడుతుంది ఒక ఎనిమాయిచ్చి విరేచనం అయ్యేటట్లు చేస్తేనే ఫిట్లు నిలచిపోవచ్చును

మలాశయంలో, మందు, గ్లిసరిన్, వంటి పదార్థములను ఉంచడానికి వినియోగించే సాధనమును 'సపోజిటరీ (Subpository)' అంటారు ఇది ఒక రకమైన మైనంతో చేయబడి, పచ్చి మిరపకాయ ఆకారంకలిగి వుంటుంది సాధారణంగా కోకో బట్టర్ అనే వెన్నవంటి పదార్థంతోగానీ, జెలెటిన్ అనే వస్తువుతోగానీ వీటిని తయారు చేస్తారు ఈ వస్తువులు శరీరంలోవుండే ఉష్ణస్థితికే కరిగిపోతవి నీళ్ళలోనో, సబ్బు నీళ్ళలోనో ముంచి కొనదేరినవైపు ముడ్డిలోవుంచి వ్రేలితో లోపలికితోసి వెయ్యాలి ఆ వేలుకు గోరు పెరిగివుండరాదు రబ్బరుతోచేసిన వ్రేలిగ్లా (Fingerstall) తొడు

(55—వ పేజీ చూడండి)

# రాయలసీమ క్షామానికి బాధ్యులెవరు?

# ఆర్థిక సంఘాధ్యక్షుని విపరీతధోరణి

రాష్ట్ర శాసనసభలోని రాయలసీమ సభ్యులు క్రిందటివారం శ్రీ కడప కోటిరెడ్డి అధ్యక్షత క్రింద రాజధానిలో సమావేశమై తమ నాలుగు జిల్లాలలో క్షామబాధను శాశ్వతంగా నిర్మూలించడానికి వ్యావసాయికంగా పారిశ్రామికంగా అభివృద్ధి పరచడానికి ఒక దశవర్ష ప్రణాళికను అమలుజరపాలని, ఈ అభివృద్ధి కార్యక్రమాలను శ్రద్ధగా చురుకుగా నిర్వహించడానికి వెనుకటి రాయలసీమ బోర్డును పునరుద్ధరించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు దశవర్ష ప్రణాళిక క్రింద మేజర్, మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులు నిర్మించాలని పదేళ్లపాటు ఏటా కోటిరూపాయలు వ్యయపరచి బావులు త్రవ్వించాలని విద్యుచ్ఛక్తి సప్లయిలో వ్యవసాయానికి ప్రాధాన్యం ఇవ్వాలని అన్నారు చిన్న ఉక్కుమిలు నూలుమిల్లు కాగితం ఫ్యాక్టరీలను ఏర్పాటు చేస్తూ గ్రామీణ ప్రాంతాలలో కుటీర పరిశ్రమలను వృద్ధిచేయాలని అర్థించారు రాష్ట్రప్రభుత్వ ఆదాయాధారాలు పరిమితంగా ఉన్నందున వచ్చే పదేళ్ల మీద కేంద్రప్రభుత్వం 50 కోట్ల రూపాయలు రాయలసీమ అభివృద్ధికి మంజూరు చేయాలని విన్నవించారు ఈ తీర్మానాలలో అనుచితమైనదిగాని ఆచరణసాధ్యంకానిదిగాని ఏదీ లేదు కాని ఇంకా ఇటువంటి సమావేశాలు జరిపి ప్రత్యక్షంగా కన్పిస్తున్న రాయలసీమ బాధలను ప్రభుత్వ దృష్టికి తేవలసిన అవసరం కలుగుతున్నదంటే ఆశ్చర్యం కలుగకమానదు

ఆంధ్రప్రాంతాలు ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి విడిపోయి 8 సంవత్సరాలు గడిచింది ఆంధ్రప్రదేశ్ అవతరించి కూడా 4½ సంవత్సరాలైంది ప్రభుత్వ రథసారధ్యం వహించి ఇంతవరకూ రాష్ట్రాభివృద్ధి కార్యకలాపాలు నిర్వహించిన ముఖ్యమంత్రులిద్దరూ రాయలసీమవారే అయినా ప్రథమ ద్వితీయ ప్రణాళికలలో రాయలసీమ పట్ల శ్రద్ధ వహించలేదన్నా మూడో ప్రణాళికలో కూడా రాయలసీమ పథకాలు ఆట్టే చేర్చలేదన్నా ఎవరిని నిందించాలి? రాయలసీమ క్షామం శతాబ్దాల నాటిది గత 50 ఏళ్ళలో కనీసం ఇందుకు 100 కోట్లయినా ఖర్చుపెట్టి ఉంటామని దీర్ఘకాలికనివారణ పథకాలను దృష్టిలో పెట్టుకొని చేసినది కాదు కనుక ఈ డబ్బంతా వృథా అయినదని ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్య ఒప్పుకున్నారు ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాతనైనా అటువంటి పథకాలు వేసుకొని శాశ్వతంగా క్షామనివారణకు పూనుకున్నారా? లేదు

నిజానికి ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణాకన్నా రాయలసీమ పరిస్థితి చాలా అధ్వాన్నమని అందరికీ తెలుసు తెలంగాణా వెనుకబడినదే గాని నిరంతర క్షామబాధ మాత్రం లేదు ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాలుగేళ్లలో తెలంగాణాలో జరిగినంత వ్యవసాయిక పారిశ్రామిక అభివృద్ధి రాయలసీమలో కూడా జరిగి ఉంటే ఈనాడీ సమావేశ ఆవశ్యకత ఉండేదేకాదు

రాయలసీమలో తుంగభద్ర ప్రాజెక్టు మినహాయిస్తే పెద్ద ప్రాజెక్టు ఏదీ లేదు పెద్ద నదులేమి లేవు గనుక, అటువంటి ప్రాజెక్టులకు ఆస్కారం కూడా లేదు అయినా మధ్యరకం చిన్నతరహా ప్రాజెక్టులనైనా క్షామబాధ నివారణకు అవసరమైనంతగా ప్రభుత్వం నిర్మిస్తోందా అంటే అదీ లేదు చిరకాలంగా కడపజిల్లా ప్రజలు కోరుతున్న గండికోట ప్రాజెక్టు ఈనాటికీ గగనకుసుమంగానే ఉంది ప్రభుత్వానికి డబ్బులేదు నాలుగో ప్రణాళికలోనైనా ఈ ప్రాజెక్టు రాదు అని ఇటీవల జిల్లా రైతు మహాసభలో ఆర్థికమంత్రి నిర్మొగమాటంగా చెప్పారు ఇక పరిశ్రమల విషయంలో చూచినా తెలంగాణాకు రాయలసీమకు సహస్రం తేడా ఒకటి రెండు నూలుమిల్లులు సిమెంటు ఫ్యాక్టరీ తప్ప పెద్ద పరిశ్రమలు లేవు రాయలసీమ రత్నగర్భ అయినా ఖనిజసంపద పుష్కలంగా ఉన్నా వినియోగంలో తెచ్చుకోగల అదృష్టం పట్టలేదు

ఈ విషయంలో ప్రభుత్వం చేయవలసిన దెంతో ఉండగా ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్య తమ ప్రారంభోపన్యాసంలో రాయలసీమ అభివృద్ధికి ఇది కావాలి అది కావాలి అని అడదంతా ఎవరో చేయాల్సి ఉన్నట్లు మాట్లాడారు ఇదివరలో గోపాలస్వామి అయ్యర్ సంఘం సుబ్బారావు సంఘం భట్టాచారి సంఘం సమర్పించిన నివేదికలు ఏమైనాయో అవి ఎంతవరకు అమలు జరిగాయో వివరించక ఆ నివేదికలను దృష్టిలో పెట్టుకొని పనులు నిర్ణయించాలని మరో బృహత్ప్రణాళిక రచించాలని వారు సెలవిచ్చారు ప్రణాళికలకు కొదువలేదు ఎప్పుడైనా తయారుచేయవచ్చు కాని వాటిని అమలుజరిపే విషయంలో ఎంత శ్రద్ధ వహిస్తారన్నదే ప్రశ్న పై మూడు సంఘాల నివేదికలకు పట్టిన గతే ఈ ప్రణాళికలకు కూడా పట్టవచ్చు

రాయలసీమలో బోలెడన్ని పరిశ్రమలు పెట్టుకో వచ్చన్నారు ముఖ్యమంత్రి నిజమే పెట్టే దెవరన్నదే ప్రశ్న ప్రభుత్వానికి తాహతులేదు ప్రయివేటు పారిశ్రామికులు ముందుకురారు వారు ముందుకు వస్తేగాని మోక్షంలేదు పరిశ్రమల సంగతి దేవుడెరుగు ముందు కనీసం నీటి కరువు తీర్చడానికి బావులు పంటలు పోయి క్షామబాధ పడకుండా చిన్నచిన్న ప్రాజెక్టులు కడితే అదే పదివేలు డబ్బు లేదన్నది ఒక నెపంకారాదు ఒక పెద్ద ప్రాజెక్టు కట్టేకన్నా పది చిన్న ప్రాజెక్టులు నయం త్వరగా పూర్తి అయి సద్యః ఫలితాలు ప్రజ లనుభవించవచ్చు అంతేగాని ప్రతి తడవా క్షామం వచ్చిన తరువాత మేల్కొంటామంటే రాయలసీమ స్థితి శాశ్వతంగా ఇప్పటిలాగే ఉంటుంది

పోతే ఈ సభవారు ఆమోదించిన తీర్మానాలలో ఆక్షేపణీయమైనది రాయలసీమ బోర్డు పునరుద్ధరణ తీర్మానం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉండగా ఏర్పాటైన ఈ బోర్డు ఆంధ్రరాష్ట్రం వచ్చిన తర్వాత ప్రాంతీయ ధోరణికి ప్రతిబింబంగా ఉంటుందని ఇక రాయలసీమ అభివృద్ధి బాధ్యత సొంత రాష్ట్ర ప్రభుత్వానిదే గనుక ఇది అనవసరమని రద్దుపరచారు ఒకవైపు తెలంగాణ ప్రాంతీయ సంఘమే అనవసరమని పలువురు అభిప్రాయపడుతుండగా రద్దయిపోయిన రాయలసీమబోర్డును

(55 వ పేజీ చూడండి)



(పై) కొటూరు వెంకటేశ్వరరావుగు ఇటీవల బందరులో సన్మానం జరిగింది ఉపరాష్ట్రపతి డా॥ ఎస్. రాధాకృష్ణన్ వారిని సత్కరిస్తున్న దృశ్యం

'జ్వరం వచ్చినట్టుందా?

రవ్వంత **అమృతాంజనము** రాయండి

నిమిషంలో తగ్గుతుంది

జలుబూ, జ్వరాలూ, ఒళ్లు నొప్పులు — వీటన్నిటికీ అమృతాంజనం ఉపయోగించండి. మీ కుటుంబానికది శ్రీరామరక్ష. నొప్పి కలిగినప్పుడు ఒక్క పసరు రాస్తే చాలు. ఇంట్లో ఒక్క సీసా ఉంటే నెలల తరబడి ఆటవస్తుంది.

AMRUTANJAN Pain Balm Amrutanjan Limited

అమృతాంజన్ లిమిటెడ్ మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1

IWT AM-1477

---

# బిన్ టెక్స్
## చేనేత వస్త్రాలు

BINNY & CO (MADRAS) LTD. MADRAS — BINTEX

చెక్కు చెదరని—రంగు చెరగని—చక్కటి బట్టలు

బిన్నీవారి సహాయ సహకారాలతో తయారై విక్రయించబడుతున్నాయి

లుంగీలు — తలగడా గలీబులు — చీరెలు — తువ్వాళ్లు

దుప్పట్లు — ధోవతులు — తెరలుగానూ, బల్లలమీదా వాడే బట్టలు — చొక్కా గుడ్డలు

బిన్ టెక్స్ చేనేత వస్త్రాలను మీరు కళ్లుమూసుకొని కొనవచ్చు. గట్టి దారమే వాడాలని ఖచ్చితంగా చెప్పి వేయిస్తారు బిన్నీవారు సాంకేతిక విషయాలలో సలహాలు, డిజైన్లలో సూచనలూ ఇచ్చి తోడ్పడతారు రంగు వెలిసిపోకుండా, బట్ట పిగిలిపోకుండా కొలతలు ఖచ్చితంగా ఉండేలా కట్టుదిట్టంగా తయారయ్యేట్లు చూస్తారు. మా అనుమతిపొంది, ఈ క్రింది బోర్డును ప్రదర్శించే బిన్నీమిల్స్ స్టాకిస్టులవద్ద బిన్ టెక్స్ చేనేత వస్త్రాలు దొరుకుతాయి.

WE STOCK

QUALITY FABRICS

BINNY & CO. (MADRAS) LTD

బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్ మద్రాసు.

IWT/BX/BX-1390

# హరివంశము

సూర్యు డస్తమించినాడు చంద్రు డింకను ఉదయించలేదు చీకటులు పరశివుడు ధరించిన గజాసురుని చర్మముయొక్క కాంతులను పోలి కాశికలో వ్యాపించినవి ప్రమథులు పట్టిన కరదీపికా సహస్రములో అన్నట్లు తారకలు వెల్గినవి ఆ చీకటిని, ఆ తారకా సహస్రములను చూడగా భగవంతునకు అనిపించినది పరమశివుడు గజదైత్యుని సంహరించి వానికి వరమును ప్రసాదించినాడు అది ఏమి వరము వాడు స్వామిని "స్వామి! మీరు నన్ను సంహరింపుడు కాని ఒక్క వరము దయచేసి మాత్రము ఆ సంహారమును జరపవలయును నేను స్వామికి విరోధినా! కాదు భక్తుడను స్వామి నన్ను చంపి, నా చర్మమును ధరించవలయును పరమశివుడు అట్లులనే చేసినాడు పరమశివుడు కృత్తివాసు డైనాడు తల్లి ఆయన ఆవేషమును చూచి మందహాసము చేసినదో! ఆ మందహాసము ముత్యములను పోలి, ఆకాశమును, తారకములను పోలి, అలంకరించినదో!" భగవంతుడు రథమును అధిరోహించినాడు అందరును అధిరోహించినారు మరల రథములు కదిలినవి శ్రీకృష్ణ సారధికము రథము ముందున్నది ఆవెనుక ఉద్ధవాదికాధిష్ఠితము, దారుక సారధికము రథము కదిలినది శ్రీకృష్ణదేవుడు రథమును కదుపగా చీకటులు విరిసినవి ఎవ్వరో కరదీపికలు పట్టి దారిని చూపుచున్నట్లు ప్రత్యంత రాత్రి అంతయు వెలుగులమయమైనది ఒక్క కృష్ణునకు, ఒక్క బలరామునకును తప్ప, ఆ వెలుగుల అర్థమేమో తెలియలేదు మహానందుడు ఆకాశమువంక చూచినాడు చంద్రుడు ఉదయించలేదు మరి ఈ వెల్గు లేమి! ఈ వెన్నెలలేమి! అతడు శ్రీ కృష్ణదేవుని యడగవలయు ననుకున్నాడు అడుగలేదు రథము ముందునకు సాగిపోవుచున్నది రజతశైలమును పరమశివుడు లలాటంతపకృపీటయోనిచేత కరిగించి పోసినట్లు వెల్గుమ ముందునకు సాగినది మహానందుడు రథములో నుండి వెనకకు చూచినాడు ఆ వెల్గులు వెనక లేవు ముందు ఉన్నవి రథము ఆ వెల్గులు దారిగా ముందుకు సాగుచున్నది మహానందుడు తాను కాశిని గూర్చి బహు మహత్వములను వినినాడు ఇట్టి మహత్వమును, అద్భుతమును చూడలేదు అతడు పట్టలేక పోయినాడు శ్రీకృష్ణదేవుని దిక్కయి "శ్రీకృష్ణ! ఇది అద్భుతమయ్యా!" అనినాడు

శ్రీకృష్ణదేవుడు మాటాడలేదు ఆయన ఆలోచనా ధీమగ్నైనట్టులున్నాడు మహానందుడు మరల శ్రీకృష్ణదేవుని సంబోధించినాడు

"శ్రీకృష్ణ!"

"ఆచార్య!"

"నేను ఆచార్యుడను కాదు గీచార్యుడను కాదు పట్టి మహానందుడను జడుడను నేను ఆచార్యుడనే అయినచో ఈ అద్భుతము నాకు అర్థమయ్యెడిది కాదా?"

"ఏ అద్భుతము!"

మహానందునకు ఆశ్చర్యమైనది

"నీకు కన్పించుటలేదా!"

"నేను ఏదియో ఆలోచించుచున్నాను"

మహానందునకు లాభము లేదని తెలిసిపోయినది అతనికి ఏదియో ప్రసంగము చేయవలయునని యున్నది అత డనినాడు

"ఏమి ఆలోచించుచున్నావు!"

"పరమశివుని గూర్చి ఆలోచించుచున్నాను"

"మేము అది వినరానిదా!"

"నీవు అన్నియు తెలిసినవాడవు"

మహానందుడు మరల మాటాడలేదు అతనికి అప్పుడేమియో తెల్వి అతనిలో ప్రవేశించినది శ్రీకృష్ణదేవు డనినాడు

"మహానంద! నేను ఏమి ఆలోచించుచున్నానో చెప్పమందువా?

"నేను వినుటకు సిద్ధముగా నున్నాను"

"నేను చీకటిని చూచుచున్నాను అది యెట్టులున్నది! పరమశివుడు ధరించిన గజచర్మమును



పోలియున్నది దిగ్వసనుడయిన ఆయన భక్తుని వచనమును పాటించి ఆ చర్మమును ధరించినాడు అదిగూడ దిక్కులకు వలెనే నల్లనైనది ఆ చర్మము లభించుట ఎట్టులైనది అది ఆలోచించుచున్నాను చెప్పమందువా?"

"వద్దందునా!" అన్నాడు మహానందుడు

"మహానంద! పరమశివుడు భక్తసులభుడు అనుటకు ఇంతకన్న వేరైన వృత్తాంతము ఏమి ఉన్నది గజాసురుడు శోణిత పురాధిపతి పరమ శివభక్తుడు వాని రాజ్యములో సుఖమే కాని దుఃఖము లేదు వాని రాజ్యము, వాని శివభక్తి, దేవతలకు మాత్సర్య కారణమైనది దేవేంద్రుడు వానిని గూర్చియే ఆలోచించుచుండెను రాక్షసుడు ఎంత భక్తుడైనను రాక్షసుడే వాని భక్తి గూడ ఒకప్పుడు సర్వలోక ప్రళయహేతువు కావచ్చును ఇంద్రునకు ఇదియే ఆలోచనయైనది ఒక్కదినమున నారదుడు తన సన్నిధికి రాగా, ఇంద్రుడు ఈమాటనే అతనితో ననెను ఆ నారదుడు త్రిలోకసంచారి అతనికి తెలియని వృత్తాంతమేమి యున్నది అతడును అవును అనినాడు ఇంద్రుని మనస్సు ఎరిగినాడు అతనికి ఏది కావలయునో అది లభ్యమైనది

నారదుడ గజాసురుని శోణితపురమునకు పోయినాడు. నిండు కొలువుండి సింధురదైత్యుడు నారదుని పూజించినాడు వానికి ఆయన ఎందుకు వచ్చెనో తెలియలేదు

నారదుడు గజాసురునితో అన్నాడు

"నారద మహర్షి! తాము ఏదియో పనిమీద వచ్చినట్లున్నారు"

"ఔను! సింధుర! నీ పనిమీదనే వచ్చినానయ్యా! నీవు పరమశివ భక్తుడవు కదా! మరి ఆ శివుడేమో అచ్చట నెచ్చటో వెండి కొండమీదనో కాశికలోనో ఉండును మరి నీవేమో యిచ్చట నుంటివి ఇది ఏమి భక్తి! ఆయన నీతో ఉండవలెను నీ హృదయములో నివాస ముండవలెను అప్పుడు నీ భక్తి భక్తియగును" అనినాడు నారదుడు

నారదుని మాటలు వారణదైత్యునికి నచ్చినవి అతడు పరమశివుని గూర్చి తపస్సు చేసినాడు భక్తవశంకరుడు శంకరుడు అతనికి ప్రత్యక్ష దర్శనమును ప్రసాదించి "సింధుర! ఏమి కోరి తపస్సును చేయుచున్నావు" అని ప్రశ్నించినాడు

"స్వామి! మీరు నా హృదయములో నివాసముగా నుండగోరి తపస్సు చేయుచున్నాను" అనినాడు సింధురుడు

"నేను నీ హృదయములో లేనని ఎవరు చెప్పినారురా! సింధుర!" అనినాడు పరమశివుడు

"స్వామి! మీరు వెండి కొండమీద నున్నారు కాశికలో ఉన్నారు ఆ వుండుట నా హృదయములో నున్నట్లా! మీరు నా హృదయములో కాపురము చేయవలయును" అనినాడు సింధురుడు

పరమశివుడు వానిని చూచి మందహాసము చేసినాడు "ఓరి! అజ్ఞాని" అన్నాడు "సరే! నీ యిష్టము చొప్పుననే కానిమ్ము" అన్నాడు

అంతలో పరమశివుడు పార్థివలింగమై సింధురుని హృదయములో ప్రవేశించినాడు కైలాసమున, కాశికలో అందరును పరమశివుడు కనుపించక తల్లడ పడినారు అపర్ణయు తల్లడ మందినది ఇప్పుడు వచ్చును, అప్పుడు వచ్చును అనుకొనిన స్వామి రాకపోవుట ఆమెకు భీప్రదమైనది ప్రమథులతో, రుద్రగణములతో నాలోచించినది స్వామిని అన్వేషించుటకు గణములు బయలుదేరినారు కామరూపులై సర్వలోకములను అన్వేషించినారు శోణితపురమున సింధురుని హృదయము దేవాలయముగా శివుడు పార్థివలింగమై నెలకొనియుండినాడని తెలుసుకొనినారు పార్వతియు తెలిసికొన్నది ఇప్పుడు ఏమి చేయవలయును? పార్వతి విష్ణువును తలంచినది లక్ష్మీజనార్దనుని తలంచినది మహానంద! లక్ష్మీజనార్దనుడు అపర్ణకు సోదరుడయ్యా! ఆయన ఆమె తలంపున బడి కైలాసమునకు వచ్చినాడు అపర్ణ ఆయనతోనన్నది

"లక్ష్మీజనార్దన! పరమశివుడు పార్థివలింగ రూపధారియై శోణితపురాధినేత సింధురుని హృదయమున అధివసించుచున్నాడు కైలాసమును, కాశికను వదలిపెట్టినాడు మరి నన్ను నీవు రక్షించవలయును లలాటంతపసప్తసప్తిని తీసికొని రావలయును"

(52–వ పేజీ చూడండి)

హారీత శివశర్మ

సిరి సమస్య అసలు పరిష్కారమే అవగనుగొన్నారు పరిస్థితులు కూడా అనుకూలంగా లేవనిపించింది!

“ఈ దినంతో నీకు చెప్పవలసినదంతా చెప్పేశాను యూనివర్శిటీ పరీక్షలు నెలరోజులు కూడాలేవు బాగాచదువుకొని క్లాసు తెచ్చుకో సుశీలా ఇక నాకు చెప్పడానికి తీరిక ఉండదు నాకు కూడా యూనివర్శిటీ పరీక్షలు దగ్గరకొచ్చాయి కదా ఈకొద్ది రోజులు కష్టపడి బాగా చదువుకుంటావుకదూ?”

“అల్లాగేనండీ రామంగారూ! మీరు నాకోసం చాలా శ్రమపడ్డారు మీ కాలాన్ని వృధాచేసుకొని నాకోసం పాటుపడ్డారు మీ వల్లనే నే నీనాడు క్లాసులో ఫస్టుగా వుంటున్నా చాలా కృతజ్ఞురాలిని”

‘నీకు చదువుచెప్పినందువల్ల నాకాలం వృధా కాలేదు సుశీలా సద్వినియోగం చేసుకొన్నా నేను ఎప్పుడో నేర్చుకున్న పాఠాలు, విషయాలు ఇప్పుడు నీకు చెప్పినందువలన, నాకు బాగా వంటబట్టాయి అది సరేగానీ సుశీలా” అంటూ రామం సూటిగా సుశీల కండ్లల్లోకి చూచాడు

“ఏమండీ” అంది సుశీల అతనిదగ్గరగా వచ్చి, అతనివేపే చూస్తూ

ఏం చెప్పాలో తోచలేదు రామానికి మౌనంగా వూరుకున్నాడు

‘ఇంకా ఏమైనా చెప్పాల్సింది వుందా అండీ?” ప్రశ్నించింది సుశీల చెప్పాల్సిన సంగతులు నిజంగా రామానికి చాలా వున్నాయి కానీ చెప్పడానికే జంకుతున్నాడు సుశీలను ప్రేమించాడు రామం వద్దను కుంటూనే ప్రేమలోపడ్డాడు ఇంతమటుకూ తన హృదయాన్ని విప్పిచెప్పలేకపోయాడు రామం ఎప్పటికప్పుడు చెప్పాలనుకునేవాడు కానీ ఎందుకో చెప్పలేకపోయాడు ఆ విషయం చెప్పకూడదని నిర్ణయించుకున్నాడు ఆ నిర్ణయం ప్రకారం తన ప్రేమవిషయం తెలుపలేదు కానీ ఈదినం ఆవిషయం చెప్పివేయాలనిపించింది అందుకనే పిల్చాడు కానీ నోరు మెదిపి మాట్లాడలేక పోయాడు

ఏమీలేదు సుశీలా! ఈ కొద్దిరోజులు బాగా చదివి క్లాసు తీసుకురా అంతే ఇక వెళ్ళు”

“వెళ్తున్నానండీ” అంటూ సుశీల ఒక వాడి చూపు వాలు కన్నుల్లోనుంచి సూటిగా చూసి, అది రామంహృదయానికి తాకేలా చేసి మెట్లుదిగి క్రిందకు వయ్యారంగా వెళ్ళిపోయింది

ఆమె వెళ్ళినవేపు చూస్తూ నిస్తబ్ధగా వుండి పోయాడు రామం ఈ దినానికి ఇది క్రొత్తకాదు తనకు ఆమె ప్రతిదినము పైవేటుకని తన వద్దకు రావటం, తనకు తెలిసింది చెప్పటం, చదువు చెప్పేటప్పుడు ఇద్దరికళ్ళూ ఆడుకోటం, ఆమె వెళ్ళేముందు తన కళ్ళలోకి చూపుల తూపులు విసరటం, అవి తన హృదయాన్ని తాకి తీయని బాధ కలిగించటం—ఇదంతా ఇంచుమించు ఎనిమిది నెలలుగా జరిగిపోతున్న తతంగమే! అయినా అది ఏరోజు కారోజు క్రొత్తగా, తీయగా, మరీ మరీ మధురంగా వుంటూ వుంటుంది సుశీల తనను ప్రేమించింది ఆవిషయం తనతో సూటిగా చెప్పకపోయినా, ఆమె హృదయాన్ని తను అర్థంచేసికున్నాడు కొన్ని సందర్భాలలో సుశీల తనహృదయాన్ని చూచాయగా తెలిపింది కూడా మరి తనో? తనకు తెలియకుండానే తనహృదయం సుశీలపరమైంది ఎంత ప్రయత్నించినా తనహృదయాన్ని అదుపులోవుంచుకొనలేకపోయాడు ఒక్కోసారి పాఠాలు చెప్తూ తను అలాగే రెప్పవాల్చకుండా ఆమెవంక చూచేవాడు తన్ను ఆకర్షించడానికే అన్నట్లు ఆమె మరింత అందంగా టాయిలెట్ అయి వస్తుండేది చదువు చెప్పించుకోడానికి ఇంత అందంగా టాయిలెట్ కావాలా? అని తను ఆలోచనలోపడేవాడు ఆమె వైపు తదేకంగా చూస్తూ “అలా చూస్తే నాకెలాగో అనిపిస్తుంది, రామంగారూ” అంటూ సుశీల తన కండ్లల్లోకి చూస్తూవుంటే తనేలాగో అయిపోయేవాడు ఆ చూపులవలలో తగులుకొని, తప్పులు చెప్పేవాడు సుశీల ఎన్నిసార్లో సరిదిద్దింది తనను సుశీలమాత్రం తక్కువదా? ఎప్పుడూ తనవేపేచూస్తూ వింటూ వుండేది “వింటున్నావా? లేక ఎక్కడన్నా చూస్తున్నావా?” అని ప్రశ్నిస్తే, “ఎక్కడనో చూస్తూ వింటున్నా” అని సమాధానం వచ్చేది ఆ ముంగురులు సవరించటం, పూలు సరిదిద్దుకోటం, జారిపోతున్న నైలాన్ పైటను పైకి లాక్కోడం, ఇవన్నీ చెప్తున్న చదువును చెప్పకుండా చేసేవి

ఈవిధంగా ప్రైవేట్లతో కాలం గడవబట్టే, తను సుశీలచే ఆకర్షింపబడ్డాడు తన హృదయాన్ని కట్టుదిట్టంచేయాలనీ, తను ఈ ప్రేమవ్యవహారాలజోలికి పోరాదనీ ఎన్ని సార్లో నిర్ణయించుకున్నాడు కానీ ఫలితం శూన్యం మరి తను ఏం చేయగలడు? సుశీల అందం అటువంటిది “బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులు” అటువంటిది తననగా ఎంత?

“రామం పైకి రావచ్చునా?” అన్న పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడు మెట్లవద్దకువెళ్ళి క్రిందకు చూశాడు

“ఓ! మీరా, రండి” అంటూ సాదరంగా ఆహ్వానించాడు

“ఏంచేస్తున్నావు నాయనా? అనవసరంగా నేనొచ్చి, నీ చదువుకు భంగం కలిగిస్తున్నానేమో” అంటూ సీతారామయ్యగారు, రామం చూపిన పడక కుర్చీలో కూర్చున్నారు

‘ఎంతమాట? మీరొస్తేనా చదువుకు భంగం కలుగుతుందా? నేనింకా చదువుకోడానికి కూర్చోలేదండీ”

“నేను వచ్చిన పని చెప్తాను రామం నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి వీలుంటుందా? నీ చదువుకు భంగంలేకుంటే నే నిప్పుడే మాట్లాడుతాను”

“దానికేమండీ? మీవంటి పెద్దవారు మాట్లాడాలని వచ్చినప్పుడు వీలుండదంటానా?”

“దానికికాదు నాయనా! ఇప్పుడు నీకు పరీక్షల సమయం ఈ కాలమును సద్వినియోగంచేసుకోవలసినది ఇప్పుడే అటువంటిసమయంలో ఏవేవో గొడవలు నీతో మాట్లాడి నీ కాలాన్ని వృధాచేయటం నాకిష్టంలేదు ఎట్లాగూ నీతో ఆ విషయాన్ని చెప్పిపోదామని వచ్చాను చెప్పమంటావా?”

“నిస్సంశయంగా చెప్పండి మీతో మాట్లాడినంతలో వృధాకాబోయే టైమ్ వుండదు”

“ఏంలేదు నాయనా! మీ నాన్నగారూ, నేనూ చాలా ఆప్తమిత్రులమనీ, ఒకే ఆఫీసులో పని చేసినామనీ, అంతేకాక దూరపు బంధువులమనీ నీకు తెలుసు ఆ బంధుత్వాన్ని మరింత సన్నిహితం చేయాలని నా అభిలాష మా అమ్మాయి, సుశీలను నీకిచ్చి కన్యాదానంచేయాలని నా కోరిక ఈ విషయంలో అమ్మాయి అడ్డుచెప్పదు ఎటొచ్చీ నీ అభిప్రాయం కావలసి వచ్చాను నీ అభిప్రాయం తెలిసితే మిగతావిషయాలన్నీ నేను చూచుకుంటాను ఏమంటావ్?”

ఏమని చెప్పాలో రామానికి తోచలేదు సుశీల తనను ప్రేమించి పెండ్లాడగోరింది నిజంగా తను అదృష్టవంతుడే సీతారామయ్యగారే స్వయంగా వచ్చి ఎల్లనిస్తానని అడుగుతున్నారు ఇక అడ్డు ఏమిటి? తను “ఊఁ” అనడమే కానీ అనలేడు తను ఈ పెండ్లికి తను సిద్ధంగాలేడు తను ఎంత అదృష్టవంతుడనుకున్నాడో అంత దురదృష్టవంతుడు తనసంగతంతా సీతారామయ్యగారితో చెప్పి వేయాలి

“ఒకవిషయమండీ! నా పెండ్లి సంవత్సరం క్రితమే నిశ్చయమైపోయింది ఎమ్ ఎస్సి మొదటి సంవత్సరం అయిపోయినప్పుడే నా పెండ్లి జరిగిపోయివుండవలసినది నేనే ఆపుచేయించాను ఈ కోర్సు అయిపోయేవరకూ పెండ్లి చేసుకోనని చెప్పాను కోర్సు అయింతర్వాత ఆ అమ్మాయినే చేసుకుంటానని మా నాన్నగారికీ, పిల్ల నాన్నగారికి మాట ఇచ్చివచ్చాను నా పరీక్షలు ఈనెలాఖరుతో అయిపోతాయి నేను వూరికెళ్ళిన ఓ మాసంలోగా నా పెండ్లి జరిగిపోవచ్చును నా పెండ్లి నిశ్చయమైపోయిందని మీకు చెప్పాను ఇక ఇటువంటి పరిస్థితులలో, నేను మీకేలాటి సమాధానం చెప్పాలో తోచటంలేదు”

క్షణకాలం నివ్వెరపాటుతో రామంవైపు చూచారాయన మౌనంగా తల వంచుకొని కూర్చున్నాడు రామం తను అడగటం తడవుగా, రామం వప్పుకుంటాడుగదా అన్న ఉద్దేశ్యంతో వచ్చిన సీతారామయ్యకు అనుకోకుండా ఊహించని పరిస్థితి ఎదురైంది రామానికి సుశీల నిచ్చి చేయాలన్న కోరిక ఆయనకు చాలాకాలంగావుంది పైగా సుశీల రామం ప్రేమించుకోడానికి కారకుడుకూడా ఆయనే రామం చెప్పిన సమాధానం ఆయన ఊహను తల్లక్రిందులు చేసిందని చెప్పవచ్చు కానీ ఇంత మాత్రానికి చలించేరకం కాదు కొంతసేపు ఆలోచించారు

‘దైవానుగ్రహం వుండబట్టి నీకింకా పెండ్లి కాలేదోయ్! ప్రేమించిన అమ్మాయిని పెండ్లాడక

(46–వ పేజీ చూడండి)



# ఆదర్శాలు అంతర్యాలు

## సింగరాజు లింగమూర్తి

### జరిగిన కథ

పోలయ్య అంటే ఆ ఊళ్ళో చాలా మందికి అభిమానం, గౌరవం కొంతమందికి అతనిపై అయిష్టం కలగడానికి కూడా కారణం లేక పోలేదు నరసింహప్ప చలమయ్య ఒకరినొకరు సాధించుకోవాలని ఎత్తులు వేస్తూ ఉంటారు నరసింహప్ప పోలయ్యను తన పక్షంలో చేర్పించటానికి ప్రయత్నిస్తాడు పోలయ్య కు, నరసింహప్ప పెద్దకూతురు ఇందిరకు, రాజారావు ట్యూషన్ చెబుతూ ఉంటాడు ఇందిర చెల్లెలు లలిత రాజారావును ప్రేమిస్తుంది నరసింహప్ప రాజారావు ట్యూషన్ మాన్పిస్తాడు పాఠశాల వార్షికోత్సవానికి వచ్చిన మంత్రి ఎన్నికలలో పోటీ చెయ్యమని రాజారావుకు సలహా ఇస్తాడు రాజారావును మంచిచేసుకునేందుకు చలమయ్య అలివేణిని నియోగిస్తాడు.

రాజారావు తల వంచుకొని వీధివెంట వడుస్తున్నాడు స్కూలు వదిలిపెట్టారేమో పిల్లలు ఇండ్లకు వెడుతున్నారు అల్లంతదూరంనుంచి లలిత పుస్తకాలతో వస్తూ కనిపించింది ఆమె వెనుక కొందరు విద్యార్థులు కేరింతలతో వస్తున్నారు “తను ఎదురుగా పోవడ మెందుకు ? ఇటు ప్రక్కనుంచి వెళ్ళిపోతేనో ?” అనుకున్నాడు రాజారావు “కాని లలిత తనను చూసిందేమో ?

కావాలనే తప్పించుకుపోయా ననుకుంటుందేమో” అనుకుంటూ రాజారావు ఎదురుగ్గా వస్తున్న లలితను చూశాడు ఆమె చకచక వస్తున్నది వెనుకనుంచి వచ్చే విద్యార్థులు ఆమెనేదో అంటున్నట్టు తోచింది రాజారావుకు ఇంతలో లలిత రెండు గజాల దూరంలోకి వచ్చింది రాజారావును చూసి విద్యార్థులు ఎంతో బుద్ధిమంతుల్లా ప్రక్కలకు తప్పుకొని ఎవరిదారిని వాళ్ళు వెళ్ళిపోయారు రాజారావు నవ్వుకున్నాడు

లలిత తలెత్తిచూసింది చిరునవ్వుతో ఆ చూపుల్లో ఎన్నో ప్రశ్నలు ఎంతో ఆదరణ ఆ చిరునవ్వులో ఏవో ఆశలు, భయాలు, సందేహాలు, సంతోషాలు రాజారావుకు పొడగట్టాయి. సోగలైన ఆమె కాటుక కళ్ళలోకి చూడలేకనేమో, రాజారావు తల వంచుకొని నిలబడిపోయాడు

“బొత్తిగా రావడం మానేశారు ఇంటికి” అంది లలిత మాటలు పెగల్చుకొని నోరు తడి చేసుకొంటూ

“నీవు ఉత్త అమాయకురాలవు లలితా ! ఒక్కసారి పరిస్థితులను అవగాహన చేసుకో” అన్నాడు

“అయితే పరిస్థితులకు తలొగ్గడమేనా ?” అంది లలిత

“ఎదురీదడం ఎంత కష్టమో ఆలోచించు”

“ఆలోచించాను ఇన్నాళ్ళనుంచీ ఆలోచిస్తూనే ఉన్నాను ఒక్కటి మాత్రం నమ్మండి మిమ్మల్ని మరచిపోవడం సాధ్యం కాదని అక్క వోసారి మిమ్మల్ని రమ్మంది” అంటుంటే లలిత స్వరం జీరపడింది ఇక అక్కడ నిలబడలేక చకచక ముందుకు నడిచింది

ఆమె వెడుతున్న వంకే చూస్తూ నిలబడిపోయాడు రాజారావు అతని కళ్ళల్లో ఇంద్ర ధనుస్సు విరిసింది

“ఓహో రాజారావుగారా” అని పెద్దగా

(43-వ పేజీ చూడండి)

# నాజూకు తిండ్లు

సి రాధ

క్రట్టు, బొట్టూ తీరూ తెన్నులలో 'నాజూకు' ఉన్నట్లే, తిండి విషయములో కూడ 'నాజూకు' పెరుగుతోంది నేటి నాగరిక ప్రపంచములో ఎంత నాజూకుగా వుంటే అంత అందముగా ఉన్నామని భావిస్తారు, కొందరు ఆకలి తీరటానికా అన్నట్లు నాలుగు మెతుకులు తిని, నలుగురిలో తామెంతో నాజూకుగా ఉన్నామని మురిసిపోయే నారీమణులు కొందరు పెట్టినదాంట్లో నాలుగవ వంతు తిని, మారు వడ్డించబోతే 'కడుపు నిండిపోయిందని' లేని తృప్తి కనబరచి, అర్ధాకలితో లేచిపోయి కడుపులో ఖాళీ భాగము నీళ్ళు నింపుకొనే మగువలు కొల్లలు

ఆమధ్య ఒకసారి మా బంధువుల ఇంటికెడితే, భోంచేసి వెళ్ళమని ఒకటే బలవంతంచేస్తే కాదనలేక ఉండిపోయాము మళ్లీ మారు వడ్డించుకో నవసరము లేకుండా విస్తరి నిండుగా అన్నం, కూరలు వడ్డించారు దానికి తోడు కూరల్లో గొడ్డుకారం వేశారు వడ్డించిందే ఎలా తినాలని అవస్థపడుతుంటే ఇంకా మారు వడ్డించుకోమని బలవంతంచేస్తూ, 'ఇంతమాత్రం తినకపోతే ఎలా! తిండిలో ఇంత నాజూకు పనికిరాదు' అన్నారు నేను తెల్లమొహం వేశాను ఆవిడ 'నాజూకు' అనగానే నాకో విషయం చటుక్కున జ్ఞాపకం వచ్చింది

ఒకసారి ఏదో విందులో నా ప్రక్కన ఇద్దరమ్మాయిలు కూర్చున్నారు చాలా అప్టూడేటుగా అలంకరించుకున్నారు ఇక వాళ్ల తిండిసంగతి చెప్పక్కరలేదు చేతికెక్కడ అంటుకుంటుందోనని వ్రేళ్లతో అంటీ అంటకుండా కలిపి నోట్లో వేసుకుని, 'ఛీ ! ఏం బాగోలేదు' అని చీదరించుకుంటూ కలిపిన అన్నం ప్రక్కకి తోసేయటం, నేను పప్పన్నం తింటూండగా వాళ్లు మజ్జిగకోసం ఎదురుచూడటం జరిగింది వాళ్లు తినే తీరు చూస్తూంటే నాకు తిన బుద్ధిపుట్టలా వాళ్ల ముందు నేనో తిండిబోతులా కనుపించాను గబగబా పప్పన్నంమింగి,వాళ్లతోపాటు మజ్జిగవేసుకున్నాను

అసలు సాధారణముగా మనము ఇంట్లో తిన్నంత యిదిగా, విందులకి, భోజనాలకి వెళ్లినపుడు తినలేం వేళ మించటం, నలుగురిలో మొహమాటంతో కొంత, నాలుగురకాల తీపి, కారం వంటకాలు విస్తరినిండుగా చూచి మొహం మొత్తిపోయి సరిగా తినలేం ఏ మొహమాటం లేకుండా సుష్టుగా భోంచేసేవా రున్నారనుకోండి ! కాని నేను పై ఉదహరించిన ఆ అమ్మాయిలు అలా తినటం ఫ్యాషన్‌గా భావించి ఉండవచ్చుగాని నలుగురిలో మాత్రం అసహ్యంగా ఉందనే చెప్పాలి అంత న్టయిలుగా తినేవారు పంక్తిలో కూర్చుండకూడదు అథవా కూర్చున్నా కావలసిందేదో తినేసి నెమ్మదిగా ఆకు మడిచేయుటం ఉత్తమం

రెండేళ్లక్రితం అనుకుంటా మా యింటి కిద్దరు దంపతులు వచ్చారు హైద్రాబాదు చూద్దామని వచ్చి మా యింట్లో రెండురోజు లున్నారు భర్త ఆఫీసరు, మనిషి బలంగా బాగా ఉంటాడు భార్య మాత్రం గాలి వీస్తే ఎగిరి పోతుందేమో అన్నంత బలహీనంగా ఉండేది బి ఏ. ప్యాసయిందిట) ఆవిడ తిండి ఎంత నాజూకుగా తినేదో చెప్పలేను ఆరోజు మధ్యాహ్నం టిఫిను ఏమీ లేదని నాలుగు బిస్కట్లు పెట్టి 'టీ' యిచ్చాం 'బాబోయ్! ఇన్ని బిస్కట్లే' లని అందులో రెండు తీసేసి, రెండింట్లో ఒకటి సగం తిని సగంముక్క వదిలేసింది సాయంకాలం ఎవరింట్లోనో టిఫిను తినిందట, ఆ రాత్రి భోం చేయలేదు నాకుమాత్రం చాలా ఆశ్చర్యమేసింది ఇక ఉండబట్టలేక వెళ్లేరోజు అడిగేశాను 'చిన్నప్పటి నుంచి మీ తత్వం ఇంతేనా' అని అందుకు ఆవిడ 'అబ్బే లేదు, చిన్నప్పుడు బాగానే తినేదాన్ని కాలేజిలో చదువుతున్నపుడు అలవాటయింది నే నప్పుడు లావుగా ఉండేదాన్ని ఫ్రెండ్సంతా వెక్కిరిస్తుండే వారు దాంతో తిండి తగ్గించేశాను అలాగా చాలా అవస్థలు పడ్డాను తర్వాత జబ్బుచేసిందికూడా ఇప్పుడు బలంగా తిందామన్నా తినలేను ఎక్కువగా తిన్నానంటే అజీర్తి చేస్తుంది' అంది

నిజమే నాజూకు తిండ్లవల్ల బలహీనపై, జబ్బులుచేసి, డాక్టరుబిల్లు లయ్యేసరికి మామూలుగా తిందామన్నా తినలేరు ★

ఎప్పుడూ ఇంతే— 95

శంకర్





# నిరాశ్రయులు

**కె. యాదవ రెడ్డి**

---

కారాగృహవాసికి బయటి ప్రపంచం ఎంత అద్భుతంగా కనిపిస్తుందో ఊహించటం కష్టం, కొన్ని సమయాలలో స్వేచ్ఛ దుర్భర మనిపించినా ఆశ్చర్యంలేదు

---

జైల్లో ఆ రాత్రి గోడగడియారాన్ని చూసుకొని తొమ్మిది గంటలు కొట్టాడు కావలా పోలీసు ఆ గంటల ధ్వని చాలాదూరంవరకు చీల్చుకుంటు చుట్టుప్రక్కల వాళ్లకి కాలాన్ని సూచిస్తున్నది జైల్లోని ఖైదీ లంతా ఒకచోట చేరుకుంటున్నారు ఖైదీలకు తిండిపెట్టే సమయమది ప్రతి ఖైదీ తన అల్యూమినియమ్ ప్లేటు, లోటా పట్టుకుని ఒకర్ని — ఒకరు తోసుకుంటూ వరుసగా నిలబడుతున్నారు ప్రొద్దస్తమానం గొడ్డలా చాకిరి చేసిన శరీరాలు తిండికోసం నకనకలాడుతున్నాయి

ఖైదీలలో రకరకాల మనుష్యులు — విభిన్న వయస్సులవాళ్ళు అక్కడో ప్రపంచాన్ని సృష్టించి వేశారు వారి దుస్తులు తెల్లగుడ్డపై నల్ల చారలున్న నిక్కరు—షర్టు

ఖైదీల 'క్యూ' కదులుతూఉంది ఎదురుగా జేలర్ గొడ్డ కాపరిలా చూస్తూవుంటే ఒక వార్డెన్ వరుసగా కొలిచిన గిన్నెలతో ఒక్కొక్కడికి అన్నము చారు పోస్తున్నాడు ఆ ప్లేట్లు చేతో పట్టుకొని ఖైదీలు చెల్లాచెదరుగా, అక్కడా — ఇక్కడా కూర్చొని ఏదో ఆందోళనతో గబగబా తినేస్తున్నారు

అది సెంట్రలు జైలు చుట్టూ ఎత్తయిన గోడలు వాటిపై గాజుపెంకులు గుచ్చారు ఆ జైలుకి నాలుగు ప్రక్కలా ఇనుప తీగెలతో సరిహద్దు నిర్ణయించి ఉంది ఉత్తరంవైపు పెద్ద గేటు ఆ పెద్ద గేటులో ఒక చిన్న పిల్లతలుపు ఇప్పుడది మూసిఉంది పెద్ద—పెద్ద తాళాలతో పెద్ద తలుపు—చిన్నతలుపు

లోపల మానవులరూపంలో ఉన్న తోడేళ్లను, గొర్రెలను, దయ్యాలను, రాక్షసులను, హంతకులను ఒకచోట చేర్చి తలుపుల దగ్గర ఇరవైమంది పోలీసులు తుపాకులతో కావలా కాస్తున్నారు జైలు పెద్దగేటు పైన ఉన్న గదులలో ఇద్దరు పోలీసులు 'పహరా ఉషార్' పచార్లు చేస్తున్నారు అవతల నాలుగు కొనల్లో నలుగురు పోలీసులు అనుమానం తుపాకులను అంటిపెట్టుకొని భయంతో పడివున్నారు

ఖైదీలలో తొందర హెచ్చుతూ ఉంది ఏవో గుసగుసలు అగ్నికణాల్లా చిటపట మంటున్నాయి ఈ ఖైదీల్లో అన్నివిధాల శిక్ష లనుభవిస్తున్నవారున్నారు కొందరు కొన్ని సంవత్సరాలపాటు శిక్ష అయితే మరికొందరు యావజ్జీవ శిక్షను మోస్తున్నవారు ఉన్నారు దాదాపు 500 మంది ఉన్నారు ప్రస్తుతము కొందరి కాళ్ల గొలుసులు తీసేశారు చేతులకు బేడీలు వ్రేలాడుతున్నాయి

చివరి మెతుకు గతుక్కుని, ఆఖరిగుక్క నీరు త్రాగేశారు ఖైదీలంతా గ్లాసులు—ప్లేట్లు క్రింద పెట్టేశారు

వాళ్లమధ్యనుండి రణగొణధ్వనిని సవాలు చేస్తూ ఒక యువఖైదీ నోటితో పెద్దగా ఈల వేశాడు ఇంతకుపూర్వమే ముందుకు అడుగు వేసిన కొందరు ఖైదీలు పరుగెత్తారు అడ్డమొచ్చిన పోలీసులను తన్ని పడేశారు ఆ గుంపు

గేటుదగ్గర ఉన్న తుపాకి సిబ్బందిని ఆక్రమించు కుంది

ఏమరుపాటులో జరిగిన ఈ గందరగోళాన్ని చూసి జైలర్ నివ్వెరపోయాడు ఇంతలో కొందరు ఖైదీలు అతన్ని చుట్టు ముట్టారు

పైనవున్న గస్తీ పోలీసులు ఈ దొమ్మిని చూడ గానే తుపాకీలు పేల్చడం మొదలుపెట్టారు ఆ గుంపులో కొందరు కూలిపోతున్నారు ఇంతలో ముందుకు పరుగెత్తిన గుంపు పెద్ద గేటు తాళం విప్పేసింది గేటు విప్పుకోగానే ఖైదీల ముఠా దానివైపు పరుగుతీసింది పైనుండి తూటాలు కురుస్తున్నాయి ఖైదీలు వాటిని లెక్క చేయ కుండా దారి చూసుకుంటున్నారు చాలామంది ఎదురుగా గాయపడి పడిపోతున్నారు వీలు చిక్కిన వాడల్లా తప్పించుకుంటున్నాడు

ఎట్లాగో ఒక పెద్ద గుంపు గేటును దాటింది ఎదురుగా ఆవలి పోలీసుల కాల్పులు లెక్కచేయ కుండా ఆ గుంపు చెల్లాచెదరై పరుగెత్తుతూ ఉంది ఇనుపతీగ హద్దు దాటి ఖైదీలు కొందరు దారిచూసుకున్నారు అందులో దొమ్మికి పూర్వం అను కున్న విధంగానే ఈలవేసి ఉసిగొల్పిన యువ ఖై అందరికంటె ముందే తప్పించుకొని పరు గెత్తుతున్నాడు వెనుక అల్లకల్లోలము, కేకలు, తుపాకి కాల్పులు అతన్ని ఆపలేదు కొండపై నుండి పడే జలపాతంలా ఉరుకుతున్నాడు

దాదాపు మైలుదూరం రాగలిగాడు దక్షిణం వైపు వెళ్ళిపోతున్నాడు విసురుగా వగర్చుతూ

అమావాస్య కారుచీకటిలో కాలుడిలా ఉన్న రాత్రి భయానికి చిమ్మటలు 'చివుక్కు— చివుక్కు' మంటున్నాయి చాలా దూరంలో కమ్మరి సమ్మెటపోట్లు ఇంకా వినబడుతూనే ఉన్నాయి ఆ ఖైదీ అటువైపు పడుతూ లేస్తూ పరుగు తీస్తూంటే గులకరాళ్ళు గలగల మంటున్నాయి

ఖైదీ గుండెలు కమ్మరి తిత్తిలా వూదు తున్నాయి చాలా దూరం ఉన్న కమ్మరి కొలిమి దగ్గర తనచేతి బేడీలు విరగ్గొట్టించుకోవచ్చనే ఆశతో అటువైపు వెళ్ళుతున్నాడు

చివరకి నగరం శివార్లలో ఉన్న ఒక చిన్న బస్తీ లోకి అడుగు పెట్టాడు ఆ బస్తీ మధ్యలో కమ్మరి ఇంకా రాత్రి ప్రొద్దుపోయాక కూడా తిత్తి వూదుతూ పనిచేసుకుంటున్నాడు

ఖైదీ గమనవేగం తగ్గింది కాళ్ళు వణుకు తున్నాయి చెమటలు కారుతున్నా, చేతి బేడీల బరువుతోనే పెద్దగా శ్వాస విడిచి రెండు మూడు ఇండ్లు దాటాడు

బస్తీలో చీకటి రాజ్యం చేస్తోంది ఎక్కడా దీపాలు లేవు ఈ బస్తీ నిజామాబాదు పొలి మేరల్లో దాదాపు మూడుమైళ్ల దూరంలో ఒక చిన్న కుగ్రామంలా ఉంది ఉండి—ఉండి కమ్మరి సుత్తి ఇనుముపై పడిన దెబ్బ అక్కడా ఇక్కడా కుక్కలు బొయ్యో మంటూ మొరుగుతున్న చప్పుడు మిగతా ఊరంతా ఒళ్ళుమరచి నిద్ర పోతూ ఉంది ఖైదీ కదులుతున్న శబ్దం, బేడీ గొలుసుల కలకలం ఖైదీని ఆ చప్పుడు భయం తొందరగా నడవనివ్వడంలేదు

ఖైదీని చూడగానే ఒక కుక్క బొయ్యి మంది అతను భయపడి గోడ ప్రక్కగా వత్తి గిల్లి నడుస్తున్నాడు మెల్లిగా నడుస్తున్నతను చటుక్కున ఆగిపోయాడు అతను నడుస్తున్న కొంచెం దూరంలో ఏదో అలికిడి అయ్యింది ఖైదీ కండ్లు పెద్దవిచేసి చూశాడు మూడు ఆకారాల నీడలు కదులుతున్నాయి ఖైదీ గోడకి అంటుకపోయాడు అతని కెదురుగా ఉన్న ఇంటికి ముందు చేరుకున్నాయి—ఆ ఆకారాలు

ముగ్గురు ముసుగులు కప్పుకొని ఉన్నారు చీకటి—రాత్రికి ప్రతినిధులవలె కనపడుతున్నారు ముగ్గురు ఏదో గుసగుస లాడుకొని ఆ యింటి ముందు నిలబడ్డారు

ఖైదీ వళ్ళంతా వణుకుతూంటే ఈ ముగ్గురు ఈ రాత్రి ఏం చేస్తున్నారిక్కడ అనుకుంటున్నాడు ఇంట్లోకి కన్నం వేస్తారో ? మరేం చేస్తారో ?

అంతలో ఆ ముగ్గురిలో ఇద్దరు గోడ పై కెక్కి

---

యుద్ధరంగానికి వెడుతున్న పటాలం స్పెషలు రైలు ఎక్కింది చూడడానికి వచ్చినజనం సంతో షంతో ఈలలూ, కేకలు వేస్తూ సైనికులకి వీడ్కోలు ఇస్తున్నారు ఇదంతా గమనిస్తున్న ఒకతరుణ సైనికుడు తోటి వృద్ధసైనికుణ్ణి "ఆజనం అంత సంతోషంగా ఉన్నారేం ?" అని అడిగాడు

"యుద్ధానికి వెడుతున్నది మనంగాని వాళ్ళు కాదుగా ! అందుకని !" అని వృద్ధుడి సమాధానం

యం. లీలావతి (మచిలీపట్నం)

---

లోపలికి దూకారు మూడోవాడు తలుపు దగ్గరే ఉండిపోయాడు లోపల తలుపుతట్టిన చప్పుడు అయిదు నిమిషాలు గడిచాయి

"ఎవరు ?" అంది మరీ లోపలి కంఠం

"నేనే రంగయ్యను ! మామా తలుపు తీయి!" అన్న జవాబు

తలుపు తీసిన శబ్దం తీయగానే అతన్ని పట్టు కొని లాగినట్టు — ఆ మనిషి పెనగులాడినట్టు చప్పుడు వినపడింది అవతలి గోడతలుపు తీశాడు ఒకడు వచ్చి ఖైదీ మరీ దగ్గరగా చీకటిలో అతికిపోయి చూస్తున్నాడు

అతనికి లోపలి దృశ్యం కనబడింది నడీ వయస్సులో ఉన్న ఒక వ్యక్తి స్తంభానికి కట్టి వేయబడి యున్నాడు కండ్లకు గంతలు కట్ట బడి ఉన్నాయి

"చెప్పు మరి! ఆ భూమి పట్టా కాగితంపై దస్తకతు చేస్తావా లేదా ?" అని ఒక కంఠం కర్కశంగా అడిగింది

"నేను ప్రాణం పోయినా వెయ్యను !"-అన్నాడు తన్నుకులాడుతూ ఆ స్తంభానికి కట్టివేయబడిన వ్యక్తి ఇంతలో ఈ మూడోమనిషి ఇంట్లోకి దూరి ఏమో గాలించాడు కొద్దిసేపటికి డబ్బు, నగలు పట్టుకొచ్చాడు

"ముసలిముండాకొడుకా చావు!" అని ఒకడు కత్తి పైకెత్తాడు కత్తి తళుక్కుమంది ఖైదీ గుండె గుబేలుమంది అతనిలోని మానవుడు మేలు కున్నాడు ఇతను తలుపు దగ్గరికి పోగానే అక్కడ ఎత్తిన కత్తి దూకును పోయింది

'అమ్మయ్యో !' అన్న గావు కేకతో విలవిలా తన్నుకుంటున్నాడు ముసలి మనిషి ఒకడు ఇంతలో ఈ ఖైదీని చూసి 'ఎవడ్రా ?" అన్నాడు ఖైదీ గుబుక్కున వెనకకు మరలి పరుగుతీశాడు వీళ్ళు ముగ్గురు "దొంగా—దొంగా—పట్టుకోండి" అని కేకలువేస్తూ వెంటబడ్డారు ఆ మధ్యరాత్రి చీక టిలో కేకలు మ్రోగుతున్నాయి ఊరి కుక్కలు అన్నీ ఒక్కమారే మొరగడం మొదలుపెట్టాయి

ఖైదీ అనుకోకుండానే పూరవతల పాడుబడ్డ గుడిసెలోకి దూరాడు

ఇంతలో దూరంనుండి జీపుకారు వేగంగా వచ్చేస్తూవుంది తరుముకొస్తున్న వ్యక్తులు ఆగి పోయారు కారు వచ్చేసింది కారు బ్రేకుల మోతతో ఆగిపోయింది పోలీసులు బిలబిలా దిగారు

ఈ ముగ్గురు తరుముకొన్నవారిలో ఒకడు "ఒక దొంగ పరుగెత్తి పోతున్నాడండి మా ఇంటి ప్రక్కనే ఒక ముసలివాణ్ణి చంపేసి పారిపోతున్నా డండి "

ఇన్స్పెక్టరు దగ్గరిగా వచ్చి— ఖైదీలాగా ఉన్నాడా ?"

"అవునండి చేతికి బేడీలు కూడా ఉన్నాయి "

"అయితే కారు ఎక్కండి దొంగలు పారి పోయి వచ్చారు జైల్లో నుండి అందులోవాడై ఉంటాడు ఇటువైపేగా వెళ్లింది ఇక్కడ చుట్టుప్రక్కల దొరికిపోతాడు" అన్నాడు ఇన్స్పె క్టరు కారు మళ్లీ బయలుదేరింది

ఖైదీ జాగ్రత్తగా గుడిసె నుండి బయటపడి మరోదిక్కుగా పరుగుతీశాడు ఊర్లోవాళ్లంతా లేచి లేచి 'ఏమిటే గొడవా' అంటూ వచ్చేస్తున్నారు

ఎటువైపో తెలియకుండా పారిపోతున్నాడు ఖైదీ శరీరం పూర్తిగా అలసి, నరాలు కదలకున్నా లోపలి భయం ఈ మనుష్యులనుండి తప్పించు కోవాలనే కోరిక, అతన్ని పరుగుతీయిస్తున్నాయి

త్రోవలో ఆఖరికి పాతబడి శిధిలమైన మసీదు దగ్గరికి చేరుకున్నాడు మనుష్య సంచారం అసలు లేదు మసీదుప్రక్కనుండి గబగబా వెళ్ళిపో తున్నాడు చేతికి ఉన్న గొలుసుల చప్పుడు — అతని కాళ్ల సవ్వడి, నోరు ఆపలేని శ్వాస ఎగబోత ఆ నిశ్శబ్దాన్ని లేపుతున్నాయి

కుక్క 'కయ్యో' మంటు గోల చేసింది

"ఎవరు ఆ పరుగెత్తుతున్నది ?" అని కేక

(41-వ పేజీ చూడండి)

బంగారం - సింగారం - 'శశి' చిత్రకథ -

ఇప్పుడు మనం వున్నది అయోమయ ప్రాంతం లోనే కదా - అంచేత
ఇంద అప్పారావు దబుర్రపని చెయ్యి దానికి ఓ పావలా అప్పిస్తున్నా తేసుకో
ఈ గోళం చూస్తే ఎక్కడో చూసి నట్టుంది రా
ఊ దారి చెప్పవయ్యా సరిగ్గా
మనం మూకుక్కి సూటిగా పది వేల కాంతి సంవత్సరాలు వెడితే - ఇదిగో ఈ గోళం తగుల్తుంది - దానికి 82 7¼ ద్ర్ఘాంశం, 35 4¾ శతాంశం కలిసే చోట

ఇదిగో అబ్బీ - చెబితే మా భాషలో చెప్పు - లేకపోతే నా అడ్వాన్సు తక్కు
వాట్ యూ అంకుల్ - అంతో బతకటే - ఆ గోళమ్మీద నిలువు గానూ అడ్డం గానూ గీతలు గీసి వుంటాయి
యస్ మనం గీత బాణ్ణుండి - ఆ గీతల్లో వీడు చెప్పే గీతలు కలిసే చోటు మనం వాలామంటే అక్కడే ట్రెజరుంటుంది

ఏమాత్రం వుంటుందో మరి భగవాన్లూ
కోట్లుక్కోట్లుంది సార్ - కరెన్సీ, లోహం, రాళ్లు రకరకాలుగా.
కరెన్సీకి జై! లోహానికి జై! రాళ్లకి జై!
ఒక్క సంగతి మాత్రం గుర్తు చేస్తున్నా

అన్నిటిలోనూ సగం సగం బాప్తున వాటా మాది - మిగతాది మాది - వి మాన్ - మాది
అంటే కోట్లుక్కోట్లు లో సగానికి సగం!!!!!
మరి ప్లానుకి రాండులక్షలు ఇచ్చా గదా - అది మినహాయించు - అంచేత మొత్తంలో అది తీసేసి మిగతాది చెరి సగంగా..
గోళం విచ్చేసింది!

# విలువ

ఎ. గౌతమ



ఆ దినము రామతీర్థులవారు శిష్యులందరికి పాఠాలు నేర్పి, ఇక సందేహాలు వుంటే అడగవచ్చునని చెప్పి మౌనందాల్చారు శిష్యులలో ఒకడైన చిదానందం చటుక్కున లేచి, ఆయనకు నమస్కరించి ఈవిధంగా అడిగాడు. "స్వామీ! చాలాకాలంగా నన్ను ఒక సందేహం పీడిస్తున్నాదిస్వామీ! తమరు సర్వకాల సర్వావస్థలయందూ "శ్రీరామా" అంటూ వుంటారు, ఎందుకండీ? ఉదయము, సాయంకాలములందు రామనామము జపించిన చాలదా? ప్రొద్దుపోకులూ ఆజపం ఎందుకుస్వామీ! ఎన్నిమార్లు జపించినా అదే పేరేగా? ప్రతి క్షణమూ ఆ శ్రీ రామ జపం ఎందుకండీ? మీరలా జపించడంలో గల విలువ ఏమిటో నాకు బోధపడలేదు. ఈ సంశయం తీర్చుకోవాలని నాకు చాలాదినాలుగా వుంది. దయచేసి నా సంశయనివృత్తి చేస్తారా గురువర్యా?"

శిష్యుడిభక్తి ప్రవృత్తులకు, సంశయానికి, రామతీర్థులుఆనందపడినారు ఒక చిరునవ్వు ఒలికించి "శ్రీరామా" అంటూ చేతులు జోడించి శ్రీరామచంద్రుడికి నమస్కరించి, "శిష్యులారా! మీరందరూ చిదానందం సందేహాన్ని విన్నారు మీకందరకూ ఈ సంశయం ఉందని నాకు తెలుసు ఈదినము మీ సంశయ నివృత్తి చేయదలచుకున్నాను ఇప్పుడు మన చిదానందానికి నావద్దనున్న రాళ్ళలోనుంచి ఒకటి తీసి ఇస్తున్నాను" అని చెబుతూ, ఒకరాయితీసి చిదానందం చేతిలో వుంచాడు "చిదానందం నేటి సంతలోకి ఈరాయి తీసికొని వెళ్ళి, పదిమంది వ్యాపారులను కనుక్కొని దీని అసలువిలువ ఎంత వుండవచ్చునో కనుక్కొనిరా! అయితే ఈరాయిని మాత్రము ఎవ్వరికీ విక్రయించకు సుమా! నీవు తిరిగి వచ్చిన తర్వాత మీ సందేహాన్ని తీరుస్తాను ఇక బయలుదేరు నాయనా!'' అనిచెప్పి రామతీర్థులవారు శిష్యుని సంతకు పంపించారు. మిగతా శిష్యులెవ్వరికీ తమ గురువులు ఏమి చేస్తున్నదీ అర్థంకాలేదు. ''మీరందరూ చిదానందం వచ్చేవరకూ ఓపిక పట్టండి'' అని రామతీర్థులవారు తన శిష్యులను హెచ్చరించి రామనామ జపంలో మునిగిపోయారు

ఆరాయి చేతబట్టుకొని చిదానందం సంతలోకి వెళ్ళాడు. అక్కడ చాలా జనసమర్దంగావుంది. ఎవరిని అడగాలో, ఎట్లా అడగాలో బోధపడలేదు. కానీ విలువ తెలిసికొనకుండా ఆశ్రమానికి మరలిపోవడానికి మనస్కరించలేదు. కాయగూరలు అమ్ముతున్న వైపు నడిచాడు. అక్కడ మరింత రద్దీగా వుంది. చుట్టూ చూశాడు. ఒకమూల ఒక అమ్మి బేరంలేకుండా కూర్చొనుంది. ఆ అమ్మిదగ్గరకు వెళ్ళి, "అమ్మా! ఈరాయి విలువ ఎంత వుండవచ్చునో చెప్పగలవా?" అంటూ తనవద్దనున్న రాయి ఆమెచేతిలో వుంచాడు. ఆమె ఆరాయిని ఇటూ

(38 వ పేజీ చూడండి)

# సినిమా సినిమా



భా                    బి. స రోజాదే                    కమ క మారి   జగదేకవీరుని కథ లో

## సంక్షిప్త వార్తలు



### భారతీయ చలనచిత్ర నిర్మాతల సంఘంనుంచి ఇద్దరు రాజీనామా

భారతీయ చ నచిత్ర నిర్మాతల ఎమాఖ్య కార్య క ర్గణి స ఘ (ఇ ఫా) ను డి ఇద్దరు సభ్యులు శ్రీయుత ు ఆదర్శ్ శ్రీరామ్ బ్రహ్ తమ పదవులకు రాజీనామా ఇచ్చార

వీరిద్దరు జులై 25 వ తేదీన తమ రాజీనామా పత్రా ను సంస్థ అధ్యక్షులు శ్రీ బిమల్‌రాయ్‌కి ప పారట ఆ పత్ర లో ఎన్ని ఎమావేశాలు జరిపి పదేపదే చర్చి చినా స స్థ ప్రదర్శన సెన్సార స్టుడియో లేబరేటరీల భారీ నిర్మాణాల్లాంటి వాటికి స బ ధి చిన సమస్యలను రిష్కరి చ లేక పో దని స ఘ లో తమ ఉనికి నిరప యోగకర గా భావి చి రాజీనామా న్నా మని ే ్కొన్నార

### శాంతారాంకు చలనచిత్ర అర్థిక మండలి అప్పు

ప్రసిద్ధ దర్శక నిర్మాత శ్రీ శా తారా నిర్మి స్తున్న వర్ణచిత్ర స్త్రీ పూర్తికిగాను చ నచిత్ర ఆర్థి క డలి 5 లక్షల రూపాయల అప్పు గా ఇవ్వ ని చి ది ఈ అ్పను శ్రీ శా తారా క తహ వారీగా అ దచేస్తార

ఈ అ్ప పట్ల చిన్నచిన్న నిర్మాతల్లో అస తృ ్తి బయలుదేరినట్లు కూడా వార్త ఎ నహాయ మూ లా ఢానే చిత్రాలు నిర్మి చగల శా తారాం లాంటి నిర్మాతలక కూడా ఆర్థిక స స్థ అప్పులు యిస్తే చిన్నచిన్న నిర్మాతలకు స స్థవల్ల ఉప యోగ పోతు దని వీర వాదిస్తున్నార ఇప్పుడు ఆర్థికమ డలి ఇచ్చిన అ దు క్ష రూపా యలు చిల్లర నిర్మాత కే ఇచ్చివు టే 15 వ ది నిర్మాతల సమ్య ను పరిష్కరి చగలిగేదని ఒక నిర్మాత అన్నారు

### సెన్సారు బోర్డులో భగవతీచరణ్ వర్మ

ప్రసిద్ధ హి దీ సాహితీవేత్త ఉపన్యా కలు శ్రీ భగవతీచరణ్ వర్మను ఆకాశవాణికి చె దిన జగ న్నాథ అజాద్‌ను ప్రభుత్వ చ న చిత్రాల సెన్సార స ఘ సభ్య గా నియమి చి ది

### ఇరాకీ టెలివిజన్‌పై భారతీయ బాలల చిత్రాలు

భారతీయ బా చిత్ర ఘ చే నిర్మితమైన ఐదు చిత్రాలను ఇరాక్ ో టెలివిజన్ ్ ్ర ద ర్శిస్తారని తెలుసో ది ఈ చిత్రాలను అరబ్బీ భాషలోకి తర్జుమాచేసి ప్ర సార చేస్తారట

ఢిల్లీకి కహానీ ఈద్ ము బారక్ నాయక్ స్కౌట్ ్ క గ లాబ్‌కావూల్ అన్న చిత్రాలు త్వర ో ఇరాకీ టెలి ిక ళ్లను ్నవి

### సత్యజిత్ బహుభాషా చిత్రం

నిర్మాత త్యజిత్‌రాయ్ బహు భాషాత్మకమైన చిత్రాన్ని నిర్మి చాలని సంకల్పి చాడు క కత్తా



భరణీవారి 'బాటసారి'లో రమణమూర్తి.

విగరం ఆధారం కాగా ఈ చిత్రంలో వివిధ భాషా నటీనటులను తీసుకొని వారిచేత వారి వారి మాతృభాషను మాటాడించి చిత్రీకరిస్తారట.

## వెనిస్ చిత్రోత్సవానికి పరాఖ్

వెనిస్‌లో జరగబోయే అంతర్జాతీయ చలనచిత్రోత్సవానికి భారతదేశ పక్షాన పంపేందుకు బిమల్‌రాయ్ ప్రొడక్షన్సువారి పరాఖ్‌ను ఎన్నిక చేశారు.

## చిత్రపరిశ్రమ జాతీయం శ్రీ భావే సూచన

భారత చలనచిత్ర పరిశ్రమ కేవలం తమ లాభాలను మాత్రమే దృష్టిలో ఉంచుకొంటున్న ప్రజల శ్రేయస్సును ఏమాత్రం గమనించటం లేదని అసభ్యాక ప్రజానీక పైన అవిత ప్రభావం చూపగ ఈ పరిశ్రమను ప్రయివేటు రంగంలో ఉంచరాదని ఆచార్య వినోబాభావే ఇటీవ ప్రజాళికాసంఘ సభ్యుడు శ్రీమన్నారాయణ్‌కు వ్రాసిన లేఖలో పేర్కొన్నారు.

చలనచిత్ర పరిశ్రమ అంటే తమకు ద్వేషమేమీ లేదని కాని శాస్త్రీయ విజ్ఞాన పెంపొందుతున్న ఈ యుగంలో కూడా పరిశ్రమ స్వలాభం చూచుకొంటుండటంవల్ల దానిని ఇంకా ప్రయివేటు రంగంలో ఉంచరాదనీ అసభ్యమైన ప్రకటనలతోపాటు అసభ్యమైన చిత్రాలను పాటలను సెన్సారు చేయుట చాలా అవశ్యకమనీ సద్విజ్ఞానంతో యువజనవాహినిని తీర్చి దిద్దటలో నిర్మాతలు సహాకరించి మార దర్శకులు కావాలనీ కూడా శ్రీ భావే తమ లేఖలో పేర్కొన్నారు.

## కన్నడంలో నాగానందం

రాజకవి శ్రీహర్షని సంస్కృతనాటక నాగానందం అపురూపమైన దృశ్యకావ్యంగా రూపొందబోతోంది. బి. ఆర్. కె. ఫిలింస్‌వారు నిర్మిస్తున్న ఈ కన్నడ చిత్రంలో రాజకుమార్ లీలావతి హెచ్. ఆర్. శాస్త్రి సదాశివయ్య ప్రభృతులు నటిస్తున్నారు. బి. ఆర్. కృష్ణమూర్తి నిర్మిస్తున్న ఈ చిత్రానికి మద్రాసు అరుణాచల స్టూడియోలో పూజ జరిగింది.

## కామరాజ్‌పై డాక్యుమెంటరీ చిత్రం

చిత్ర కథా రచయిత శ్రీ ఎస్. డి. సుందరం మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ నాడార్ జీవితంపై డాక్యుమెంటరీ నిర్మించాలని సంకల్పించారు.

## నందలాల్ జస్వంతలాల్ నిర్యాణం

అనార్కలీ నాగిన్ లాంటి ఉత్తమ చిత్రాల దర్శకుడు శ్రీ నందలాల్ జస్వంతలాల్ జులై 27వ తేదీన బొంబాయిలో హృద్రోగంవల్ల మరణించారు. శ్రీ లాల్ వయస్సు 55 సంవత్సరాలు.

లాల్ అంత్యక్రియలకు బిమల్‌రాయ్ వైజయంతీమాల ఎస్. ముఖర్జీ చందూలాల్‌షా హాజరయ్యారు.



జూపిటర్‌వారి కత్తిపట్టిన రైతులో పద్మిని

## సత్యజిత్ టాగూర్‌కు లోకార్నో బహుమతి

దర్శక నిర్మాత సత్యజిత్‌రాయ్ విశ్వకవి రవీంద్ర జీవితంపై నిర్మించిన డాక్యుమెంటరీ చిత్రంకు లోకార్నోలో జరిగిన అంతర్జాతీయ చిత్రోత్సవంలో ప్రథమ బహుమతి లభించింది.

ద్వితీయ బహుమతి ఇదేరకం చిత్ర చెకోస్ మామా అనే చిన్న చిత్రానికి లభించింది.

(48 వ పేజీ చూడండి)



# బియోవుల్ఫ్

స్వేచ్ఛానువాదం నాగరాజ్

## జరిగిన కథ

డేనిష్ మహారాజు హ్రోత్గార్ ఒక అపూర్వమైన భవనం నిర్మించి దానికి హీయరట్ అని పేరు పెడతాడు ఆ భవనంలో జరుగుతున్న ఆనంద కోలాహలం గ్రిండల్ అనే రాక్షసుడికి నచ్చక పోవటంవల్ల వాడు హీయరాట్ భవనంపై సుమారు పన్నెండు సంవత్సరాలు దాడి జరిపి జనులను చంపితింటాడు వీడి దుండగాలను అరికట్టే ప్రయత్నంలో హ్రోత్గార్‌కు సహాయ్యపడేందుకు హైగ్లిక్ రాజు మేనల్లుడు బియోవుల్ఫ్ కొందరు యోధులతో డేనిష్ రాజ్యానికి వస్తాడు

ఇంతలో ఒక అధికారి అక్కడకు వచ్చాడు

"ఎవరు మీరు ? ఎక్కడ్నుండి వస్తున్నారు ? ఇంతమంది వీరులు ఇలా ఆయుధాలు ధరించి గుంపుగా రవటం నేనెప్పుడూ చూడలేదు మేము హ్రోత్గార్ మహారాజు అంత పురోద్యోగిని ఏం కావాలి మీకు" అని అడిగాడు

యువకనాయకుడు ఇలా సమాధానం చెప్పాడు "మేం హైగ్లిక్ మహారాజు అనుచరులం నన్ను బియోవుల్ఫ్ అంటారు మీ మహారాజు హ్రోత్గార్ దర్శనం ఇప్పిస్తే వారికే స్వయంగా, మా వచ్చిన పని విన్నవించుకొంటాం"

బియోవుల్ఫ్ బృందం వాకిటిలో ఉన్న సమయంలో మహారాజు హ్రోత్గార్ బంధుమిత్రులతోటి, మంత్రులతోటి సమాలోచనలు చేస్తున్నాడు

"మహారాజా ! బియోవుల్ఫ్ అనే యువకుడి నాయకత్వాన, గీట్ యువకబృందం వచ్చి మీ దివ్య దర్శనాన్ని ఆపేక్షిస్తోంది దయామయులైన ప్రభువులు అనుగ్రహిస్తే వారిని లోపలికి తీసుకువస్తాను" ఇలా అంత పురాధికారి విజ్ఞప్తి చేశాడు

హ్రోత్గార్ ఇలా అన్నాడు : "అతడు బాలుడుగా ఉన్నప్పుడు చూచాను అతని తండ్రి ఎగ్తియోల్‌ను బాగా ఎరుగుదును బియోవుల్ఫ్‌కు ముప్పైమంది మనుషుల బలం ఉందని 'గీట్ల' దగ్గరకు వెళ్లి వచ్చిన నావికు లంటూ ఉండేవారు. అతడు సుహృద్భావంతోనే వచ్చాడనేది నిజం ఆ మహావీరుడికి, సిబ్బందికి స్వాగతంచెప్పి లోపలికి తీసుకురా"

అంతఃపురాధికారి త్రోవచూపగా బియోవుల్ఫ్ అతని మిత్రులు రాజపీఠం దగ్గరకు వచ్చి నమస్కరించి నుంచున్నారు "మహారాజా ! హైగ్లిక్ రాజుకు మేనల్లుడిని ఆయన అనుచరుల్లో ఒకడిని నా బాల్యంలోనే నేను ఎన్నో విజయాలు సాధించాను మీ రాజ్యంలో గ్రిండల్ 'ఘన' కార్యాలను విన్నాను వాడి మూలంగా మీ హియరాట్ భవనం జనశూన్యంగా ఉంటున్నదని మా నావికులు చెప్తుంటారు అందువల్ల మా దేశంలోని మేధావులందరూ, ఇక్కడకు వచ్చి మీకు తోడ్పడవలసిందిగా నన్ను ఆదేశించారు వారలా ఆదేశించటానికి కూడా కారణం ఉంది మాగీట్ ప్రజలపై దండెత్తిన చాలామంది రాక్షసులను నేను జయించాను ఆ విషయం వారు ప్రత్యక్షంగా చూచారు మహారాజా ! నన్ను నా అనుచరులతో సహా 'హియరాట్' భవనంలో గడిపేందుకు అనుమతించవలసిందిగా అర్థిస్తున్నాను" ఈమాటలని చిరునవ్వు చిందులాడే ముఖంతో బియోవుల్ఫ్ ఇంకా ఇలా అన్నాడు

"ఈ గ్రిండల్ ఏ ఆయుధం లేకుండానే ఈ అకార్యాలు చేస్తున్నాడని విన్నాను అందువల్ల నేను కూడా నిరాయుధుడుగానే వాడితో తలపడ దల్చుకున్నాను గ్రిండల్ జయం పొందేటట్లయితే చెప్పేదేమి లేదు నా అంత్యక్రియలకు కూడా ఏర్పాటు అనవసరం నాలాంటి కండగలవాణ్ణి వాడెటూ తినకుండా వదలడు నే మరణించే పక్షంలో ఇప్పుడు నే ధరిస్తున్న కోటును మాత్రం మా మామ హైగ్లిక్‌కు పంపండి ఈ చిత్రమైన కోరిక కోరటంలో కూడా ఒక కారణం ఉంది ఇది మా తాతగారు హ్రిదల్ కాలంలోఉన్న వేలాండ్ స్మిత్ కుట్టినటువంటిది ఇంత అందమైన కోటు ప్రపంచంలోనే లేదు ఒకవేళ గ్రిండల్ వోడిపోయే పక్షంలో ఈ ప్రపంచానికే ఒక పీడ విరగడవుతుంది మాలో ఎవరు జీవిస్తారో చెప్పలేం ఈశ్వరేచ్ఛ ఎలా వుంటే అలా జరుగుతుంది"

ఈమాట విని మహారాజు హ్రోత్గార్ ఇలా అన్నాడు "బియోవుల్ఫ్ ! మా రక్షణకోసం నీవు ఇంతదూరం రావటం జరిగింది వెనక మీ తండ్రిగారు విల్ఫింగుల రాజు హిథాల్ఫను చంపినప్పుడు గీట్ జాతివారు బలహీనులైనందువల్ల ఆయనకు రక్షణ ఇవ్వటానికి జంకారు అప్పుడు మీ తండ్రిగారు సముద్రాలు దాటి శరణార్థియై డేనిష్ రాజ్యంలోకి వచ్చారు అప్పుడు నేను చాలా చిన్నవాణ్ణి నాకన్న అన్నివిధాల సమర్థులైన మా అన్నగారు హాయొరోగర్ అప్పుడే మరణించారు నేను కొత్తగా రాజ్యానికి వచ్చాను ఈ స్థితిలో మీ తండ్రి మా ఆశ్రయాన్ని సహాయాన్ని అర్థించారు నాకున్న అమూల్య ధనరాసులు పంపి మీ తండ్రికి విల్ఫింగులకు మధ్య వున్న వైమనస్యాన్ని చక్కబెట్టగల్గాను"

... కాని ఆ రోజులు గతించాయి గ్రిండల్

(36-వ పేజీ చూడండి)

# చతురంగతురంగం

## పి. గణపతిశాస్త్రి

### గత సంచిక తరువాయి

అంతలోనే మహాప్రధాని తిమ్మరుసయ్య అక్కడికి విచ్చేసి అలవోకగా తిమ్మన్నమీద ఆదరదృష్టి ప్రసరింపజేసి 'నీవా! నాయనా! ఇంకా ఎవరో అనుకున్నాను శివావధానులుగారి కుమారుడవు కాదూ! అయితే ఈ చిన్నవయస్సులోనే చదరంగంలో ఇంతటి చాకచక్యం ఎప్పుడు సంపాదించావయ్యా! స్వయంగా సార్వభౌములే నీతో ఒక ఎత్తు వేద్దామన్నంతగా కుతూహల పడుతున్నారు!' అని అభినందించాడు తిమ్మన్న ఆ ప్రశంసతో లోలోపల ఉప్పొంగినా ఎంతో అడకువతో 'తమవంటి పెద్దల ఆశీర్వచనబలం వల్లనే నేను ఈ ఆటలో కొంచెం ప్రవేశం సంపాదించుకొన్నాను అయితే నాదొక్క మనవి!' అని చేతులు జోడించి నిలుచున్నాడు 'ఏమిటది ?' అన్నట్టు మహామాత్యు డతని వైపు జిజ్ఞాసాదృష్టి తో పరిశీలించాడు —

ఏమిలేదు! సామాన్యుల నందరిని చదరంగంలో ఓడించినట్టు సార్వభౌముల నాటలో జయించడం భావ్యంకాదేమో అని భయపడుతున్నాను'

'నీకా సంకోచం ఏమాత్రము ఉండనక్కరలేదు! దీనిలో మహారాజ మర్యాదా లోపం ఏమిలేదు నీయావచ్ఛక్తి వినియోగించి వారితో ఆడి జయించి పురస్కారా లందుకోవచ్చును దానికేమి!'

ఆవిధంగా భరవసా ఇచ్చిన తరవాత మహామంత్రి అతని ఔద్ధత్యాని కెంతో ఆశ్చర్యపడి 'తిమ్మన్నా! వారితో ఆటంటే మాటకాదు సుమా! ఈ విషయంలో వారి నోడించగలవా ళ్లింతవరకు బయలుదేరలేదు! ప్రభువుల చతురంగ చాతుర్యం ఎటువంటిదో నీ కింకా బాగా బోధపడలేదేమో!' అని హెచ్చరించాడు

అంతలోనే పెద్దనామాత్యునితో శ్రీకృష్ణదేవరాయ లక్కడికి విచ్చేసి తిమ్మన్నపై పసగొల్పు కటాక్షం ప్రసరింపజేసి చల్లని చిరునవ్వుతో పలకరించి చతురంగపీఠం దగ్గర తన కోసం ప్రత్యేకించిన స్వర్ణసింహాసనంపై సమాసీనుడయినాడు చక్రవర్తిపార్శ్వంలో ఆంధ్రకవితాపితామహుడు, మహాప్రధాని సుఖోపవిష్టులయిన పిమ్మట తిమ్మన్న తన కేర్పరచిన సముచితాసనం మీద స్థిరపడి రాయల కనుసన్న అనుమతిలో ఆట ప్రారంభించాడు

మొట్టమొదటినుంచి తిమ్మన్న ఉత్సాహావేశంతో ఉరకలు వేస్తూ మిక్కిలి మెళకువతో తన బలం మున్ముందు కురికించాడు దక్షిణాపథాధిపతి ధోరణిలో అటువంటి తొందరపా టెక్కడ గోచరించలేదు అలాగ ఒక అరగడియ గడిచేసరికి తిమ్మన్న హృదయంలో గెలుపు తనదే అన్న గట్టి నమ్మిక కలిగింది ఆ తరవాత అకస్మాత్తుగా ఇంకొక ఎత్తు వేసి 'మహాప్రభూ! ఈ గుర్రపు ఎత్తులో మీ మంత్రి పోక తప్పదు! తా మది గమనించలేదేమో!' అన్నాడు

ఆ అహంకారధోరణి గమనించి మహాప్రధాని పెద్దనామాత్యుడు ఒండొరులవైపు చూచుకొని ముసిముసి నవ్వులతో ప్రసంగించుకొన్నారు అయినా కృష్ణదేవరాయలు మంత్రిని మరలిరచలేదు ఆ విషయమే గమనించనట్టొక చిన్న ఎత్తు వేసి తిమ్మన్న పై ఎత్తుకోసం నిరీక్షించాడు మరుక్షణంలోనే సార్వభౌముని మంత్రి తిమ్మన్న అశ్వధాటితో ఆ పక్కనే ఉన్న దంతపు బరిగోలో తలదాచుకొన్నాడు మంత్రి పోవడంతో రాయలవారి ఆట బాగా దెబ్బతిన్నదనీ ఇక మిగిలిన ఆట హేలగా ముగించి జయం చేజిక్కించుకోవచ్చుననీ తిమ్మన్న లోలోపల ఎంతయినా ఉబలాట పడ్డాడు కాని రాయల గుర్రాల జంట దాటులతో, బంట్ల పోటులతో రెండు మూడు ఎత్తులలోనే అకస్మాత్తుగా అతని ఆట కట్టింది!

విజయం తనదే అన్న దృఢ విశ్వాసంతో ఉబ్బితబ్బిబ్బయిన తిమ్మన్నకా హఠాత్పరాజయంతో తల కొట్టేసినట్టయింది కత్తివేటు వేసినా ముఖం మీద ఎక్కడ నెత్తురుచుక్క కనబడే జాడే పొడకట్టలేదు! రాయ లది గమనించి 'చతురంగ క్రీడలో జయాపజయాలుకావు పరిశీలించవలసినవి! బలం నడిపించడంలో చాకచక్యమే ముఖ్యం! ఇన్నాళ్లనించి ఇంతటి చాతుర్యం నే నెక్కడ గమనించలేదు!' అని అపూర్వాదరంతో తిమ్మన్న నభినందించాడు అల్లన లేచి పెద్దనతో, ప్రధానామాత్యునితోబాటు అభ్యంతర మందిరంలో ప్రవేశించాడు

ఆ అభినందనతో కొంచెం తేరుకొన్నా తిమ్మన్న పరాజయావమానంతో బాగా కుంగిపోయాడు వంచిన తల మరి పైకెత్తలేక ఉసూరుమని నిశ్వసించాడు అంతలోనే దుశ్శాలువ లుంచిన బంగారు పళ్లెరంతో ప్రధానామాత్యు డతనిని సమీపించి 'నాయనా! చక్రవర్తి స్వయంగా నీ చాతుర్యం పరిశీలించి చాలాచాలా మెచ్చుకొన్నారు ఇదిగో! ఇది వారి బహూకృతి' అని అందీయబోయాడు

కాని తిమ్మన్నకా బహుమాన స్వీకరణ బొత్తిగా రుచించలేదు ఎవరైనా అడిగితే ఆటలో ఓడిపోయిన తా నే ముఖం పెట్టుకొని ఆ వృత్తాంతం వెల్లడించగలడు ? అందుచేత చేతులు జోడించి ప్రధానామాత్యుని కతి వినీతుడై విన్నవించాడు

నన్ను మన్నించగలరన్న ధైర్యంతో ఒక్క చిన్న విషయం విన్నవించు కొంటున్నాను ఈ గౌరవం రాయలవారి పరమౌదార్యాని కొక గొప్ప తార్కాణ అయితే నా కీ పురస్కారం స్వీకరించే అర్హత ఆవంత కూడా లేదేమోనని మిక్కిలి ఆందోళన పడుతున్నాను ఇందుచేత ప్రస్తుతాని కిది రాజాస్థానంలోనే ఎక్కడో ఒకచోట భద్రపరిచే ఏర్పాటు చేయించండి. అటువంటి అర్హత కలిగినదని ధైర్యం కలిగినప్పుడిది నా అంతట నేనే వచ్చి స్వీకరిస్తాను చక్రవర్తికి నామీద అనుగ్రహం కలిగినదని సెలవిచ్చారన్న ధైర్యంతో ఇంకొక్కవరం కోరుకోవాలని సంకల్పించుకొన్నాను'

ఆ కడపటి ప్రార్థన వినగానే మహామంత్రి నెన్నుదుటిపై ప్రశ్నార్థకమైన బొమముడి విరిగింది వెంటనే తిమ్మన్న తన లోలోపలి కోరిక వ్యక్తీకరించాడు

'రాయలవారితో తిరిగి ఇంకొక్కమారు చదరంగం ఆడాలని నే నెంతైనా ఉవ్విళ్లూరుతున్నాను. నేను వారిని జయించవలెనన్న అహంభావంతో తమకీ విషయం విన్నవించుకోవడంలేదు వారిదగ్గర కొన్ని గొప్ప ఆట మెళుకువలు నేర్చుకోవాలన్న తహతహతోనే నేనీ విధంగా నివేదించుకొంటున్నాను ఎలాగయినా వారు నాకీ వరం కటాక్షించేటట్టు సాయపడవలసినదని కోరుకొంటున్నాను ఇంతకన్న నేనిక ఆపేక్షించతగిన దేది లేదు'

మహాప్రధాని అదివిని కొంచెంసే పాలోచించి బొమముడి విరిచి ప్రసంగించాడు

'తిమ్మన్నా! వారిటీవల కళింగ విజయభేరి మ్రోగించారని అందరికిని అవగతమయిన విషయమే గదా! అందుచేత అహోరాత్రాలు వారీ జైత్రయాత్రా సన్నాహాలలో తలమునక లవుతున్నారు నాకే వారి దర్శనం సాధ్యపడడంలేదు అందుచేతతిరిగి వారి కెప్పటికి తీరిక చిక్కగలదో నే నిప్పుడుచెప్పలేను'

అయినా తిమ్మన్న నిరుత్సాహ పడలేదు తిరిగి అంజలి ఘటించి 'ఎప్పటికి సానుకూలపడితే అప్పుడే తిరిగి వారి దర్శనం చేసుకొంటాను తాము సంకల్పిస్తే నెరవేరనిది ఏమి ఉండబోదని నా గట్టి నమ్మిక ఒకవేళ తాము సంకల్పించినా కోరిక నెరవేరకపోతే అది నా తారాబలమే అనుకొంటాను' అని సవినయంగా నమస్కరించి సెలవు తీసుకొన్నాడు

ఆపైన మరికొన్నాళ్లదాకా విద్యానగరి యావత్తు జైత్రయాత్రాసన్నాహాలతో ఘోరుమని మారుమ్రోగింది ఎక్కడ చూచినా అశ్వికసైన్యాల చెంగలింపులే! ఎక్కడ విన్నా కొమ్ముటేనుగుల ఘీంకారాలే! ఆయా సైన్య సంభారాలతో కదలిపోతున్న శకటశ్రేణుల కోలాహలాలే! కాల్బలాల వీరగర్జనలే! ఆ సమయంలో తిమ్మన్నకా చతురంగ బలాలతోబాటు సాగిపోయి శాత్రవుల సైన్యాలలో జొరబడి చీల్చి చెండాడి వీరాధివీరుడన్న విజయ బిరుదం గడించుకోవాలని లోలోపల ఎంతయినా కౌతూహలం కలిగింది! అంతలోనే ఎప్పటికయినా తిరిగి రాయలవారితో ఇంకొక ఎత్తు వేసి తీరాలని ఒక దృఢనిశ్చయం స్థిరపడింది

కళింగ జైత్రయాత్ర జేగీయమానంగా సమాప్త

(37 వ పేజీ చూడండి)



# వనితా వాణి

## జీతంలేని పరిచారిక

[ 'జీతంలేని పరిచారిక' వ్యాసం పైన చాలా ఉత్తరాలువచ్చాయి కొన్ని ఇక్కడ ప్రచురిస్తున్నాము ]

శ్రీమతి కె అనసూయదేవిగారు పరిచారికలవలె చూడబడుతున్న స్త్రీల విషయమే విశదీకరించిరి గాని, కేవలం పీసమంత మర్యాద పొందలేకుండా భృత్యునికంటె హీనముగా చూడబడుతున్న మగవారి స్థితినిగురించి వారు పట్టించుకోకపోవడము శోచనీయం కెలిపోక్కపునుండి చూచునప్పుడు ఒక వైపునుండి చూచిన ఒక విధముగను, వేరొకవైపు నుండి చూచిన మరొక విధముగను గన్పట్టును

స్త్రీల విషయమై అత్యంతాదరము చూపించుటతోబాటు, సోదరి అనసూయదేవిగారు మగవారి విషయంలో గూడ కనీసం సగమైన సానుభూతి చూపించిన వారాశించిన దానికంటె వెయ్యిరెట్లు సానుభూతి పొందగల్గెడివారేమోనని నా అభిప్రాయము

పాలగుమ్మి వీరరాజు ( ముమ్మిడివారు )

*  *  *

వ్యాసం చాలా బాగుంది వీరు వ్రాసిన ప్రకారం భర్త తనదైనికజీవితంలో భార్యను పరిచారికగా చూడకుండా తన కష్టసుఖాలలో భార్యకు కూడా ఒక వంతు ఇవ్వాలి ఉండాలి

పురుషుడు భార్య తప్పులను సరిదిద్దుతూ ఉండాలి పురుషులు భార్యలను బాధపెడుతుండడంవల్ల వీరు తప్పుదార్లను నడుస్తుంటారు కాని వానిని సరిదిద్దుతూ ఉండాలి

ఓ సావిత్రి (వెల్నాతల)

*  *  *

భార్య భర్తకంటే ముందుగాలేచి నిత్యకృత్యములు అయిన తరువాత సరదాగా ఏదో (భగవంతుని మీద) పాట పాడుతూ 'కాఫీనీళ్ళు కాగినాయి, ముఖార్చనముకానివ్వండి'' అని భర్తను సంబోధించినట్లయితే ఒక రోజుకు కాకపోతే నాలుగు రోజులకు అయినా సరే భర్తలలో మార్పు తప్పక వస్తుంది తద్వారా విసుగుదల తగ్గడమే కాకుండా, సంసారం సుఖప్రదంగాను, ఉన్నదాంట్లోనే, విజయవంతముగాను గడిపేందుకు కూడ దారి తీస్తుంది

శాంత (కాగజ్ నగర్)

*  *  *

ఇల్లే ఒక ఆలయం భర్తే దైవం పతి సేవ ముక్తి మార్గం అన్న హిందూ సిద్ధాంతాలను త్రోసిపుచ్చి ఇలాటి అవమానకరమైన భావాలని నేటి మహిళలో రేకెత్తించ ప్రయత్నించడంకూడదని శ్రీమతి అనసూయగారికి నా సలహా

ఆర్ వి. యస్ పద్మమణి (విశాఖపట్టణం)

*  *  *

భార్య భర్తకు కాఫీచేసి యివ్వడము, భోజనము వండి పెట్టడము మొదలగు పనులు చేయుటవలన పరిచారిక అయిన ఎడల, భర్త ఆమె కొరకు (చీరలకు, నగలకు, స్నో, పౌడరు, లిప్స్టిక్కు, సినిమా వగైరాలకు) ఖర్చు చేయు డబ్బు జీతం అవుతుందేమో!

పంచాక్షరి (పిట్టలవేమవరం)

*  *  *

సోదరిమణులు ఇటువంటివి ఇంకా వ్రాసి మగువల్ని పరిచారికల్లాజూసే మగరాయళ్ళకు బుద్ధి చెప్ప గలరని ఆశిస్తాను

కుమారి కె బాలసుందరి ( వెలిచేరు)

*  *  *

ఇది పురుషులకు గుణపాఠము సోదరికి నా ధన్యవాదములు

బి పి బాబూరావు (కొంతలాం)

*  *

కె అనసూయాదేవి వ్రాసిన "జీతములేని పరిచారిక" వ్యాసము స్త్రీ లోకమునకే అవమానము స్నానముచేయుటకు సబ్బు, తుండు తెమ్మని పురుషుడు భార్యకు చెప్పుట కూడా ఆజ్ఞేనా? భర్త ఆఫీసునుంచి యింటికివచ్చినప్పుడు అతని అలసటను తీర్చుట భార్య కర్తవ్యము అనసూయాదేవి యిటువంటి వ్యాసము పంపినందుకు చింతించుచున్నాను

వై వెంకటరెడ్డి ( కర్నూలు )

*  *  *

జీతంలేని పరిచారిక అనే వ్యాసం వ్రాసిన అనసూయాదేవిగారు వాళ్ళ బావగార్ని దృష్టిలో వుంచుకుని మొత్తం పురుష ప్రపంచాన్నంతా నిందించటం చాలా శోచనీయం

ఎస్ బంగారయ్య ( రాజమండ్రి )

*  *  *

వ్యాసం నాకు బాగా నచ్చింది ప్రతి నిముషము వాళ్ళ బావగారు వాళ్ళ అక్కనుపెట్టే ఇబ్బంది చూస్తే, మా యింట్లో విషయాలు వ్రాయాలనిపించింది

మెండు పార్వతి ( విజయవాడ )

చాలా బాగున్నది రచయిత్రిగార్కి నా హృదయపూర్వక అభినందనములు

టి రమాదేవి ( గుడ్లవల్లేరు )

*  *  *

వ్యాసము చాలా బాగుందికాని, అందులో భర్త యొక్క ఆజ్ఞలనుచూస్తే కర్కశత్వముగా లేవనిపిస్తుంది ఆ ఆజ్ఞలన్నిటినీ కొందరు అనుకూలవతులు ఆనందముగాను, తేలికగాను చేస్తున్న సంసారాలు కూడా ఉన్నాయి

ఏ యల్ రెడ్డి ( నిజామాబాద్ )

*  *  *

నిజంగానే ఆఫీసుకు వెళ్ళడానికి ఆలస్యమవుతుందేమోనని వంట పనిలో సతమతమవుతున్న ఆడవారికి అన్ని పనులూ చెప్పి విసిగించడం ఏమంత భావ్యము కాదు

వై జయలక్ష్మి ( సత్యవ్రోలు )

*  *  *

అనసూయాదేవిగారు వ్రాసినట్లు ఎవరి పనులు వారు చేసుకుంటే జీవితం సాఫీగా గడిచిపోతుందని నా అభిప్రాయము అనసూయాదేవి అక్కయ్యగారు వ్యాసం ఆఖరున మన్నింపుగోరుతూ ముగించేరు అది అనవసరమని నా అభిప్రాయము

నాళం లేఖాదేవి ( కాకినాడ )

*  *  *

అంతా రాసి చివరకు రచయిత్రి మన్నించమని రాసారు అది ఎలా వున్నదంటే లాగి లెంపకాయకొట్టి 'సారీ' అన్నట్లుగా వుంది

భీమవరపు రావు ( నాశిక్ )

*  *  *

వ్యాసం బాగా వ్రాశారు ఈనాడు కూడా భార్యను ఒక పరిచారికగానే భావించే పురుషులు ఉన్నారంటె అతిశయోక్తి కాదు

వి వి శర్మ (న్యూఢిల్లీ)

*  *  *

బహుశః శ్రీ కె అనసూయాదేవిగార్కి వివాహము కాలేదేమో?

భర్తల అవసరములకు భార్యలు తోడ్పడినంతలో "బానిసలు", "పరిచారికలు" అని అనుకొనుట అంత సమంజసము కాదేమో!

కె ఆనందరావు ( శ్రీకాకుళం )

*

వ్యాసము పూర్తిగా చదివాక, అనసూయగారు అనుభవం తక్కువతో వ్రాశారనిపిస్తుంది పతికి సేవ చేయాలంటే బాధపడే స్త్రీ, స్త్రీకాదు అందులో వుండే ఆనందము ఎందులోవుంది? కాని అనసూయగారన్నట్లు భార్య అనారోగ్యంతో బాధపడుతున్నా, ఎల్లలతో సతమతమవుతున్నా, తమకు జరిగే పనులలో ఏ ఒక్కటి లోపము జరిగినా విరుచుకపడే మగవారు లేకపోలేదు నాగరకత పేరుతో భర్తకు సేవ చేయడము తమక గౌరవహీనమని తలంచి బాధపడటము చాలా తప్పు ఇంటివారి పరిస్థితులబట్టి మగవారు ప్రవర్తించి, పాలు, తేనె కలిసిన లాగున దాంపత్యము ఎంతో అన్యోన్యంగా, రమ్యంగా వుంచుకొని, జీవితము ఆనందమయము చేసుకోవాలి

శ్రీమతి వసంతాప్రకాష్ ( ఒంగోలు )

*  *

**అయినదానికి, కానిదానికి పరవళ్ళు** త్రొక్కేవారూ; భార్య యెక్కడ అరిగిపోతుందోనని తెల్లవారజామునే లేచి, భార్య నిద్రలేచేటప్పటికి ముంగిట్లో ముగ్గువేసి సమస్త చాకిరీచేసే భర్తలూఉన్నారు భర్తను గడగడలాడించే మహా తల్లులు కూడా లేకపోలేదు ఇంతకూ ''బావ''కౌగిళ్ళకు లోబడి ఆయన మనః ప్రవృత్తిని అర్థం చేసుకొని, యెదురాడకుండా, గౌరవం కాపాడుకొంటూ కాపురం గుట్టుగా జరుపుకుపోతున్న ''అక్క''ను అభినందించాలి

అన్నంరాజు సత్యనారాయణరావు (గుంటూరు)

*　*　*

వ్యాసము చాలా బాగుంది వారు వ్రాసినట్లు భార్య ఉదయంనుంచి సాయంకాలంవరకు గృహ కార్యాలలో మునిగి తేలుతున్న భర్తకు చాకిరి చెయ్యడం తప్పదు అందుకు వారు ఏమాత్రము కూడా విచారించరు వారు, పిల్లలు ఉన్నారు, ఏడుస్తు ఉన్నారు ఇంట్లో పనిచేస్తున్నది, మనము వాండ్లను సముదాయించుదాము అని మాత్రము అనుకోరు కాని మనము చిన్న పిల్లలకన్న ఎక్కువ సవరించుచ ఉండాలె

శ్రీమతి నాగరాజ (మహబూబాబాద్)

*　*　*

ఇతిహాసకాలమునాటి స్త్రీలు (సతిసావిత్రి—అనసూయ) మొ॥ పతివ్రతా శిరోమణులు తమ తమ భర్తలకొరకు ప్రాణముల్తైనా విడిచుటకు వెను దీయనివారేకదా? మీరు వ్రాసిన వ్యాసము కేవలము నల్గురైదుగుర్నిగురించి వ్రాసినట్లున్నది ఈవ్యాస మందరు స్త్రీలకు వర్తించదు

మీపై ఆగ్రహములేని మీ చిన్ని సోదరుడు

''శాయి'' (గుంటూరు)

*　*　*

వ్యాసము చాల బాగున్నది కానీ భార్య గూడా వారు ఉదహరించిన మగవారికివలేఉండినయెడల ఎట్లుండునో వారిని ఒకసారి తలంచుకొనియుండవలసినదిగా కోరుచున్నాను

సూరి (తెనాలి)

*　*　*

అనసూయాదేవిగారి ఈవ్యాసం సోదరులంతా చదివి మేల్కొంటారని ఆశిస్తున్నాను

యం ఆర్ మణి, (గుంటూరు)

*　*　*

అనసూయగారు బహుశా యింకా సంసారంలో దిగలేదేమో! అందుకే దానిలోనిసారం ఆమెకు అవగాహన కాలేదు ఏదో పత్రికలో వనితలకు ఒక శీర్షిక యిచ్చారుకదా అని ఏ కొద్దిమంది జీవితంలోనో జరిగిన కొన్ని విషయాలనే ఉదాహరణగా తీసికొని మగవాళ్ళను దుయ్యపట్టడం బాగుండదు

తరిగొప్పుల సత్యనారాయణమూర్తి (ఓెక్కలి)

*　*　*

ప్రక్క ప్రాణిని హింసబెట్టి తాననుభవించేది సుఖము అని భావించే సోదరులకు చక్కని బుద్ధి యీ వ్యాసం ద్వార తెచ్చుకోనేటట్లు చేశారు

బి సుమతిదేవి (ఖమ్మం)

*　*　*

వ్యాసనామకరణం ''జీతంలేని పరిచారిక''కన్నా ''జీవితాంత బానిస'' అయివుంటే సరిగా సరిపోవునేమోననిపిస్తుంది

అయ్యగారి సీత (ఏలూరు)

*　*　*

''ఎంతభర్తఅయితేమాత్రం జీవితాంతం సేవ చేయాలంటే ఏ వనితకు కష్టమనిపించదు'' ఈ వాక్యముతో నేను ఏ మాత్రము ఏకీభవించను

దాసర శ్యామల (గుంటూరు)

*　*　*

ఇంకా యిటువంటి వ్యాసాలు వ్రాసి నా భర్తలాంటి వాళ్ళకి జ్ఞానోదయం కలిగిస్తారని ఆశిస్తున్నాను

కె రాజీ (బర్‌బస్‌పూర్)

*　*　*

ఈ వ్యాసముచదివిన మగవారియొక్క మనస్సులు మారితే చాల సంతోషము

నన్నపనేని స్వర్ణకుమారి (గుంటూరు)

*　*　*

భార్యను కేవలం బానిసగా చూడకపోయినా కొంచెంచులకనగా చూచే పురుషులు లేకపోలేదు ఇటువంటివాళ్ళు చాల తక్కువని వ్యాసంలోనే వ్యక్తపరచాను తరువాత తనంతట తాను భర్తకు చేయూతనిచ్చే పరిస్థితులలో అయితే ఆమె ఆనందాన్ని పొందటం వాస్తవమేగాని, ఆ సమయానికి యే కారణంచేతనైనా (సబ్బు, తుండు మొదలగునవి) అందించలేకపోయినపుడు కూడ అధికారం చలాయిస్తే ఆమె మనసు ఎలా వుంటుంది? అలా అధికారం చలాయించడంలో అర్థం యేమిటంటారు? కేవలం ఒకే వ్యక్తిని దృష్టిలో వుంచుకొని వ్యాసం వ్రాయడం ఎపుడూ జరుగదు భర్తకు సేవచేయడం భారతస్త్రీ ముఖ్య ధర్మమనీ, దీని వల్లనే ఆమెకు ప్రపంచంలో ఉత్కృష్టస్థానం లభించిందని ఎమర్శించారు ఈ విషయం గూడ వ్యాసంలో తెలిపాను సేవ అంటే నిత్య జీవితంలోనూ, స్వల్ప విషయాల్లోనూ గాదని—అసలు యిలాంటి అత్యల్పవిషయాల్ని సేవగా ఎంచుకొని తాను భర్తకు యెంతో సేవ చేస్తున్నామని ఉప్పొంగటం అవివేకం—భర్త భార్యాపిల్లలకోసం ఉదయంనుంచీ సాయంకాలంవరకూ కష్టపడి వస్తాడని యింకో విమర్శ—అంటే వీళ్ళ ఉద్దేశ్యం స్త్రీకి శ్రమలేదని, ఆమెస్వార్థంకోసం పాటుబడుతుందనా? వీరు వనితలైయుండి గూడ యిలా వ్రాయడం విచారకరం—ఎంత భర్త అయితే మాత్రం ఈ వాక్యం చాల తప్పని వ్రాశారు ఈ విషయంలో యింకొంచెం విపులంగా ఆలోచించండి రెండు దెబ్బలువేస్తే భర్తను కాళ్ళదన్ని కన్నవారి ఇళ్ళకువెళ్ళే వనిత లెందరులేరు? వీళ్ళకూ భర్త ప్రత్యక్ష దైవమేగదూ? మరి వాళ్ళెందు కలా చేస్తున్నారంటారు? ఒక చిన్న వ్యాసాధారంతో హైందవసంప్రదాయానికే అవమానం అనుకోవడం మరీ శోచనీయం

కె అనసూయాదేవి (మద్రాసు)

*　*　*

## ఎడ్వాన్సు బుకింగ్

మగవాడు తల్లి దండ్రుల నిర్బంధాలకి తల ఒగ్గక ఎదిరించి తన ఇష్టం వచ్చిన అమ్మాయిని చేసికొగలడు అని వ్రాశారు మగవాళ్ళు కూడా ఈ 'ఎడ్వాన్సు బుకింగు'వల్ల బాధ పడేవాళ్ళున్నారని చెప్పవచ్చును మాకు తెలిసిన ఒకతను పెద్దవాళ్ళ నిర్బంధంవల్ల తనకు ఇష్టంలేకపోయినా పెద్దవాళ్ళకు ఎదురు చెప్పలేక బంధువుల అమ్మాయిని చేసుకొని ఆత్మహత్య చేసుకొన్నాడు ఆడవాళ్ళ సంగతి సరేసరి ఇటువంటివి ఎక్కువగా వింటూనే వుంటాము

టి గిరిజ (రాజమండ్రి)

*　*　*

ఈకాలంలో చిన్నప్పుడు అమ్మమ్మలు, బామ్మలు చేసిన బుకింగుకు ఎవరొప్పుకుంటారు చెప్పండి? వారు మేనరికం గురించి వ్రాసిన కొన్ని విషయాలు సందర్భరహితంగా ఉన్నాయి

మాటూరు కల్పక (విజయనగరం)

*　*　*

''నచ్చనివారు విరుచుకపడ్తారని శంకించి'' వ్యాసము వ్రాయలేదని వ్రాసినారు అట్లు సందేహించటము తప్పేమోననుకొంటున్నాను ఇకముందైనా అట్లనుమానింపక మీ సదుద్దేశాలను వనితాలోకం వ్యాసాలద్వారా తెలిపి వనితలను ప్రోత్సహించగలరని నమ్ముచున్నాను

ఆవుటి సరోజిని (సనతునగర్)

*　*　*

మగవారికి మేము అధికులమనే అహంభావము సహజంగానే వుంటుంది అది గాక భార్య అవగానే తమ క్రింద వ్యక్తి అనే భావం కలుగుతుంది అటువంటి పరిస్థితులలో చిన్నప్పటినుంచీ 'ఒరే' యిది నీ భార్యరా దీన్ని పెళ్ళి చేసుకుంటావా?' అని పిల్లలను కవ్విస్తుంటారు దానివల్ల పద్మశ్రీగారు చెప్పినట్లు ఒకరిమీద ఒకరికి ద్వేషభావమేగాని మంచి అభిప్రాయ మేర్పడదు అన్ని దురాచారాలతోపాటే ఈ వరసలు కలపటమనే దురాచారం గూడా త్వరగా రూపుమాసిపోవటము మంచిది

కుమారి సి శారద (గుంటూరు)

*　*　*

రచయిత్రి చెప్పినట్లు చిన్నప్పుడు స్థిరమైన సంబంధాలు పెద్దయాక తప్పిపోవడము ఆ తప్పిపోవడంవల్ల వారు యావజ్జీవం దుఃఖించడం మనం నిత్య జీవితంలో ఎన్నో చూస్తున్నాము

రత్నం (విశాఖపట్టణం)

*　*　*

మేనరికాల్లో చక్కని సంసారాలుగా శోభిల్లేవి చాల అరుదు మేనరికపు వధూవరులు చిన్నతనం నుండి కలిసి మెలిసి తిరగటంచేత వాళ్ళలో భార్యా భర్తలకు వుండవలసిన సహజాకర్షణ, సహనం, క్షమ, గౌరవభావం లోపించి చులకనభావం, మొండితనం పెరుగుతాయి ఇందుకు కొంతవరకు వియ్యపురాళ్ళ, లేక వియ్యంకుల మనస్తత్వాలు కూడ కారణం కావచ్చు (వధూవరులు పెరిగేది యిరుపక్షాల మనస్తత్వాలఆవరణలోనే కాబట్టి) ముఖ్యంగా భార్య మాట ఎలావున్నా భర్తలో మాత్రం సంస్కృతి నాగరికత లోపిస్తే అందులో మధ్య తరగతి కుటుంబాలలో యిక చెప్పనక్కరలేదు ఆ సంసారం యించుమించు నరకతుల్యమే

ఎం ప్రమీల (మానికొండ) ★

# మీరు
# ఉబ్బసం
# వల్ల బాధపడుతుంటే

ఎఫజోన్ బిళ్లలు మరల భారతదేశంలో దొరుకుచున్నవి. ఉబ్బసం, రొమ్ముపడిశెం, గుండెనంజు, గుండెలలో కఫం, హే జ్వరం, తత్సంబంధమైన వ్యాధుల వల్ల బాధపడు వారికి ఎఫజోన్ గుణకారి. ఎఫజోన్ సేవించుటకు సులభమైనది. సురక్షితమైనది, రూఢిగా గుణమిచ్చునది శీఘ్రనివారణ గలిగించునది.

ఎఫజోన్ సూత్రమందలి వైద్య శాస్త్రీయమైన ఔషధ పదార్థముల గుణములు దిగువ వివరింపబడినవి :—

1. ఎఫజోన్ శ్వాసనాళములయొక్క కండరముల ఈడుపును పోగొట్టే శక్తివంతమైన గుణమును గలిగియున్నది.
2. ఎఫజోన్ శ్వాసనాళములు మరియు గొంతులో గల గట్టి శ్లేష్మమును పలుచన పరచును. అందువల్ల అది సులభంగా దగ్గు మూలకంగా తొలగింపబడగలదు.
3. ఎఫజోన్ ఊపిరితిత్తులందలి రక్తనాళములలో అధికకూడికయైన ఒత్తిడిని నివారించును
4. ఎఫజోన్ గుండెలలోని అత్యాయాసకారక ఒత్తిడిని తగ్గించి పనిచేసే శక్తిని హెచ్చించును
5. ఎఫజోన్ నరములను శమనపరచే గుణమును గలిగియున్నది. ఇందు మూలకంగా ముమ్మరమైన ఉబ్బసంయొక్క ముఖ్యగుణమైన దడతో గూడిన ఒగర్పును తొలగించును మరియు రొమ్ము పడిసెపు బాధైన ఎడతెగని దగ్గును తగ్గించును.

ఉబ్బసం వేగముగా తాకి విజృంభించును. కాని అది తాకిన స్వల్పమాత్రపు చిహ్నం కనిపించగానే ఒక ఎఫజోన్ బిళ్లను మ్రింగినయెడల మీకు రూఢియైన శీఘ్రనివారణ కలుగును.

ఎఫజోన్ యొక్క యోగ్యమైన ప్రశంసనీయ గుణములు, దానిని వాడినట్టి అనేక వ్యాధిపీడితుల వల్లను, దానిని నిర్ణయించిన అనేక మంది డాక్టర్ల వల్లను, ఋజువు పరచబడినవి ఎఫజోన్‌లో అలవాటు కాగల ఓషధులు లేవు. ఇది 15, 45, 100 మాత్రలుగల ప్యాకెట్‌లలో కెమిస్టులందరి వద్దను. మందుల షాపులన్నిటిలోను దొరుకుచున్నది.




# EPHAZONE

ఎఫజోన్ నిర్మాతలు మరియు పంపిణీ దారులు:

జె.ఎల్ మారిసన్, సన్ అండ్ జోన్స్,

ఇండియా లిమిటెడ్

బొంబాయి కలకత్తా మద్రాస్ ఢిల్లీ

# స్త్రీ ధర్మం - గృహిణీత్వం

మతుకుమల్లి సుశీల

సంఘంలో ప్రతివ్యక్తి నిర్వహించవలసిన పాత్రలు సాంప్రదాయం నిర్ణయిస్తుంది ఈ పాత్రలనే మనం ఆ యా వ్యక్తుల విధులనికాని, ధర్మాలనికాని అంటాము సాంప్రదాయ నిర్ణయానికి శాస్త్రాధారాలు వుండనక్కరలేదు సాంఘికావసరాలనిబట్టి సాంప్రదాయాలు ఏర్పడుతుంటాయి నిత్యనూతనంగా రూపొందే దేశ కాల పరిస్థితులని బట్టి సాంప్రదాయాలు మారటం అవసరమనీ, మారుతుంటాయనీ అందరికీ తెలిసిన విషయమే అలా మారకపోతే సాంప్రదాయం సుఖజీవనానికి మార్గదర్శికాక ప్రతిబంధకమౌతుంది

ప్రస్తుతం అమలులోవున్న (మనదేశంలో) స్త్రీధర్మం ఏది? మన అవసరాలనిబట్టి అది ఏవిధంగా మారటం వాంఛనీయం? అని పరిశీలిద్దాము

పౌరాణికయుగంలో పురుషుడు (భర్త) భరించేవాడనీ, స్త్రీ (భార్య) భరింపబడునది అనే భావం ప్రబలంగా వుండేది చారిత్రకంగా చూసినా, స్త్రీ స్థానం యీ విధంగానే కనిపిస్తుంది అంటే సంసార నిర్వహణకి కావలసిన వస్తుసంచయం సేకరించడం భర్తవంతైతే, గృహనిర్వహణ, అతిథి అభ్యాగతుల ఆదరణ, పూజ, శిశు సంరక్షణ ఇత్యాది విధులు భార్య నిర్వహించేది ఇలా స్త్రీవిధ్యుక్తధర్మ నిర్వహణ గృహానికే పరిమితమైనా—ఆదర్శ గృహిణి "కార్యేషు మంత్రీ, కరణేషుదాసీ, భుక్తేషు మాతా, క్షమయా ధరిత్రీ" అనే సూక్తి కనుగుణ్యంగా ప్రవర్తించవలసి వుండేది ఇది తక్కువ బాధ్యతకాదు ఆమెకు గృహ యజమానితో సరి సమానమైన గౌరవప్రతిపత్తులుండేవి ఆమె యిల్లువిడిచి బయటకు వెళ్ళకపోయినా, ప్రతి విషయంలో, వ్యవహారంలో భర్తకు తన బుద్ధిబలంతో సహాయపడేది ఈ విధమైన ధర్మాలనుంచే స్త్రీకి 'గృహిణి' అనే పర్యాయపదం యేర్పడింది ఆనాటి దేశ కాల పరిస్థితులలో స్త్రీనుంచి ఆశించవలసినది యింతకుమించి ఏమీలేదు

కాలక్రమేణా అన్ని పరిస్థితులూ మారుతున్నాయి స్త్రీలు పురుషులతోపాటు చదువుకోవటమేకాక, అనేక సాంఘిక రంగాలలో ముందుకి వస్తున్నారు ఇష్టంవున్నవారు వుద్యోగాలుచేస్తే, లేనివారు యింటిపట్టునే వుంటున్నారు అయితే సాంఘిక రంగాలలో ప్రముఖంగా కనిపించేవారిలో ఎక్కువమంది, సంఘసేవయందాసక్తివలనగాక, తమ ధనం వలనకాని, భర్తల ఉద్యోగపు హోదాలవలనగాని పైకి వస్తున్నారు నిజంగా ముందుకు రావలసినవారంతా వెనకనే వుండిపోతున్నారు ఇందుకు అనేక కారణాలున్నాయి

1 ఇల్లు విడచి బయటి కార్యకలాపాలలో పాల్గొనటం సాధారణ కుటుంబీకులకు తగినిపని అనుకోవటం

2 ఇంటి పనులన్నీ చేసేందుకు పనివాళ్ళున్నవారికి "తిరగటం" సాధ్యం కాని, యింట్లో పనిపాటలు చేసుకునేవాళ్ళకి వీలుకాదనుకోవటం

3 ఏదో పిల్లల్ని చూసుకుంటూ యింటిపట్టున వుండక యీ వ్యాపకాలన్నీ ఎవర్ని ఉద్ధరించేందుకు అనుకోవటం

ఇలా యింకా అనేక కారణాలు ఈ కారణాలను బాగా తరచి చూస్తే గృహిణీధర్మం ముఖ్యమనే మన సాంప్రదాయం వీటన్నిటికీ మూలమని తెలుస్తుంది స్త్రీకి గృహిణీధర్మం ముఖ్యమైనదే కాదని ఎవరూ అనలేదు అయితే ఇతర కార్యకలాపాలలో పాల్గొనటమంటే గృహిణీధర్మాన్ని త్యజించటమని ఎందుకు అనుకోవాలి? రెండిటినీ సమన్వయపరచే పద్ధతి లేదా? ఈ సాంప్రదాయం ఏర్పడిననాటి పరిస్థితులకీ ఇప్పటి పరిస్థితులకీ ఎంతో వ్యత్యాసంవుంది ఉదాహరణకి—అప్పటికీ యిప్పటికీ జీవితంపట్ల దృక్పథంలో ఎంతో తేడా వున్నది కనీస జీవితావసరాలలో ఎంతో మార్పువున్నది వాటిని సేకరించేందుకు పడవలసిన శ్రమలో ఎంతో వ్యత్యాసం వున్నది ఈ మార్పులన్నిటికీ అనుక్షణం మారుతూ వుండే మన నాగరికత కారణం కావచ్చు మన సాంప్రదాయాలనీ, పద్ధతులనీ మన అవసరాలకు తగినట్లు మార్చుకుంటూవుంటే తప్ప జీవిత పోరాటంలో చెప్పుకోతగిన ప్రగతిని సాధించలేము నేటిస్త్రీ ఆదర్శగృహిణిగా వుండటంతో — అంటే కేవలం గృహకృత్యాలతో—తృప్తిపడి వూరకోవలసినదేనా లేక యింకా ఆమె చేయగలిగినదీ, చేయవలసినదీ ఏమైనా వున్నదా అంటే, కావలసినంత వున్నది

దినదినాభివృద్ధి చెందుతున్న యితర నాగరిక దేశాల స్త్రీలతో పోలిస్తే మనదేశంలో స్త్రీలు చాలా సోమరితనంగా కాలం గడుపుతున్నారని చెప్పకతప్పదు విదేశాలలో స్త్రీలు గృహ నిర్వహణతోపాటు యితర విధాల కూడా పురుషులతో సమానంగా పాటుపడి గృహజీవనంలో వారితో సమానమైన స్థానానికి అర్హత సంపాదించుకుంటున్నారు మనం ఏం చేస్తున్నాం? మన పూర్వ స్త్రీలు భరించిన గృహ నిర్వహణభారంలో యీనాటి స్త్రీ భరించే భారం ఎంత? వెనుకటి రోజులలో గృహిణి సమిష్టి కుటుంబాలలో పాడిపంటలతో, వచ్చేపోయేవారితో, బాలింత చూలింతలతో యీ విధమైన రక రకాల బాధ్యతలతో వూపిరి తిరగని పనిలో మునిగితేలుతూ సోమరితనం పేరు వినటానికైనా అవకాశం లేకుండా వుండేది ఈనాటి గృహిణి వివాహమైన మర్నాడే భర్త ఉద్యోగం ధర్మమా అని వేరింటికాపరం (పొరుగూర్లోనే అనుకోండి) వెళ్ళిపోతుంది పాడిపంటల బరువుబాధ్యతలు ఆమెకి లేవు వచ్చేపోయేవారి తాకిడి యిదివరకులా లేదు ఏదో ముగ్గురు నలుగురు పిల్లలతో చుట్టపుచూపుగా వస్తూ పోతూ వుండే అత్త మామలతో ఆమెకి ఎక్కువపని వుండదు ఏదో ఒక అర్ధశేరు బియ్యం కుంపటిమీద పెట్టటం, దానికి తగిన యితర పదార్థాలు తయారు చేయటం, యిల్లు సర్దుకోవటం వగైరా చిన్న చిన్న పనులు ఉదయం సుమారు 5—30—6 గంటలకి ప్రారంభిస్తే 11 గంటలకి భోజనంతోసహా అన్ని పనులూ అయిపోతాయి సాయంత్రం కార్యక్రమం 4 గంటలకి ప్రారంభిస్తే 8 గంటలకి అయిపోతుంది ఈ మధ్యకాలం నిద్రకో, యిరుగు పొరుగులతో లోకాభిరామాయణమో, చౌకబారు నవలా పఠనమో యిత్యాదులతో గడుపుతుంది ఈ విధమైన జీవితం గడిపే నేటి స్త్రీలు వెనుకటి మన స్త్రీలతో పోల్చినా బహు సోమరులుగానే కనిపిస్తారు

ఈ సందర్భంలో విదేశాలలో స్త్రీలను గురించీ వారి సంసారనిర్వహణను గురించి కూడా తెలుసుకుంటే వారికీ మనకీ వుండే వ్యత్యాసం తెలుస్తుంది

ఇక్కడ (అమెరికాలో) సాధారణంగా ఆఫీసులన్నీ ఉదయం 8 గంటలనుంచీ సాయంత్రం 5 గంటల వరకూ పని చేస్తాయి ముఖ్యంగా సెక్రటరీలు, టైపిస్టులు, ఆఫీసులలో, బ్యాంకులలో గుమాస్తాలు, సేల్సు గరల్సు, కాఫెటీరియాలలో సర్వర్సు నూటికీ 70, 80 మంది స్త్రీలే వుంటారు (అంటే వారి ఉద్యోగాలు యీ పద్ధతిలోనే పరిమితమై వుండవు జర్నలిస్టులు, టీచర్సు, న్యూస్ రిపోర్టర్స్, సివిల్ ఉద్యోగాలు (ఎడ్మినిస్ట్రేటివ్) విమాన చోదకులుగా కూడా అనేకమంది స్త్రీలు పని చేస్తారు) వీరిలో గంటల లెక్కని పని చేసేవారు వుంటారు ఫుల్ టైమ్ ఉద్యోగాలు చేసేవారు వుంటారు వారంతా 7—30 లోపల బ్రేక్ ఫాస్ట్ (భర్త పిల్లలతో సహా) పూర్తి చేసుకుని, లంచ్ తయారు చేసుకుని బయలుదేరి పిల్లలని స్కూళ్ళలో వదలి ఎవరి ఆఫీసులకి వారు వెళ్ళిపోతారు సాయంత్రం తిరిగివచ్చి మళ్ళీ యింట్లో పనులన్నీ చేసుకుంటారు మనదేశంలోలాగా వాళ్ళకి పనిమనుషులుండరు వంటకి గాస్, ఎలక్ట్రిసిటీ వాడుతారు బట్టలుతికేందుకు, ఆరబెట్టేందుకు కొందరికి మిషనులు వుంటాయి కొందరికి వుండవు లాండ్రీ ఖర్చులు చాలా ఎక్కువగా వుంటాయి గనుక డ్రైక్లీనింగ్ అవసరమైన బట్టలుతప్ప మిగతావి యింట్లోనే వుతికి యిస్త్రీ చేస్తారు ఇన్ని చేసినా వారు అస్తమానం ధుమధుమలాడటంకానీ, నీరసపడిపోవటంకానీ వుండదు ఎప్పుడూ ఉత్సాహం వెల్లివిరుస్తూవుంటుంది ఎప్పుడు కనిపించినా చిరునవ్వుతో పలకరిస్తారు పగలల్లా ఆఫీసులలో పనివుంటుంది గనుక సోషల్ గాదరింగ్స్(Social gatherings) సాధారణంగా రాత్రి 7—30 నుంచీ 11 గంటలవరకూ వుంటాయి ఈవిధంగా అనేక కార్యక్రమాలలో పాల్గొంటున్నా వారు భర్తకు, పిల్లలకి చేసే సేవకాని, ఆదరణకాని మనవాళ్ళకెంతమాత్రం తీసిపోదు ఈ విధమైన జీవితానికి అవసరమైన విధంగా వారు పిల్లలని పెంచుతారు అరగంట సేపు నిద్ర లేపించుకోవటం, మరో అరగంట బద్ధకంతోటే, యింకో అరగంట అమ్మ పళ్ళుపొడి నీళ్ళూ అందించలేదనీ, కూచునే తీరిక యీ పిల్లలకి లేదు టైము ప్రకారము అన్ని పనులూ

(40-వ పేజీ చూడండి)

**వసుంధర కోపానికి తట్టుకోలేక పోయాడు చివరికి కలలోకూడా కన్పించేసరికి హడలిపోయాడు**



సమయం ఒక శనివారపు మధ్యాహ్నం సందర్భం కాలేజీ బెల్లు మ్రోగింది బిలబిలమంటూ కళకళ లాడుతూ విద్యార్థులూ విద్యార్థినులూ గేటుదాటి బయటకొస్తున్నారు

అందులో ఓ జంటజడల అమ్మాయిలజత నడుస్తూవుంది వెనకాలే ఓ అందమైన అబ్బాయిలజతలా నడుస్తోంది కేవలం కాకతాళీయంగానే —రెండుజతలమధ్యా ఆట్టే దూరం లేదు. అంటే రెంటిలోనూ ఉద్భవించే ధ్వనితరంగాలు అటువి ఇటూ, ఇటువి అటూ రవాణాకాగలిగే పాటి దూరముంది.

అమ్మాయిల్లో ఒకామె పేరు మెరుపుతునక!

అబ్బాయిల్లో ఒకతని పేరు వరదరాజు.

ఇతఃపూర్వం ఆ ఇద్దరిమధ్యా ఎలాటి పరి చయమూ లేదు కాని ప్రస్తుతం అలాటి అవ కాశమేర్పడే సూచన ఉంది

అకస్మాత్తుగా మెరుపుతునక గిరుక్కున వెనక్కి తిరిగి "ఏయ్ మిస్టర్!" అంది

అమాయికంగా కబుర్లాడుకుంటూ నడుస్తున్న ఇద్దరు కుర్రాళ్లూ రాళ్లలా నుంచుండి పోయారు

"పిచ్చిపిచ్చిగా ప్రవర్తించారంటే ప్రిప్పి

కాలేజ్‌కు రిపోర్టివ్వగలను ఇది మొదటిసారి—జాగ్రత్త! మళ్ళీ సభ్యతా సంస్కృతీ అంటూ ఉంబంగా ఉపన్యాసాలిస్తారు—ఛీ!”

చెంపకుచేరెడు నూదంటురాళ్ళలాటి కళ్ళు లావుగా తెరచి, భ్రుకుటి ముడివెట్టి, అబ్బాకో రకంలాటి తర్జనిని గాలిలో ఊపుతూ ఏదో చెప్ప లేని పరిమళంతోసహా, గుక్కతిప్పుకోకుండా, సగం ప్రకాశంగా, సగం స్వగతంలాగా ఆ నాల్గు ముక్కలూ అనేసింది

వరదరాజు ఒకరవ్వ ఉలిక్కిపడి, మరికొంచెం ఉలిక్కిపడి, ఎగిరిపోనున్న మతిని నొక్కిపట్టి, చేష్టలుదక్కి తాపీగా స్తంభించిపోయాడు తేరుకో డానికి ప్రయత్నంచేస్తూ, భూమి తనచుట్టు తాను తిరుగుతోందనే భౌగోళిక సత్యాన్ని అనుభవ పూర్వకంగా గ్రహించినవాడై, సహచరుడైన జగ న్నాథం చేతితాలూకు దెబ్బ జబ్బమీద పడ్డ తర్వాత, కళ్ళనుమూసి, తల విదలించి, స్పృహలో కొచ్చాడు

అప్పుడు రాజులో కోపం రాజుకుంది అరకాలు మంట తలదాకా ప్రాకేవరకూ ఆలస్యం కాగలదని వేరుగా తల్లోనే కోపజ్వాల రగిలింది కాని ఆమె ఒక అందమైన అమ్మాయి కావడమూ, ఆ జ్వాల వెలిగేలోగానే ఆమె అక్కణ్నుంచి వెళ్ళిపోవడమూ వల్ల అతడు శాంతించక తప్పలేదు బుద్ధి యథా ప్రకారంగా పనిచేయడం మొదలెట్టింది

“ఒరే వయస్యా! ఏమిటేరా ఈ సరికొత్త సమస్య! పొరపాటులేకుండా ఉత్తిపుణ్యానికే అదరిపోయేలా బెదరించడం, క్షమించిపారేయడం ఆమెకు అల వాటా? మన గ్రహపాటా? ఎవర్రా ఈ లావణ్య వతి?”

జగన్నాథం సీరియస్ ముఖం పెట్టి “ఏమోరా! నాకుమాత్రమేం తెలుసూ? కాని ముఖంలో రాజచిహ్నాలు కనిపిస్తున్నాయి రుద్రమాంబ అవ తారంతాలూకు కాదుకదా అనిపిస్తోందిరా” అన్నాడు

“ఏ అలంకారానికి సంతోషంగాని ఆమె ఆగ్రహా నికి మనమెందుకు గురికావాల్సొచ్చిందీ అని— మనము అంటే ‘నేను’ అనే మాటకి గౌరవార్థకంలే —నన్ను చూస్తూనే ఆమాట లందికదూ!”

“అందుకు సందేహమెందుకు?”

“ఎందుకో చెప్పేడవరా బాబూ!”

“నాకు తెలిసేడుస్తేగదా!”

“ప్రేమించుమని అర్థించితిమా? వెన్నంటి వేటాడితిమా?”

“అందుకే అందమైన ఆడవాళ్ళకి ఆమడ దూరంలో ఉండాలన్నారు పెద్దలు జరిగిందేదో జరిగిపోయిందిగానీ మళ్ళీ ఆమె ఛాయలకు పోవని లెంపలు వాయించుకుంటే మంచిది”

“యవ్వ్రదేనూ! మగజాతికే అప్రతిష్ఠ తెస్తా వంటావు?”

“ఆ కారణమేమిటో అప్పుడే అడిగేస్తే పోయేదిగా!”

“ఓరి బభ్రాజమానమా! ఒక అబల—అందు లోనూ కినుకవహించిందికనుక ఓర్చుకున్నాంగానీ”

“వెధవ బెక్కు! బుర్ర ఆగిపోయిందని ఆఘో రించరాదూ!”

“ఎదెల్లాగైనా చక్కనిదిరా! పాటలా మాట్లా డ్యంలా నడకా తూపులా చూపూ—ఛీ!”

# వరదరాజీయం

జగన్నాథానికి నిజంగా కోప మొచ్చింది

“ఓవేవు ఆమె తిడుతోంటే సిగ్గులేదురా ఇంకా మెచ్చుకుంటావ్?”

“భస్! మనసుగల మనిషిని, సౌందర్యాన్ని దూషించడమా?”

“ఏడిశావ్‌గాని ఈసంగతి విను! మన కాలేజీ స్టూడెంటొకాడు కవిత్వం రాయడానికి పూను కున్నాట్ట—వాడి కది చేతకాలేదు నిజమైన కవివి కావాలంటే—ఈ అమ్మాయినే గావును— లవ్ చేయమని ఎవరో సలహా యిచ్చారుట నిజం గామోసమకుని ఆమెని ప్రేమించి, ఆమె వద్దంటే విన వానాచీవాట్లూ భోంచేసి ఆ విరహానందం లోనే నికార్సయిన కవియై కూచున్నాట్ట! ఇప్పుడు చక్కగా రాస్తున్నాడని వినికిడి—ఈ ఉదంతాన్ని నాకు మన సోమశేఖరం చెప్పాడు!”

“ఇంత గ్రంథం తెలుసన్నమాట నీకు—ఎవ్వ్రడా మవ్వో—మనకాలేజీలో ఇలాటి కోపభూమ్య, తీవ్రభాష ఉందని ముందే మాటమాత్రంగా నైనా నివేదించుకోలేదు?”

---

ఒకడు- ప్రేమంటే ఏమిటో నీకు తెలుసా?

మరొకడు తెలీకేం? బాగా తెలుసు—మొన్న నేను ప్రేమించిన అమ్మాయి నాకు చెప్పింది! ఇదిగో, చూడు—ఈ చెంప ఎలా వుందో.

అచ్చి రఘురామరెడ్డి (మద్రాసు)

---

“నీకూ కవి కావాలనుందేమిటి?”

“సరేకాని ఒరే జగన్నాథం! ఇప్పుడు నేను చేసిన తప్పేమిటో నీకేమైనా అర్థమైందిరా?

“ఏదైతేనేం? ఆమె మంచిదిగాబట్టి ఈసారికి వదిలేసింది—సంతోషించరాదూ?”

“ఓరి వెంగళాయీ! భర్తృహరిని స్టడీ చేయనిమాట చెప్పావు—ఆఖరుకు మిస్సమ్మ సినిమా అయినా చూడని అజ్ఞానివి”

“అదేమిట్రోయ్! కొత్త సర్టిఫికేటు”

“ఒకసారి వదిలేయడమంటే ఇంకోసారికి అవ కాశ మివ్వడమన్నమాటరా వెర్రినాన్నా!”

“అయితే మళ్ళీ చేద్దామనా?”

“ఎగ్జాక్ట్లీ! కాని ఆ చేయవల్సిందేమిటో తెలిసేవరకూ అవస్థ?”

“ఏదేమైనా ఆమె పూసు మరచిపోవడమే శ్రేయస్కరం”

“నువ్వలా చెయ్—నేనుమాత్రం ఈవిషయం పరిశోధించక తప్పదు”

“తథాస్తు! త్వరలోనే నీకు పి హెచ్ డి డిగ్రీ వచ్చుగాక!”

“నీ ఆశీస్సు ఫలించుగాక—వస్తామరి”

జగన్నాథం రథచక్రంలా దొర్లిపోతూ సందు మలుపుతిరిగి పోస్టలుసైపు వెళ్ళాడు—వరదరాజేమో ప్రవాహంలా రూముకేసి దూసుకు పోయాడు

* * *

రేడియోచెంత పడకకుర్చీలో ఏకాంతంగా కూచుని ఆ కాంత వింత కోపాన్నిగురించి తీవ్రంగా ఆలోచించడం మొదలెట్టాడు రాజు—కాని ఎంత ఆలోచించినా అంతు చిక్కడంలేదు

సేమ్యాపాయసం తాగుతూ మధ్యమధ్య ఘాటైన కొత్తావకాయ నంజుకున్నట్టుగా మధుర మనోహరమైన ఆమె ముఖ మండలంలో ఆ కోపం ఎంత ఇదిగా ఉంది—అబ్బ! రుచికరమైన ఉపమ తోచిందేమిటి చెప్మా! వాడు చెప్పింది నిజమే గావాలన్న—కవులు కావాలంటే ఈ హాయులు తిల కించాలి

ఛీఛీ—తానేం చేస్తున్నాడు? ఆమె కోపానికి హేతువు కనుక్కోబోతూ మధ్య ఈ సాహిత్య సేవేమిటి?

ఆమె తనయెడ పెడసరంగా ఎందుకు మాలా డింది? కాగితాల విమానాల వమూనాలను ఆమె కేశపాశంమీదకు రువ్వాడా? ఈలవేసిగోలశాడా? కపటంతో అపహసించాడా? సభ్యతలేక పదు మ డెనా? లేదే? ముమ్మాటికీ తాను నిర్దోషి— ఇదేదో మిస్టరీలా ఉంది—

దేముడా! ప్రపంచంలో అర్థంకానిది స్త్రీ హృదయ మొక్కటేగదూ! ఏమైనా తానీ పరాభ వాన్ని సహించలేడు—ఆమె కోపాన్ని రూపుమాప కుండా తాను నిద్రపోగూడదు—ఔరా! చెట్టంత మనిషిని ఒక మామూలు కాలేజీవిద్యార్థిని నడి రోడ్డుమీద దుయ్యబట్టడమా!

ఆమె ఆడమళయాళాని కంతటికీ నేతృత్వం వహించుగాక! రంభాద్యప్సరోభామినుల మించిన అందగత్తె ఔగాక! ఈ వరదరాజు వాజమ్మ అను కుంది గాబోలు—మగవాడి ముగుదాడు వేసి దాగుడు మూతలాడించెద! ప్రేమపాశంతో బంధించి వేసెద!

వరదరాజు ఎడదలో ధైర్యం పొంగులువారింది

* * *

జిలుగుపయ్యెద గాలి కల్లలనాడగా, మెడ కిరువేపులా జడలు వ్రేళ్ళాడుతుండగా, మేను అర వంచి, చిగురాకువ్రేళ్ళతో లైబ్రరీ బీరువాలోని ఉద్గ్రంథాల్ని సవరిస్తున్న ‘ఆమె’ను కిటికీలోంచి చూచాడు రాజు—

“అయం ముహూర్తస్సుముహూర్తోఽస్తు” అనుకుని లోపలకు గెంతాడు—

“గుడ్‌మార్నింగ్!” అన్నాడు ప్రతీ అక్ష రానికీ నాగరకతను పులుముతూ—ఆమె కర్ణకుహ రాలు వినిచేస్తున్న జాడలేదు మళ్ళీ అన్నాడు కాస్త బిగ్గరగా—చెవులు శిఖారాలనుబోలిఉన్న మాట వాస్తవమే అయినా చెముడు ఉండకూడ దనే గ్యారంటీ యేమిటి?

రాజుకి చిర్రెత్తుకొచ్చింది—

మహా అయితే రిపోర్టు చేస్తుంది—ఆయన ప్రిన్సిపాలే గాని తన హృదయపాలుడు కాడుగా— ‘తనకోపమే తన శత్రువు’ అన్నారు ఆమె శత్రు వైన కోపాన్ని ధ్వంసంచేయడం ఓ ఘనకార్యమే అన్నాలి మరి—అలా చేస్తే అటు ఆమెకూ ఇటు తనబోటి విరహబాధితులకూ ఎంతో మేలు కలుగు తుంది—

తనలో ఉన్న సంస్కారాన్నంతా బలవంతంగా జేబురుమాల్లో మూటకట్టి జేబులో నిక్షేపించాడు

"అలుక మాని పలుకవేలనో చిలుకా !" అనే పాడు నాటక ఫక్కీలో—ఆమె ఓరగా చూచింది—ఆ చూపులో సొంపైన కెంపుదనం, పట్టరాని ఉక్రోషం వరదరాజుకు సరదా వేసింది

"షటప్" అంది తీక్షణంగా

"ఆంగ్లభాషలో ఎంఫసిస్ బాగుంటుందిసుమా!"

"ఎవరు మీరు ? ఎందు కొచ్చారు ?"

"తెలియదా చెలియా ! లోకకళ్యాణంకోసం వేంచేసిన శ్రీ శ్రీ వరదరాజులం"

"గెట్ అవుట్"

"హడలిపోయి వెడలిపోవడ నికి రాలేదు మేడం!"

"మర్యాదగా వెళ్తారా లేక "

"మీకు శ్రమకల్గడం చూస్తూ చూస్తూ భరించగలమా ? ఎబ్బే!" ఆమె క్రోధమూ, రాజు మొండితనమూ ప్రపోర్షనేటుగా పెరుగుతున్నాయి

"వెళ్లండి" తారస్థాయి గాంధారశ్రుతిలో అంది—

"వచ్చిన పని కాకుండా వెళ్లడం మా ఆచారానికి విరుద్ధం" మంద్రస్థాయి పంచమంలో అన్నాడు

ముచ్చటైన ముక్కుక్రిందుగా రౌద్రరసం తాలూకు చెమటబొట్లు పొటమరించాయి—కోపాన్ని వెడలగ్రక్కే మార్గం తెలీక ఉరగాంగనభంగి బుసలు కొడ్తోంది—భూకంపంవల్ల ఒణికిపోతోంది—వర్షించబోయే మేఘాల్లా కళ్ళు, ఆ కళ్లలో తళుక్కు లీనుతున్న ఎరుపుజీరలు, సాక్షాత్తూ క్రోధం రూపుదిద్దుకొన్నట్టుగా ఉంది

అట్నుంచి నరుక్కు రమ్మన్నట్టుగా తానే వెళ్లడాని కుపక్రమించిన ఆమె ఉద్దేశ్యాన్ని పసిగట్టిన రాజు గభాల్న వెళ్లి గుమ్మానికడ్డంగా నుంచున్నాడు—

నీకు కష్టం కల్గించడం మాకుమాత్రం ఇష్టమూ లేమా ! శాంతించు—నీ మృణాలమృదు హస్తాల్నంటి నిజం చెబుతున్నాను దేవీ—ఈ రాజు నిన్ను తలవనిరోజు లేదు—నా అపచారమేమిటో తెలిస్తే సునాయాసంగా వెళ్తాము—ఈ దీనుణ్ణి కరుణించి ఒక్క ముక్కలోనైనా నగే మా సందేహం తీర్చాలని మనవి"

వరదరాజు చెక్కిలికీ, ఆమె చేతికీ ఎన్ని జన్మాల అనుబంధమోగాని అవి రెండూ కలసి శ్రవణపేయంగా మృదంగవాద్యం వినిపించాలనుకున్నాయి—

సుకుమారమైన ఆమెచేయి కందిపోగలదేమో అని భయంవేసింది రాజుకు—ఇక అక్కణ్నుంచి కథ సాగించలేక తన ఊహలకి ఫుల్‌స్టాప్ పెట్టాడు రాజు—ఇంతాచేసి ఇదంతా ఊహాప్రపంచ మన్నమాట—ఛఛ తానెంత మొరటుగా ఆలోచిస్తున్నాడు ఇంతకంటే నాజుగ్గా ఆలోచించలేని తన మెదడు మీద విసుక్కున్నాడు కాస్సేపు.

* * *

రాత్రి రెండో ఆట సినిమాచూచిన బాపతు నిద్ర ముంచుకొచ్చింది రాజుకు—ఆ నిద్రలో ఉగాది పచ్చడిలాటి వో కలొచ్చింది

రంగు రంగులుగా అలంకరింపబడిన రంగస్థలం భవనమో, వనమో తెలీకుండా ఉంది—రాజు, రాజులా ఆభరణాలూ అవీ ధరించి వో పొదరింటి వారగా నుంచున్నాడు—

నేపథ్యంనుంచి 'రెఝ్ఝుం' మని తంత్రీనాదం, దాన్లో లీనమై ఓ వలపుపిలుపుల మధుర సంగీతం వినిపించింది—తానూ గొంతు విప్పాడు—రాజు కబ్బురమనిపించింది తానూ పాడుతున్నందుకు తనకు సంగీతం అంత బాగా రాదనే ఇలలోని సత్యం కలలోనూ జ్ఞాపక మున్నట్టుంది—ఎవరో ప్లేబాక్ పాడుతూంటే తా నూరకే పెదాలు కదలిస్తున్నట్టు గ్రహించాడు—పాట కాగానే ఎదురుగుండా ప్రత్యక్షమైన లతాంగిని పరకాయించి చూచాడు—

"ఆమె !"

రాజుకు భయమూ, భక్తీ రెండూ కలిగాయి—ముకుళితహస్తుడై ఆమెను స్తోత్రం చేయడం ప్రారంభించాడు

"ఓం, హ్రీం, కలహప్రియాయై నమః, కోపాలంకృతనాసికాగ్రాయై నమః, అకారణద్వేష్యై నమః" సహస్రనామావళి లిస్టు చదవడంమొదలెట్టాడు "

"ఆపండి" అని ఉరిమి "కోపమా!" అని

ooooooooooooooooooooooooooooo

మా ఆవిడ ఎప్పుడు హార్మోనియం వాయిస్తూ ఉండేది. కాని, మా కొమారుడు పుట్టినప్పటి నుంచి ఆవిడ తీరిక లేక, మానేసింది

"చూశావా పిల్లలవల్ల ఎంత ఆనందము, సుఖం ఉందో !"

బి. రాంమోహన్ (సికింద్రాబాదు)

ooooooooooooooooooooooooooooo

మృదువుగా అంది—భయంగా పులకించిపోయాడు

"అబ్బే లేదు" అన్నాడు

ఆకాశంకేసి చూపిస్తూ "కనువిందుచేసే అందమైన చందమామ, పసందైన మందమారుతం—బావున్నాయికదూ" అంటూ ముందుకు దారి తీసిందా మందయాన

"ప్రొద్దున్న రిపోర్టు చేస్తానన్నావుకదా?"

"అబ్బే—అదంతా ఉట్టిదే— మరచిపోండి"

వరదరాజు స్వగతంలో "హా ! ప్లేటు ఫిరాయించిందిరా తస్సాదియ్యా—సందర్భోచిత్యం ఆడవాళ్లకే చెల్లును" అనుకున్నాడు—

ఇట్టి రసకందాయ ఘట్టంలో

"తెల్లవారెను కోడి గూసెను " భూపాలరాగం పాడుతూ జగన్నాథం తట్టి లేపేసరికి కల చెదరిపోయింది—

"ఆగరా వెధవా ! కల పూర్తయాక లేస్తాను" అని అటుతిరిగి పడుకున్నాడు మళ్లీ—

"మిగతా కథ వెండి తెరమీద చూద్దుగానిలే" అంటూ లేపి నుంచుండబెట్టాడు జగన్నాథం

"హా నాథా ! ఎట్లు సైతు నీ బాధ" అంటూ ఆవులించి, చిటికె వేశాడు రాజు

"టైమైపోతోందిగాని ముఖం కడుక్కుని త్వరగా రెడీ అవ్వు !"

"ఎవడ్రా నువ్వు—రసాభాసచేసే కొసరుగా తొందరపెడ్తావు ?" అని లోనికెళ్లి పేస్టూ బ్రష్షూ తెచ్చుకున్నాడు రాజు

"ఓరి మందమతీ ! ఇది ఉదయం కాదు—సాయంకాలం నాలుగున్నరరా బాబూ' అంటూ ఘొల్లుమన్నాడు జగన్నాథం—

* * *

కలా, ఊహా కాని వాస్తవప్రపంచంలో, కాలేజీ గార్డెన్సు గులాబితోటలో, మహాకవి కాళిదాసు మత్తేభంలా నడుస్తూవుంది 'ఆమె'—

"యదిసా రమణీ రమయే హృదయం" రాజు మనస్సు గంతులువేసింది

"పేరలుకం జెందిన కాంత !" అబ్బో ! వెనక్కు తగ్గింది

అంతలోనే "వసుంధరా ! నువ్విక్కడున్నావా ! నీకోసం కాలేజీ అంతా గాలించాను" అంటూ రెండవ రెండుజడ లమ్మాయీ, ఆ వెనకే వో ఒంటిజడమ్మాయీ ప్రవేశించారు

ఆపేరు విని రాజు హఠాత్తుగా ఉలిక్కిపడ్డాడు—అంతక్రితమే జగన్నాథం ఇచ్చిపోయిన చేతిలోని పుస్తకాన్ని గుడ్లు పెద్దవిచేసుకుని చూచాడు మాంత్రికుని అద్దంలో లాగా, తెర మీద బొమ్మల్లాగా గతించిన సంఘటనకూ, అమ్మాయి కోపానికీ, చేతిలోని పుస్తకానికీ, తన సాహిత్య ప్రశంసకూ సమన్వయం కళ్లకు కట్టినట్టయింది

ఐదుజడల ముగ్గురమ్మాయిలూ పచ్చికమీద కూర్చున్నారు—రాజు తిన్నగా వాళ్ల దగ్గర కెళ్లాడు

"క్షమించండి మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తున్నాము" అన్నాడు సవినయంగా

"ఫరవాలేదు, కూర్చోండి" అని ఏమి టన్నట్టు వింతగా చూచింది వసుంధర

"ఈ పుస్తకం ఓమాటు చూడండి దీని పేరూ వసుంధరే మా మిత్రుడు రాసిన ఒక నవల" అంటూ పుస్తకాన్నామె చేతి కిచ్చాడు

"ఎంత బాగుంది చూచావురా ఈ వసుంధరా? నాదేలే మా మిత్రుడు ప్రెజెంట్ చేశాడు" అని మా జగన్నాథంతో చెబుతున్న వాక్యాల్లో పూర్వభాగం మాత్రమే మీకు విన్పించి ఉంటుంది ఇది ఎవరి తప్పో నాకు తెలీకుండా ఉంది" అన్నాడు

ముగ్గురూ విస్తుపోయారు

తన తొందరపాటుకు పశ్చాత్తాప పడింది వసుంధర

"నన్ను క్షమించండి పూర్వాపరాలు తెలీకుండా నేనే తొందరపడి మిమ్మల్ని అనరాని మాటలన్నాను" అంది నొచ్చుకుంటూ

అని "మీవసుంధరని భద్రంగా కాపాడుకోవండి నాకూ నవలలంటే మహా యిష్టం చదువుతూంటే పుస్తకమూ నేనూ ఒకటైపోతాం" అంటూ ఆపుస్తకాన్ని రాజుచేతి కిచ్చింది

ఆమె మాటలలోని వ్యంగ్యం, రాజులో గిలిగింత కలిగించింది. ★

చేతుల్లో నేను, నా అనుచరులు పొందిన పరాభవం, మా నిస్సహాయత, ఆ కటికరాక్షసుని పాలబడ్డ వారి ఆర్తనాదాలు ఓహ్ హృదయశూలాలై బాధిస్తున్నాయి దయామయుడైన భగవంతుడు వా డెవడో గాని ఎప్పుడో వస్తాడని, గ్రెండెల్ దుర్మార్గాలు అణచివేస్తాడని ఆశతో ప్రతి రోజు ప్రార్థనలు చేస్తుండేవాం తెల్లవారేసరికి మాకు మిగులుతున్నది మానవరక్తసంకారుణిత కుడ్యాలు ఆసనాలు, మృతుల అస్థికలు ఇలా ఎంతోమంది విశ్వాసపాత్రులైన అనుచరులను కోల్పోయాను'

"కనుక నువ్వూ నీ అనుచరులు ఆ భవనంలోకే వెళ్లి కూర్చొని బాగా ఆలోచించుకోండి మీ నిశ్చయ మేమిటో మాకు తెలియజేయండి" ఈ విషయం తెల్పుతూ మహారాజు కొలువు చాలించి వెళ్ళిపోయారు

బియోవుల్ఫ్, అతని మిత్రులు, మరికొంత మంది డేనిష్ యోధులు ,హియరాట్ భవనంలోకి వెళ్లారు రాజపరివారం తెచ్చిన ఆ సవాలను సేవించ ప్రారంభించారు

ఇందాకటినుంచి జరుగుతున్న ఈ తతంగాన్నంతా చూస్తూ మూల కూర్చున్నా డొక మహావీరుడు అతగాడి పేరు అన్ఫెర్త్ ఇతని తండ్రి హ్రోత్గార్ దగ్గర ఉన్నతోద్యోగంలో ఉన్నాడు ఈ అన్ఫెర్త్కు, తనలాంటి మహావీరు డొకడిక్కడుండంగా, పరాయిదేశంనుంచి వచ్చినవాడు ఎవ ఎవడో బియోవుల్ఫట, వాణ్ణి మహారాజు పొగడటంచూసి చిర్రెత్తుకొచ్చింది అయినా వీడి వ్యవహార మేమిటో కాస్తంతా కదిలిద్దామను కున్నాడు

"ఏవిటీ ! నువ్వేనా బియోవుల్ఫ్వి ! బ్రెకాతో ఈత పోటీలో పాల్గొన్నవాడివి అందులో చావు దవ్వ కన్ను లొట్టబోయినంత పనైన వాడివి

# బియోవుల్ఫ్

(26-వ పేజీ తరువాయి)

నువ్వేనా నాయనా ! ఇద్దరు నడిసముద్రంలోకి పోయారు అక్కడ చూచేందుకు ఎవరూ ఉండరుగా ! ఇంకేం బ్రెకా నిన్ను తన్ని నార్వే తీరం మీదుగా తన స్వదేశం పోయాడు! ఇదుగో బియోఉల్ఫ్ ! నువ్వెన్ని విజయాలు సాధించినా, ఈ రాత్రి గ్రెండెల్ దగ్గర ఈ భవనంలో ఉండు ! నీ బండారం బయట పడుతుంది"

బియోవుల్ఫ్ ఫక్కున నవ్వి ఇలా సమాధానం చెప్పాడు "అన్ఫర్త్ ! సముద్రంపైన ప్రయాణం చేసి ఎరుగని నువ్వు కూడా బ్రెకా సాహసాలను, విజయాలను గూర్చి మహోఘనంగా చెప్తున్నావే! నేను ఒక సత్యం మాత్రం చెప్తున్నాను నేను బ్రెకాకన్న చాల త్వరగా ఈదగలను అవి మా చిన్నతనపు రోజులు అప్పుడు నేనూ బ్రెకా కూడా చిన్నవాళ్ళమే పందెంవేసి ఈదటానికి బయల్దేరాం సొరచేపలనుంచి ఆత్మరక్షణ చేసుకునేందుకు రెండు కత్తులు కూడా పట్టుకుపోయాం మేం అలా ఐదు అహోరాత్రాలు ఒకళ్ళొకరు విడవకుండా అంటిపెట్టుకునివున్నాం ఆ పాడు తుఫాను విడదీయకుండా వుంటే ఇద్దరం కలిసే ఉండేవాళ్లం నేను ఎన్నో సొరచేపలను చంపాను ఇంతలో ఒక పెద్ద రాక్షసి వచ్చి నన్ను అధఃపాతాళానికి ఈడ్చుకుపోయింది ఏదోవిధంగా దాన్ని సంహరించి బైటపడ్డాను తర్వాత ఎన్నో భూతాలను రాక్షసులను పారదోలి మా గీట్ జాతికి పీడ వదిలించాను ఇదంతా నేను గొప్పకోసం చెప్తున్నా ననుకోకు మిత్రమా ! అన్ఫెర్త్ ! ఇప్పుడు నీకేదో ఉందని చెప్పుకుంటున్నావే గుహాపరాక్రమం ఒకటి ఆ పరాక్రమం నిజంగా నీకున్నట్లయితే మీ మహారాజుకు ఇంత నష్టం కలిగేది కాదు గ్రెండల్ అక్రమాలు ఇలా చెలరేగేవి కావు ఏది ఏమైనా ఆ రాక్షసుడికి నా బలం చవిచూపాలని ఉంది రేపు సూర్యోదయానికి మీరంతా నిర్భయంగా 'హియరాట్' లో ప్రవేశించవచ్చు"

ఇంతలో హ్రోత్గార్సతి వెల్తియోవ్ ఆ భవనం ప్రవేశించింది బియోవుల్ఫ్కు అతని బృందానికి శుభాశీస్సులు తెల్పింది ఆసవం నింపినపాత్రను బియోవుల్ఫ్కు అందిచ్చింది

"ఈ దుష్టరాక్షసుడు గ్రెండల్ నెదిరించటంలో మీ ప్రజలకు తోడ్పడే ఉద్దేశ్యంతో ఇక్కడికి వచ్చాను ఈ తోడ్పాటులో గెల్పినా మరణా వస్తే వచ్చినా నా బాస మాత్రం తప్పను" అని ప్రమాణం చేశాడు బియోవుల్ఫ్

రాణి, డేనిష్ పౌరులు హియరాట్ వదిలి వెళ్లిపోయారు ఆ భవనంలో బియోవుల్ఫ్ అతని బృందం మాత్రమే మిగిలారు గ్రెండల్ పీడ వదిలించుకోటానికి రాజుగారు దేవదూతను కావలి ఉంచారని ప్రజల్లో వాడుక పడిపోయింది ఏమైనా సరే గ్రెండల్ను ఆయుధాలతో చంపకూడదని నిశ్చయించుకొన్నాడు బియోవుల్ఫ్

అప్పటికే బాగా పొద్దుపోయింది ఏదోకొద్ది మంది మాత్రం అంటే బియోవుల్ఫ్ అతని వెంబడి వచ్చిన గీట్ యువకులు మాత్రం "హియరాట్" భవనంలో ఉన్నారు ఆవిశాల భవనం హాల్లో మారుమూలగా బియోవుల్ఫ్ పడక ఉంది గీట్ సైనికులందరు ప్రయాణపు బడలికతో ఉన్నారేమో ఆదమరచి హాయిగా నిద్రిస్తున్నారు

"ఈ గ్రెండల్ ఎవడు ? ఎలా ఉంటాడు ? వీణ్ణి ఎలా జయించాలి ?" ఈ ఆలోచనలతో సతమతమవుతూ పడకమీద దొర్లుతున్నాడు బియోవుల్ఫ్ "ఛట్ ఏమైనా సరే వీడి అంతు తేల్చాలి" అని వాడి రాకకోసం ఎదురు చూస్తున్నాడు బియోవుల్ఫ్

సరిగా యిదే సమయానికి రాక్షసుడు గ్రెండల్ 'హియరాట్' భవనంవైపు సంచారం బయలుదేరాడు ఎవడైనా ఒకడు ఆహారంగా దొరక్కపోతాడా అన్న ఆశతో భవనం కనుచూపు మేరలోకి వచ్చేవరకు ఆకాశవీధిలో అలాఅలా విహరిస్తూ వచ్చాడు తాను ఇలా రావటం ఇదేం కొత్తకాదు ఇదివరకు అంటే గత పద్నాలుగేళ్లనుంచి ఇలా వస్తూనే ఉన్నాడు పాపం ఆహారం కూడా పుష్కలంగా దొరుకుతూనే ఉంది కాని ఈవేళ బయల్దేరేటప్పుడు అమంగళసూచకాలెన్నో కన్పించాయి మెల్లగా వాడు దివి నుండి భువికి దిగాడు 'హియరాట్' భవనం సమీపించాడు

'అరే ! ఎప్పుడూ నాకు స్వాగతం చెప్తున్నట్లు తెరుచుకొనివుండే తలుపులు ఈవేళ మూసే ఉన్నాయేం చెప్మా' అనుకుంటూ విలాసంగా అలా నెట్టాడు ఊరికే వేసున్న తలుపులైతేగా వూడిరావటానికి! లోపలవైపు తలుపుకు అడ్డంగా మాంచి లావాటి దూలాలు పెట్టారు గ్రెండల్కు కోపం రెచ్చిపోయింది భయంకరంగా గుడ్లు చేసుకొని బలంగా ఒక్క త్రోపు త్రోశాడు తలుపుల్ని అంతే



ఈ రోజు అలారం వినపడలేదు, అందుకే లేవడం చాలా ఆలస్యమయింది.

చిత్రకారుడు: ఎ. ఎస్. ప్రకాశరావు (అనకాపల్లి)

... లోపల నిద్రపోతున్న గేట్ వీరులు కన్పించారు వాళ్ళను చూసీ చూడగానే ఒకణ్ణి విరిచి ముక్క గూడా మిగలకుండా తినేశాడు

ఎవరో మూల మంచంమీద నిద్రపోతు న్నట్టు లీలగా కన్పించింది గ్రిండల్‌కు భలేగా దొరికాడు అనుకుంటూ బియోవుల్ఫ్‌ను పట్టుకో టానికి చేయి చాస్తూ వెళ్ళాడు

వీడి ఆర్భాట మంతా చూస్తూవున్న బియోవుల్ఫ్‌కు మంచి అవకాశం దొరికింది గ్రిండాల్ చెయ్యి చాచగానే ఆ చేతిని అలానే వెనక్కు విరిచి పట్టేశాడు ఆపనే జరక్కపోతే వీడు ఈపాటికి తననుగూడా తినేశేవాడు బియోవుల్ఫ్ దృఢ హస్తాల నుంచి తప్పించుకోవాలని గ్రిండల్ అనేకవిధాల ప్రయత్నించాడు చివరకు చేసేదిలేక పెడబొబ్బలు పెట్టాడు ఆ అరుపులకు భవనంలో కొంతభాగం కూలిపడిందట కూడా!

గ్రిండల్ అరుపులను విని జనమంతా లేళ్లలా బెదిరి లేచారు చుట్టుపక్కలవాళ్ళంతా డేనిష్ యోధులతో సహా ఆయుధాలతో హియరాట్ భవనాన్ని చేరారు లోపలికి తొంగిచూచారు వీరాధి వీరులైన ఆ మహనీయు లందరికి కత్తులు చేతులో వున్నా కాళ్ళు వణుకుతున్నై ఏంచెయ్యాలో ఎవరికి పాలుపోవటంలేదు

గేట్ వీరులు మాత్రం తమ నాయకుడికి అండగా నిలబడ్డారు ఈలోపుగా గ్రిండల్ బియోవుల్ఫ్ గుప్పిటలోనుంచి తప్పించుకోవాలని ఎన్నో విధాల ప్రయత్నించాడు కాలితో తన్నాలను కున్నాడు చెయ్యి కొరకాలని చూశాడు ఇంకా ఎన్నోవిధాల ప్రయత్నించాడు ఏం లాభంలేక పోయింది బడితెల్లాగా ఉన్న చేతిగోళ్ళు విరిగి పోయాయి ఇంతేగాక ఈ లాగులాటలో గ్రిండాల్‌కు ఒక చెయ్యి నరాలు చిట్లేపట్టు సడల నారంభించాయి నెత్తురు కూడా కారటం ప్రారంభమైంది పట్టు విడవకుండా బియోవుల్ఫ్, పట్టు విడిపించుకోవాలని గ్రిండల్ ప్రయత్నిస్తూ కొట్టుకో నారంభించారు ఈ పోరాటంలో 'హియరాట్ భవనంలో ఉన్న విలువగల సామగ్రి ఎంతో నాశనమైంది భవనం చుట్టూ మూగిన జనానికి, భవనంలోంచి పెడబొబ్బలు, ఆర్తనాదాలు వినిపిస్తున్నాయి అరుపులు విని జనమంతా, ఇవి దైవ విరోధి తన పరాజయాన్ని అంగీకరిస్తూ చేస్తున్న ఆక్రందన మనుకుంటున్నారు బియోవుల్ఫ్ పట్టులో ఉన్న గ్రిండల్‌కు అంతకంతకూ బాధ ఎక్కువ కాసాగింది ఎన్నోవిధాల ప్రయత్నించినా గ్రిండల్, బియోవుల్ఫ్ పట్టునుంచి విడిపించుకో లేక పోతున్నాడు

ఏది ఏమైనాసరే వీణ్ణి ప్రాణాలతో విడిచి పెట్టకూడ దనుకున్నాడు బియోవుల్ఫ్ తా నింత దూరం శ్రమపడి వచ్చింది వీణ్ణి ప్రాణాలతో విడిచి పెట్టేందుకా!

గేట్ వీరులందరు తమప్రాణా లర్పించైనా తమ నాయకుణ్ణి రక్షించుకోవా లనుకున్నారు గ్రిండల్‌ను చంపాలని ఎన్నోవిధాల ఆయుధాలు ప్రయోగించారు కాని ఆయుధాల్లో ఒక్కటి కూడా ఆ రాక్షసుడికి హాని కల్గించలేకపోయింది ఇంక వీణ్ణి చంపి మానవలోకానికి శాంతి కల్గించాలంటే అది దైవేచ్ఛతో కూడిన మానవబలమే నని నిర్ధారణ చేసుకొన్నారు

ఇంతలో ఒక వింత జరిగింది గ్రిండల్ భుజంలో ఏర్పడ్డ గాయం క్షణక్షణానికి పెద్దదై నెత్తురు కారటం ప్రారంభమైంది బియోవుల్ఫ్ పట్టుకోటం, గ్రిండల్ విడిపించుకొనేందుకు లాగుకోటంలో ఆ చెయ్యి కాస్తా వూడి బియోవుల్ఫ్ చేతిలోకి వచ్చింది గేట్ వీరులు అడ్డు పడేలోగానే గ్రిండల్ పారిపోయాడు ఈ విధంగా చెయ్యి తెగి ఎక్కువ నెత్తురు పోవటంవల్ల వాడి ఆయువు రోజుల లెక్కకు వచ్చిందని బియోవుల్ఫ్ విశ్వ యించుకున్నాడు

మొత్తంమీద గత పన్నాలుగేళ్ళగా డేనిష్ పౌరులను హ్రాత్గార్ మహారాజును బాధిస్తున్న రాక్షసపీడ విరగడైనందుకు, తన శక్తి సామర్థ్యాలు ఇలా సద్వినియోగమైనందుకు బియోవుల్ఫ్ ఎంతో ఆనందించాడు

—(ఇంకా ఉంది)

---

# చతురంగ తురంగం

(27-వ పేజీ తరువాయి)

మయిన పిమ్మట తిమ్మన్న ఒకనాడు తెగించి పెద్దనామాత్యుని సందర్శించి తన మనోభావం వెల్లడించాడు ఆయన కొంచెంసే పాలోచించి గట్టిగా వాగ్దానం చెయ్యలే నన్నాడు అవకాశాన్ని బట్టి చేతనయినంత వరకు సాయపడగలనని మాట ఇచ్చాడు ఆపైన అలాగ అలాగమరికొన్ని వారాలు గడిచిపోయినా అతని సంకల్పం ఫలించలేదు ప్రాణం విసిగి ప్రధానమంత్రి నొకసారి సందర్శించాలని నిశ్చయించుకొన్నాడు అంతలోనే పెద్దమాత్యు డొకనాడు కబురు పంపించి 'తిమ్మన్నా! ఇన్నాళ్ళ నించి రాయలవా రెన్నడు చదరంగం ప్రస్తావనే ఎత్తలేదు అందుచేత నే నీ విషయం వారితో విన్నవించడం సముచితం కాదేమో అని కొంచెం సంకోచించాను అయితే నిన్న ఆయనే స్వయంగా ఆ ప్రస్తావన తెచ్చి నిన్నొకసారి చూడాలని ఉన్న దని అన్నారు ఆపైన రేపే నిన్ను వెంట బెట్టుకొని రాగలనని వారితో అన్నాను తలవనితలంపుగా నీ పూర్వ పుణ్యం ఫలించింది!' అని అభినందించాడు

ఆ మరునాడు అపరాహ్ణవేళ తిరిగి రాయలతో తిమ్మన్న చతురంగం ప్రారంభమయింది మహా ప్రధానితోబాటు పెద్దనామాత్యుడు వారి సరసనే సమాసీను డయినాడు తిమ్మన్న ఆట, బహుమతి గెలుచుకో లేక పోయినా అధమం సమానమైనా చేసి తీరాలని నిర్ణయించుకొన్నాడు అందుచేత ప్రతి ఎత్తు జాగ్రత్తగా ఆలోచించి వేస మిక్కిలి మెళకువతో బలం మున్ముందు కురికించాడు కాని ప్రమాద వశాత్తు తిమ్మన్న మంత్రి రాయల శకటాఘాతంతో అస్తవ్యస్తమై బరిలో పడింది ఆ మంత్రిని తిరిగి తీసుకోవలసినదని కృష్ణదేవరాయ లాదేశించినా తిమ్మన్న మరి స్వీకరించలేదు 'తమ దగ్గర ఓటమి కూడా నా కొక గొప్ప గెలుపే!' అని ఎంతో వినయంతో విన్నవించి ఇంకొక కొత్త ఎత్తు వేశాడు మంత్రి పోయినా గుర్రాల జంటతో నయినా ఆట సమానం చెయ్యవచ్చునని ఆశించాడు

అంతలోనే గుర్రాలకు రెండింటికి అంకెవేసె రాయల బలంలో వీర విహారం చేయించాడు అలాగే శరంపరలాగ రెండు మూడు ఎత్తులువేసి పెల్లుబికిన ఉల్లాసంతో 'మహాప్రభూ! ఆట సమానమయింది!' అన్నాడు కృష్ణదేవరాయులంతలోనే చిరునవ్వు చిందించి 'సరిసమానం కాలేదు! మా ఆటే కట్టినట్టుంది! మీరే గెలుచుకున్నారీవేళ!' అన్నాడు

అంతలోనే మహామాత్యుని కనుసన్న గ్రహించిన పెద్దనామాత్యుడు అమూల్యములయిన కాశ్మీర దుశ్శాలువలతో తిమ్మన నలంకరించి నవరత్న ఖచితమయిన వీర ఘంటికలతో మారుమ్రోగుతున్న ముంజేతి కంకణాల జంట బహూకరించి గభీర స్వరంతో ప్రశంసించాడు

'నాయనా! ఏలినవారితో నేను, ప్రధానామాత్యులు కలిసి ఎన్నెన్ని మారులు ఆటలు వేసినా ఓడిపోవడమేగాని గెలుపెన్నడు చేకూరలేదు అయితే మేము నిరుత్సాహపడిపోతామేమో అని ఆలోచించి ఆయన ఆటలు కొన్నిసరిసమానాలు చేసేవారు చతురంగ బలాల పోరాటంలోకాని, ఆటలోకాని దిగ్విజయమే కాని ఓటమి ఎన్నడు వారికి కెదురువడ లేదు అటువంటి మేటి పోటరి నేడు తామై పరాజయం అంగీకరించారంటే — అది నీ ఎడల ఏర్పడిన పరమానుగ్రహమేగాని వేరొకటి కాదు సుమా!'

రాయలా ప్రసంగం విని ఆత్మీయ దృష్టితో తిమ్మన ననుగ్రహించి పెద్దన నుద్దేశించి 'ఆయన మహా కవీశ్వరులు! వాక్ చతురంగ చమత్కృతిలో వారిని మించగల వారెవ్వరున్నారు! ఎంతగా ఆలోచించినా వారి పలుకులలోతు లెవ్వరికి తెలియవు!' అని నర్మగర్భితస్వరంతో వ్యాఖ్యానించాడు

అంతలోనే తిమ్మన్న ఆ బహుమానం అందుకొని, 'మహాకవీ! తామన్నది అక్షరాల యథార్థమే అయితే నావంటి అల్పవ్యక్తిమీద ప్రభువుల కనుగ్రహదృష్టి ఏర్పడడం కూడా ఒక గొప్ప విశేషమే!' అని సవినయంగా విన్నవించి వారి కందరికీ నమస్కరించి మిక్కిలి అడకువతో వీడ్కొన్నాడు మార్గమధ్యంలో 'రాయలవారొక వేళ నామీద దయ తలిచి ఆట ఓడిపోలేదు కదా!' అని అనేక విధాల వితర్కించుకొన్నాడు అటు పిమ్మట రాజ ద్వారందాటిపోయే సమయంలో ఒక భట్టు అతనిని సమీపించి చేయెత్తి దీవించి ఆశు కవితతో ప్రశంసించాడు

'మతిమంతు లేకమైనన్
సతతము శ్రీ కృష్ణ రాయ జగతీపతితో
చతురంగమాడి గెలుచున్
ధృతిమంతుడు బొడ్డుచెర్ల తిమ్మన బళిరే!'

ఆ ప్రశస్తివిన్న తరువాత తిమ్మన్న హృదయంలో చెలరేగిన మథన అంతా ఒక్కసారిగా పటాపంచలయింది! మరుక్షణంలోనే అతని చేతనున్న కాశ్మీర శాలువా భట్టుభుజయుగళి కలంకారమై తరలించింది!



అటూ తిప్పిచూచి, "ఈరాయి చాలా అందంగా, నున్నగా చూడ డానికి చాలా బాగావుంది. నాకిచ్చి వెళ్ళుసామీ. వీశరాయిగా వాడు కుంటాను బదులుగా ఒకవీశ వంకాయలు పట్టుకెళ్ళు సరేనా సామీ?" అంది. చిదానందం మాట్లాడకుండ ఆరాయి వెనక్కు తీసికొని 'ఇప్పటికి దీనివిలువ ఓ వీశ వంకాయలన్నమాట' అని అను కుంటూ ముందుకు పోయాడు. గురువులవారు ఇంకా కొన్నిచోట్ల విచారించమన్నారు కనుక అతడు ఇంకెవ్వరిని 'అడగాలా' అను కుంటూ, విపణి వీధి వేపు వెళ్ళ సాగాడు ఒక అంగడిలోకి వెళ్ళి, యజమానికి రాయి చూపి విలువకట్ట మని అడిగాడు ఆయన రాయిని తీసి కొని పరీక్షించి, అది మామూలు రాయి కాదని తెలుసుకున్నాడు. అయినా ఆ యజమానికి గాని విషయం పూర్తిగా తెలియదు కనుక, "స్వామీ! ఓవరహా ఖరీదుచేయ వచ్చు అంతకుమించి నేను చెప్ప లేను" అని చెప్పాడు

శిష్యుడికి చాలా ఆశ్చర్యం వేసింది. ఆ రాయి విలువ వీశ వంకాయలనుంచి, ఒక వరహాకు పెరిగిందే 'ఇంకా నలుగురిని విచా రిస్తే బాగుంటుంది అని అను కుంటూ అలా వెళ్ళసాగాడు ఒక ఇంటి వసారాలో, కంసాలి ఒకడు పనిచేసుకుంటూ వుండడము చూచి, చిదానందం ఆయనవద్దకు వెళ్ళి, రాయిని చూపి విలువకట్టమని అడి గాడు. ఆ కంసాలి, రాయిని తనకు చేతనయినట్లు పరీక్షించాడు తర్వాత దానిని చిదానందానికి తిరిగి ఇస్తూ ఇలా అన్నాడు, "స్వామీ! ఇది వజ్రాలజాతికి చెందిన రాయిలా కన

# విలువ

(23-వ పేజీ తరవాయి)

బడుతున్నది కానీ నేను నిశ్చయ ముగా వజ్రమో కాదో చెప్పలేను. కానీ ఇది మామూలు రాయి మాత్రము కాదు బహుశః ఓ పది వరహాలు చేయవచ్చు"

చిదానందం ఇంకా ముందుకు వెళ్ళాడు. అలా వెళ్ళగా కొందరు పెద్దమనుష్యులు ఒక చోట చేరి పిచ్చాపాటి మాట్లాడుకోడము గమ నించాడు. వారిని విచారిస్తే రాయి అసలు విలువ తెలుపగలరని తలచి, వారివద్దకు వెళ్ళి, నమస్కరించి,

వైద్యుడు - ఎవరైతే రోజూ కొక గంట గొంతెత్తి పాడుతారో, అలాంటి వాళ్లకి వృద్ధాప్యములో గుండెజబ్బుల బాధ వుండదు

వినేవాడు -- అసలు వృద్ధాప్యము బాధే వుండదేమో!

సి హెచ్ రామమూర్తి (రాజమండ్రి)

ఒకాయన చేతిలో ఆరాయి పెట్టి ఖరీదుకట్టమని అడిగాడు. ఆయన దానిని చూచి, "అయిదువందల వరహాలు తప్పక చేస్తుంది" అని చెప్పి, ప్రక్కనున్న వ్యక్తివైపు తిరిగి, "మీకు కొంత రత్నపరీక్ష తెలుసునుగదా? ఈ రత్నము ఏమాత్రము ఖరీదు చేయవచ్చును?" అని దానిని ఆయన చేతిలోవుంచాడు ఆయన దానిని ఇటూ, అటూ, త్రిప్పి చూచి, "ఇది మేలిమి రత్నము కాని ఇంకా ముడిసరకుగా వుంది. జాగ్రత్తగా కోసి, సానబట్టితే రెండువేల వరహాల పైచిలుకే చేస్తుంది" అని చెప్పి ఊరుకున్నాడు.

ఇంతలో మూడవ పెద్దమనిషి దానిని తీసికొని జాగ్రత్తగా పరీక్ష చేసిచూశాడు ఆయన ఒక రత్నాల వ్యాపారి ఆయన ఇలా అన్నాడు' "ఎక్కడి రెండువేల వరహాలయ్యా! సులభంగా అయిదువేలు చేస్తుంది" అని దానిని ఇంకా జాగ్రత్తగా పరి క్షించాడు. ఆఖరుకు చిదానందం వైపుకు తిరిగి, "అయ్యా ఇది మేలిమి జాతికి చెందిన రత్నము మేము దీని అసలువిలువ కట్టుటకు అంత సమర్థు లము కాదు నాకు తెలిసినంతవరకు ఇది అయిదువేలు పదివేల మధ్యలో చేయవచ్చు ఒక మాట చెబుతాను. వినండి ఇక్కడికి దగ్గరలో నే రత్నాలబజారుంది అంగులో ఒక ప్రముఖ రత్నాల వ్యాపారి ధనపా లుడని వున్నాడు ఆయనే దీనికి సరి యైన ఖరీదుకట్టగల సమర్థులు మీరు ఈ రత్నాన్ని ఇంకెవరికీ చూపక, ఆయనదగ్గరికి పోయి ఇవ్వండి ఆయన న్యాయసమ్మతంగా అసలువిలువకట్టి మీకు చెప్ప గలరు తర్వాత మీఇష్టం," అని సలహా ఇచ్చాడు

తల తిరిగిపోయింది చిదానం దానికి. "ఇదేమిటి! దీనివిలువ రాను రాను పెరుగుతోందే! వీశ వంకా యలనుంచి అయిదువేల వరహాల పైకి పోయింది అసలు దీనికి విలువ అనేది వుందా? అయినా దీని విలువ గురువుగారికెందుకో? ఎంత ఆశ్చ ర్యం! గురువుగారి వద్ద ఎంత విలువ గల రత్నాలున్నాయి? తమకు ఈ విషయమై బొత్తిగా తెలియదే! ఈ రత్నాల నుంచుకొని గురువుగారేం చేస్తున్నారు? ఎందుకయినా మంచిది. ఆ రత్నాలవ్యాపారిని కనుక్కొని అసలువిలువ తెలుసుకోవాలి" ఇలా ఆలోచించుకుంటూ చిదానందం

ధనపాలుడున్న దుకాణం వైపు పోయాడు వెళ్ళి తనవద్దగల రత్నాన్నిఇచ్చి ఎంతమాత్రం విలువ చేస్తుందో చెప్పమని కోరాడు. ధనపాలుడు దానిని తీసుకున్నాడు. లోపలికి వెళ్లి చాలా జాగ్రత్తగా పరీక్షించాడు కొన్ని పనిముట్లతో కొట్టాడు, గీచాడు కాసేపటికి బయటకు వచ్చాడు చిదానందం వైపు తిరిగి ఇట్లా అన్నాడు "స్వామీ! మీరు చూడబోతే సన్యాసుల్లాగున్నారు ఈ రత్నము మీకు ఎక్కడిదో? అయినా సన్యాసులవద్ద, గొప్ప మునీశ్వరుల వద్దనే సాధారణంగా మేలిమి రత్నాలు వజ్రాలు వుంటాయని నానమ్మకం! సరే విలువ అడిగారు కనుక చెబుతున్నాను నిజం చెప్పాలంటే ఈ రత్నానికి విలువే లేదు. నాయావదాస్తి ఇచ్చినా దీనివిలువకు సరిపోదు ఇది వెలలేని మేటిరత్నము నేను దీనిని ఖరీదు చేసేటంత సమర్థుడను కాను. ఆమాటకొస్తే దీనిని ఖరీదుచేయగల వారు, ఈ ప్రపంచంలోనే వుండరేమో! ఇది వెలలేనిది "

ప్రాన్పడిపోయాడు శిష్యుడు అసలు విలువే లేదేమో అని ఆశ్చర్యపడ్డాడు ఇక సంతలో వుండ బుద్ధి పుట్టలేద ఆ మేలిమిరత్నాన్ని జాగ్రత్తగా పైపంచలో మూటకట్టుకున్నాడు నేరుగా గురువులవారి వద్దకువచ్చి జరిగిందిచెప్పాడు "గురువర్యా! మీరు విలువ కనుక్కొ-న మని ఇచ్చినరాయి ఒక మేటి రత్నమట! నేను మొదట దానిని గాయి అనుకొని వెళ్లి ఒక కాయగూరల అమ్మని అడిగా విలువకట్టమని వీశ వంకాయలని తేలింది, దాని ఖరీదు. తర్వాత క్రమేపి దానివిలువ ఒక వరహానుంచి అయిదువేల వరహాల హైకిపోయింది. ఆఖరి విలువగా అది ఒక మేలిమి రత్నమని విలువలేనిదని తేలింది. దానికి విలువలేదని చెప్పిన వ్యక్తి ధనపాలుడనే ఒక ప్రముఖ రత్నాలవ్యాపారి అట. ఇది స్వామీ అసలుసంగతి" అని వినయవిధేయతలతో చెప్పాడు. అంతావిని రామతీర్థులవారు చిరునవ్వు నవ్వారు. మనంబున శ్రీరామ నామము జపించి ఇలా అన్నారు "ప్రియశిష్యులారా! చిదానందం చెప్పినదంతా మీరు విన్నారు కదా.

---

వైమానికుడు - విమానం కొద్ది నిముషాలలో కూలిపోతుంది, బెలూన్స తగిలించుకుని దుమకండి

ఒకతను - అయ్య బాబోయ్ చీకటిలో క్రిందకు దుమకటమే! చచ్చిపోనూ?

కట్టా తిమ్మాజిరావు (పోలిశెట్టిపాడు)

---

ఇక మీ సందేహానికి సమాధానం వినండి

"మొదట రాయి అనుకొని తిసికెళ్ళిన వస్తువు వెలలేని మేటి రత్నంగా తేలింది ఒక రత్నానికి విలువ కట్టాలంటే రత్నపరీక్షలో ప్రావీణ్యంతో బాటుగా సంపూర్ణ జ్ఞానం కావాలి ఆజ్ఞానం లేకపోబట్టే కూరగాయల అమ్మి, దానిని రత్నమని తెలిసికొనలేక, ఒకరాయిగా జమకట్టి, తూనికకట్టెగా వుపయోగించుకొనడానికి ఇష్టపడింది కనుక వీశ వంకాయలకు విలువకట్టింది రత్నపరీక్షలో కొద్దోగొప్పో జ్ఞానం వుండబట్టి మిగతా వ్యాపారులు ఒక వరహానుంచి,ఐదువేల వరహాలవరకు విలువను ఇవ్వగలిగారు. రత్నపరీక్షలోసంపూర్ణజ్ఞానం సంపాదించబట్టి ధనపాలుడు ఆరాయిని, ఒక మేలిమిజాతి రత్నంగా నిర్ణయించి, విలువలేదని చెప్పాడు

అలానే రామనామజపమనెడి రత్నముయొక్క విలువ కూడా. 'రామా' అనేది రెండక్షరముల పేరుమాత్రమే దాని విలువను గూర్చి నేను మీకేమి చెప్పగలను? దానిని నిత్యము జపించుటవలని గల ప్రయోజనమును గూర్చి నేనెట్లా మీకు తెలియచేయగలను? దానికి సరియైన విలువ నిర్ణయించి, దాని జపమువలవగల ప్రయోజనము తెలుసుకోవాలంటే సంపూర్ణ జ్ఞానం కావాలి. రత్నానికి రత్న నిపుణుడు ఎలా విలువ లేదన్నాడో, అలానే రామనామజపానికి విలువ లేదు ఎవరెవరి జ్ఞానంకొద్దీ వారు ఈ సంగతి తెలుసుకోగలరు రత్న పరీక్షలో పూర్తిగా జ్ఞానంలేనివ్యాపారులు, నేనిచ్చిన రత్నానికి ఎలా అయితే ఒక వరహానుంచి ఐదు వేల వరహాలవరకు నిర్ణయించారో, అలానే ఎవరెవరి భక్తిజ్ఞానాలకు తగినట్లు రామనామజపమునకు విలువ నిర్ణయించుకొనగలరు కానీ సంపూర్ణజ్ఞానవంతులకు మాత్రము అది వెలలేనిదిగా తెలుసు కాబట్టి ఈ సంగతి మీకు మీరే తెలుసుకోగోరుతాను ఇక మీ సందేహ నివృత్తి అయివదనుకుంటాను "

ఇలా చెప్పి, సాదరంగా శిష్యుల వైపు చూచి, రామనామజపంలో మునిగిపోయారు రామతీర్థులవారు

★

జరిగిపోతాయి ఈ పద్ధతివల్ల తల్లులకి శ్రమ తగ్గటమేకాక, ఎల్లలకి ఆత్మవిశ్వాసం, క్రమశిక్షణ అలవడతాయి (ఇక్కడ పురుషుల సహాయ, సహకారాలు స్త్రీకి అందుబాటులో వుంటాయి)

ఇక మన సంగతికి తిరిగి వద్దాం మన దేశం జనాభాలో సుమారు సగం మంది స్త్రీలున్నారు వారిలో వెయ్యికి ఒకరిద్దరుతప్ప మిగిలినవారంతా (కూలి జనం మినహాయిస్తే) ఏదో ఒక సేవంతో సోమరిజీవితం గడిపేవారే అనేక సంవత్సరాల దాస్యం తరువాత క్రొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకున్న దేశం మనది ఇతర దేశాలతో సరిసమానంగా మనమూ వుండాలంటే వాయువేగ మనోవేగాలతో వివిధ రంగాలలో అభ్యుదయం సాధించాలి అయితే స్త్రీరూపంలో యీ విధంగా యింత మానవశక్తి వ్యర్థమైపోతుంటే మనం సాధించే అభ్యుదయం ఏమిటి? ఎన్నటికి?

పిల్లలు మరీ పసివాళ్లైతే తప్ప, బడికివెళ్లే యీడు పిల్లలున్న తల్లులు కేవలం వంటా వార్పుతో తృప్తి పడక ఏదో ఒక వ్యాపకం కలిగించుకోవాలి మగవాళ్లే నిరుద్యోగసమస్యతో బాధపడుతుంటే స్త్రీలు కూడా ఎగబడితే ఎక్కడినుంచి ఉద్యోగాలు వస్తాయని అనకండి మగవారిలో నాల్గుసార్లు స్కూల్ ఫైనల్ ఫేలయి కలెక్టరుగిరీకోసం కలలుకనేవారు ఎందరో వున్నారు గనుక నిరుద్యోగ సమస్య యింత తీవ్రంగావుంది ఎవరికి తగిన వుద్యోగం వారు చేస్తూ, వూరికే వుండటం కన్న ఎంత చిన్నదైనా ఉద్యోగం చేయటం ఎక్కువ గౌరవప్రదమన్న భావం కలిగిననాడు యీ సమస్య యింత తీవ్రంగా వుండదు

వ్యాపకం అంటే ప్రతివాళ్ళూ ఉద్యోగాలే చేయనక్కరలేదు తమకి తాము సహాయం చేసుకుంటూ యితరులకి సహాయం చేసే పద్ధతులు ఎన్నో వున్నాయి ఉదాహరణకి, పదిమంది స్త్రీలు ఒక చిన్న సంస్థగా ఏర్పడి సమిష్టిగా చేతిపనులు

# స్త్రీధర్మం - గృహిణీత్వం

(31-వ పేజీ తరువాయి)

చేసో, బట్టలుకుట్టో, ఏదో ఒక విధమైన గృహ పరిశ్రమ ప్రారంభించి వృద్ధి చేసుకునో, యిలా అనేకమైన వ్యాపకాలు ఏర్పరచుకోవచ్చు మన దేశంలో సాంఘిక సంక్షేమశాఖ నిధులు వుపయోగించుకునేవారు లేక మురిగిపోతున్నాయి ఇవికాక పసిపిల్లల తల్లులు (ఉద్యోగం చేయటం యిష్టం లేనివారు) యితర పిల్లలనీ చూసుకోకలిగితే తమకి ఆదాయమూ—యితరులకి సహాయమూ ఇందులో చిన్నతనమేమీ లేదు ఉద్యోగమూ, రాబడీ అవసరం లేనివారు, వూరి పరిశుభ్రత, వయోజనవిద్య, ముష్టివాళ్ళ సమస్య—యిలాంటి ఉపయోగమైన పనులు సమిష్టిగా చేసే అవకాశం, అవసరం ఎంతైనా వున్నది ఐతే యిలా సమిష్టిగా పని చేయాలంటే ఐకమత్యం, పరస్పరం అభిప్రాయాలను గౌరవించుకోవటం, వ్యక్తిప్రాముఖ్యతని మరచిపోవటం ఎంతైనా అవసరం గృహిణీధర్మాన్ని నిర్వహిస్తూ, ఇతరత్రా కూడా ఉపయోగపడటం పరస్పర విరుద్ధంకాదు అత్తారింటికి వచ్చిన క్రొత్త అల్లుళ్ళలాగా ఎంతసేపూ ఉద్యోగా లివ్వలేదనీ, జీతాలు పెంచలేదనీ, ఇంగ్లీషువాళ్ళుండగా సుఖంగా వుండేవాళ్ళం స్వాతంత్ర్యంవచ్చి ఉద్ధరించిందేమిటనీ నిరర్థకంగా ప్రభుత్వాన్ని ఆడిపోసుకోవటంకన్న, ఎవరి శక్తికి తగినట్లు వారు నిర్మాణాత్మకమైన కృషి చేయాలి పురుషులతో సమానంగా స్త్రీలు కూడా అన్ని రంగాలలో అభివృద్ధి సాధించాలి ఆడపిల్లలు డొమెస్టిక్ సైన్సు, హోమ్‌యికానమిక్స్ మాత్రమే చదవాలి—మిగతావన్నీ మగచదువులని త్రోసి పారేయక, అన్ని విద్యలూ నేర్చుకుని సాంకేతిక (Technical) రంగాలలో కూడా ఉపయోగపడేందుకు తగిన అర్హతలు స్త్రీలు సంపాదించుకోవాలి ఒక్కమాటలో చెప్పాలంటే—స్త్రీత్వం కారణంగా, ఏ విద్యకికాని, ఉద్యోగానికికాని స్త్రీ దూరం కాకూడదు

స్త్రీరూపంలో వృథాలయ్యే మానవశక్తినంతా కూడదీసుకుని, నిర్మాణకార్యక్రమాలలో వినియోగించుకోకలిగితే ఆర్థికంగా వెనుకబడి వుండవలసిన అవస్థ మనకి వుండదు ఉత్పత్తి పెరుగుతుంది దానితో జీవిత సౌకర్యాలు పెరుగుతాయి జీవన స్థాయి పెరుగుతుంది ఇతర దేశాల స్త్రీలు యింటి పనులు చేసుకునేందుకు మనకన్న ఎక్కువ సౌకర్యాలు వున్నాయంటే, వాటిని సంపాదించుకునేందుకు వారు పడే శ్రమ మనం మరచిపోకూడదు

ఈ సందర్భంలో యు ఎస్ ఎ ప్రెసిడెంట్ కెనడీ తన ప్రథమ అధ్యక్షోపన్యాసంలో చేసిన ఒక సూచన ప్రపంచ ప్రజలందరికీ పనికి వస్తుంది "నాదేశం నాకేమి చేస్తుంది అని కాక, నేను నా దేశానికేమి చేయగలను?" అనే ప్రశ్న ప్రతి వ్యక్తి తనకు తాను వేసుకుని ఆత్మవిమర్శ చేసుకోవాలన్నారు ఆయన నెహ్రూజీని ప్రపంచ నాయకులలో ఒకరుగా గౌరవిస్తున్నారనీ, గాంధీజీకి లండనులో మెమోరియల్ ఏర్పాటు చేస్తున్నారనీ మనం గర్వపడవచ్చు కానీ, ఆ గొప్పతనం వారికి వ్యక్తిగతంగా కలిగినదికానీ, దేశాన్నిబట్టి వచ్చినది కాదని మనం మరచిపోకూడదు విదేశీయులు మన దేశానికి వచ్చినప్పుడు లాంఛనప్రాయంగా చేసే మెప్పులు విని మనం మురిసిపోయి లాభంలేదు "మా తాతలు నేతులు త్రాగారు—మా మూతులు వాసన చూడ" మన్నట్లు ఎప్పుడో శతాబ్దాల క్రిందట మనకి గర్వించతగిన సంస్కృతి, సంపద వుండేవని యిప్పుడు మనం వెన్నువిరుచుకు తిరిగి ప్రయోజనంలేదు మనకన్నా వెనుకబడిన దేశాలువున్నా, దేశం బయట ఈనాటికీ భారతదేశం వెనుకబడిన దేశంగానే పరిగణింపబడుతోంది పూర్వపు స్థాయిని తిరిగి అందుకుని, ప్రపంచంలో మనదేశానికి అగ్రస్థానం సంపాదించే బాధ్యత మనది "దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అని గురజాడ చెప్పినదాంట్లో భావమిదే దేశ విస్తీర్ణం, జనాభా, గొప్పతనాన్ని సంపాదించలేవు ఆ మనుష్యుల విలువమీద దేశపు విలువ ఆధారపడి వుంటుంది, అన్నమాట ఈ విధమైన కృషిలో స్త్రీలు వెనుకంజ వేసేందుకు వీలులేదు ఎవరి పరిధిలో వారు చేయగలిగినది చేయాలి ఇందులో స్త్రీధర్మవిరుద్ధమైన దేదీలేదు

ఈనాటి దేశకాలపరిస్థితులలో స్త్రీ ధర్మానికవసరమైన సాంప్రదాయ మిది ఇందు కవసరమైన మానసికమైనమార్పులు వస్తేకాని సాంఘికమైన మార్పులు రావు పాశ్చాత్యవనితలను గ్రుడ్డిగా అనుకరించమంటున్నాననికానీ, పాశ్చాత్య వ్యామోహంలో నేను పడి కొట్టుకుపోతున్నాననికానీ అనుకుంటే పొరపాటు మీదే! ప్రాక్పశ్చిమాల మేలు కలయికే నేను కోరేదీ, సూచించేదీ!

[ఈ వ్యాసరచయిత్రి ప్రస్తుతం అమెరికాలో వున్నారు]





"కుటుంబరావుగారు"

డి. వి. నందకుమార్ (విశాఖపట్టణం)

వినబడింది మసీదు గోడలమధ్య నుండి.

ఖైదీ ఎటు పాలుపోక నిలబడిపోయాడు. పెదవు టల మరీ జోరుగా కారుతున్నాయి భయం, అలసట ముందడుగు వేయనీయలేదు కుక్క దగ్గరిగా వచ్చి మొరుగుతూ అతన్ని నీళ్ళ కార్పిస్తూ ఉంది

మసీదులో నుండి ఒక పొడుగాటి వ్యక్తి పెను భూతంలా బయటికి వచ్చాడు "ఏయ్! మోతి, ఇక్కడ్రా!" అని కుక్కను పిలిచాడు అది కుయ్యో, కుయ్యో మంటూ కాళ్ల దగ్గరికి తోకా డిస్తూ వచ్చింది

ఆ మనిషి ఖైదీని చూశాడు దగ్గరగా పోయాడు ఖైదీ దూరంగా జరుగుతున్నాడు భయంతో

"భయపడొద్దు నేనేం అనను ఇలా దగ్గరికి రా! చీకటిలో నుండి వెలుగులా బయల్పడు తున్న మాటలు ఖైదీని అనుకోకుండానే అతని దగ్గరికి నడిపించాయి అతను అగ్గిపుల్ల గీసి ఆ వెలుగులో ఆ ఖైదీని చూశాడు ఖైదీ ఆ మనిషిని, గుర్రుమంటున్న కుక్కను చూశాడు

ఖైదీ డస్సిపోయి వణుకుతున్న శరీరంతో బక్కపలుచగా ఉన్నాడు గడ్డం పెరిగిఉంది కండ్లు లోతుగా పాలిపోయి ఉన్నాయి చారల నిక్కరు—శర్టుతో చేతికి ఉన్న బేడీలు, గొలుసులు ఇవ్వన్ని చూశాడు మనిషి

పెద్ద గడ్డం మోకాళ్ల వరకు మాసి వ్రేలాడు తున్న లాల్చి పెద్దపెద్ద గళ్ళలుంగి పెద్ద పెద్ద కండ్లు మోటుగా, మురికిగా ఉన్న వ్యక్తిని చూసుకున్నాడు ఖైదీ ప్రక్కనే బక్కగా, పొడుగుగా సాగి డొక్కలు ఎండిన కుక్క తోక ఆడిస్తూవుంది

"ఎవరు నువ్వు? పారిపోతున్న ఖైదీవా ?"

"అవును !"

"మహా గొప్ప పిరికిపని చేశావు! పేరేమిటి?"

"సత్యం !"

"అలా అయితే భయపడకుండా రా నాతో ! ఈ మసీదులో నీలాంటి వాళ్లకి చోటుంది!" అంటూ దారితీశాడు ఆ గడ్డంమనిషి సత్యం అతని వెనకాలే వెళ్లాడు

మసీదులోపల పెద్ద లోగిలి విశాలమైన స్థలం గడ్డం మనిషి కూర్చున్నాడు అతన్ని కూర్చోమన్నాడు

"ఎవరు నీవు ? నీ పేరేమిటి ?" కూర్చుంటూ అడిగాడు సత్యం

"ఒక మనిషినే! నా పేరు కావాలంటే ఏం చెప్పాలి ఫకీరు అంటారు అంతా !" అని మెల్లిగా శోభనతోనిండిన కంఠంతో జవాబిచ్చాడు

కొన్ని నిమిషాలపాటు నిశ్శబ్దం కుక్క మెల్లిగా వచ్చి ఫకీరు ప్రక్క డొక్కలు చాచుకొని పడు కుంది అతనూ నడుం వాల్చాడు

సత్యం భయంగా — "ఏమయ్యా ! నా ఈ బేడీలు విరగ్గొడుతావా" అని అడిగాడు

"ఎందుకు ? నీ బేడీలు విరగ్గొట్టి ఈ ప్రపంచ మనే మహా పెద్ద జైల్లోకి వంపమంటావా నిన్ను వద్దు ఏమిటన్నావ్ — నీ పేరు? సత్యం కదూ !

## నిరాశ్రయులు

(21-వ పేజీ తరువాయి)

ఆఁ సత్యం అసలు నావల్లకాదు అలానే పడుకో! అది సరేగాని—సెంట్రలు జైలునుండేనా రావడం ? ఏమి నేరం చేశావు ? ఎలా జైలుకి వెళ్లావు" అని అడగడం మొదలుపెట్టాడు ఫకీరు

ఒక పెద్ద నిట్టూర్పు విడిచి సత్యం అలానే రాళ్లపై మేనువాల్చాడు — "ఏం చెప్పమంటావు ! చేశాను నేరం మహా ఘోరం అనుకోకుండానే చేశాను ఒకరిని బ్రతికించుకోవాలని — బాగా బ్రతకాలని, పరిస్థితులకు బానిసగా మారిపోయి చేశాను " ఆగిపోయాడు సత్యం చెప్తతూ

"అది సరేగాని జైలునుండి ఎట్లా తప్పించు

---

టీచర్ - ఒరేయ్ గోపీ!

గోపీ - యస్సార్

టీచర్ - రవి అనగా ఎవ్వరా?

గోపి - సూర్యుడు సార్.

టీచర్ - ఆయన పనేమిట్రా? రెండు వాక్యాల్లో చెప్పు చూద్దాం.

గోపి - వేసవికాలంలో ప్రజలకు ఉమ్మరం గల్గించడం ఒకటి వారి పడకలు వీధుల్లో పడేసి వారి చేతులకు విసనకఱ్ఱలందీయడం రెండు

ఈ జవాబుకు క్లాసుతో పాటు ఉపాధ్యాయుడు కూడ కడుపుబ్బ నవ్వారు

పీరంరెడ్డి పుట్టారెడ్డి (గుంతకల్లు)

---

కొని రాగలిగావు ? అది చెప్పు ముందు" అని అడిగాడు మధ్యలో ఫకీరు

"ఖైదీలమంతా కొన్ని నెలలనుండి వేసుకొన్న ప్లాను ఇదంతా అందులో ముఖ్యంగా యావజ్జీవ కారాగారశిక్షను పొందుతున్నవారి దీ ఆలోచన వారు మిగతా ఖైదీలను పురిగొల్పి ఒకదినం భోజనాలవేళ దొమ్మీజరిపి తప్పించుకొందామని నిర్ణయించుకొని కావలసినవన్నీ ఆలోచించి సిద్ధమయ్యారు ఆఖరికి ఈనాడు మేమంతా దొమ్మీ జరిపాము చాలామంది తప్పించుకొని పరిగెత్తారు కాని ఎంతోమంది తుపాకి కాల్పులకి గురి అయ్యారు నేనుమాత్రం మరికొందరితో సహా తప్పించుకోగలిగాను మేమంతా చెల్లాచెదు రుగా పారిపోయాము ......" సత్యం చెప్తుతూ ఆయాసంతో ఆగిపోయాడు

ఇంతలో రాత్రి రెండుగంటలు 'టంగు టంగు' మని దూరంనుండి జైలు గంటలు వినబడ్డాయి

"ఏ ఖైదీల దొమ్మీ అదుపులోకి వచ్చినట్టు ఉంది అందుకే మరి గంటలు మ్రోగుతున్నాయి యథాలాపంగా" చిన్నగా ఫకీరు నవ్వుతూ మత్తుగా అన్నాడు — "అయితే ఏమిటన్నావ్ ఎందుకు వెళ్లావు జైలుకి ?"

నీరసంగా సత్యం ప్రారంభించాడు—"సంవత్సరం పిల్లవాణ్ణప్పుడే మా నాన్నగారు పోయారు ఉన్న కాస్త రెండెకరాల భూమిని మా మామ అన్యాయం చేసి భుక్తం చేసుకున్నాడు ఏ దిక్కు దివాణం లేకపోయేసరికి మా అమ్మ నన్ను తీసుకొని హైదరాబాద్‌నగరం చేరుకుంది అక్కడా — ఇక్కడా పనిమనిషిగా చేరి నన్ను సాకుతూ వచ్చింది. ఆతర్వాత ఒక ఫ్యాక్టరీలో ఉద్యోగం దొరికింది. ఆమె నన్ను తన యాభైరూపాయల సంపాదనతో గారాబంగా పెంచింది నేను ఏవిధంగానో కష్టపడి స్కూలుఫైనలు ప్యాసయ్యాను మా అమ్మ కడుపులో నొప్పితో బాధపడుతూఉండేది. మొదట ఆసుపత్రిలో ఆపరేషన్ చేస్తానన్నారు. కాని ఒప్పుకోలేదు మా అమ్మ అలాగే కాలం గడుపుతూవచ్చింది నేను అంతలోగా టైపు పరీక్ష ప్యాసయ్యాను నాకు టైపిస్టు ఉద్యోగం ఎంతో ప్రయత్నించిన తర్వాత కుదిరింది"

ఫకీరు ఒక్క పెట్టున ఇజోలుమని దగ్గాడు. కుక్క చలికి 'కుయ్యి' మంటూ సణిగింది

"నేను వద్దన్నా బలవంతంగా మా అమ్మ పెండ్లిచేసేసింది అప్పటికి నాకు ఇరవైమూడు ఏండ్లు మా అమ్మకు కడుపునొప్పి ముదిరింది ఆసుపత్రికి పోవాలసి వచ్చింది డాక్టర్లు ఆపరేషన్ చేయందే లాభంలేదన్నారు అమ్మ చివరికి 'సరే' నంది ఆపరేషన్ మహా కష్టంపై జరిగింది కడుపులో గడ్డ తీసేశారు డాక్టర్లు హడావిడిగా పరుగెత్తారు కాని చివరకు రక్తం తగ్గిపోవడం వల్ల నన్ను విడిచి అమ్మ వెళ్లిపోయింది ఆనాడు నాకు కన్నీరు కంటే ఇంకే ఆప్తబంధువు లభించ లేదు"

"రెండు సంవత్సరాల తర్వాత నా భార్య ప్రసవించే రోజులు వచ్చాయి ఆమె బలహీనంగా ఉండేది ఆసుపత్రికి పంపించేముందే నాహృదయం కంపించిపోయింది టైపిస్టు ఉద్యోగంవల్ల వచ్చే జీతం నెల తిరగకముందే నీళ్లలా ఇనికిపోయేది. పట్టణంలో బ్రతుకు డబ్బులేంది కుక్క కంటే అన్యాయం భార్య సుఖంగా ఇంటికి తిరిగి రావా లనుకుంటే మందులకి డబ్బు కావాలి నాచేతిలో చిల్లిగవ్వకూడా లేదు ఆమెను ఆసుపత్రిలో చేర్పించానేగాని నా ప్రాణంలోని ప్రాణం ఆమెను రక్షించుకోవాలని ప్రయత్నించింది డాక్టర్లు చెప్పారు — 'చాలా బలహీనంగా వుంది ఆమెకు తగిన మందులు లేంది లాభంలే'దన్నారు అందువల్ల కనీసం నాకు ఉన్న భార్యప్రాణం అయినా దక్కించు

కోవాలని శతవిధాల ప్రయత్నం చేశాను అప్పు కొరకు తిరిగాను ఎవ్వరూ ఇవ్వలేదు ''

"ఆ రాత్రి నా భార్య మహా ఘోరంగా నొప్పులు పడుతూవుంది ఇంకేం ఒక నిశ్చయానికి వచ్చే శాను ''

"ఆనాడు ఈనాటిలాంటి రాత్రే రాత్రి పన్నెండు దాటిన తరువాత బయలుదేరాను వడ్డీ వ్యాపారి సేఠ్ జగన్నాథ్ దాస్ బంగళా చేరు కున్నాను మెల్లిగా ప్రక్కనే ఉన్న చెట్టు ఎక్కి బంగళాపై అంతస్తుపైకి దిగాను ఒక గదిలో ప్రవేశించాను అక్కడే ఇనప్పెట్టె ఉంది నాకీ గది బాగా తెలుసు మా అమ్మ ముందు ఎప్పుడైనా వస్తువులు తాకట్టు పెట్టడానికి ఇక్క డికి వచ్చేది ఆ గదిలోనే పడుకున్నాడు జగన్నాథ్ దాస్ కొడుకు తాళంచెవులు తలగడక్రింది నుంచి లాగాను సేఠ్ కొడుకు మేలుకున్నాడు నేను భయంతో బిర్రబిగిసిపోయాను బలం కూడగట్టుకొని వాడు "చోర్ — చోర్" అని కేకలువేస్తున్నా లెక్కచేయకుండా ఒక్కతాపు తన్నాను క్రిందినుండి కుక్క మొరిగింది వాచ్ మాన్, సేఠ్ పరుగెత్తుకొస్తున్నారు తప్పించుకో డానికి వీలు లేకపోయింది పట్టుబడ్డాను సేఠ్ కొడుకు రక్తంకక్కి క్రింద పడివున్నాడు పోలీసులు వచ్చి పట్టుకెళ్లారు మరుసటిరోజు కోర్టులో హాజరుపర్చారు అక్కడే అనుకుంటాను తెలిసింది నా భార్య ప్రసవించలేక ప్రాణాలు విడిచిందని నాకున్న ప్రపంచం మునిగిపోయింది

"కోర్టులో హత్యాభియోగంపై నాకు యావ జ్జీవ కారాగారశిక్ష విధించారు పదిహేను సంవత్స రాలు జైల్లో గడపమని న్యాయమూర్తులు నన్ను ఈ జైల్లోకి పంపించారు పాతిక సంవత్సరాలు దాటుతున్న నాటి నా యువజీవితం ముప్ఫై సంవత్సరాలు పడుతున్న ఈ కాలంవరకు ఈ జైల్లో గడిపాను ''

ఫకీరు లేచి కూర్చున్నాడు తనచుట్ట రెలిగించాడు ఖాండ్రించి ఉమ్మివేశాడు

"జైలుజీవితం నరకయాతనగా ఉండేది దిన మంతా కాళ్లు చేతులు పూడిపోయేలా కాయ కష్టం — చాలీచాలని తిండి నన్ను ఆ జీవితం అన హ్యుణ్ణి చేసింది ఎలాగో అయిదు సంవత్సరాలు గడిచిపోయాయి నాలాగే జైలు జీవితం గడుపు తున్న ఇతర ఖైదీలు ఆ జీవితంతో విసిగిపోయారు ప్రపంచంపై కసితీర్చుకోవాలని మా ప్రయత్నం ఒక నిశ్చయానికి వచ్చి ఈ దొమ్మికి ఈరోజు ఇలా తలపడ్డాము జైల్లోనుండి తప్పించుకొని పారిపోతూ ఇక్కడే దగ్గర్లో ఉన్న బస్తీలో అడుగుపెట్టాను అక్కడ అర్ధరాత్రి ముగ్గురు గొర్రెతోళ్లు కప్పుకొన్న తోడేళ్లలాంటి మను ష్యులు తోడిమానవుణ్ణి నిలువునా గొంతు కోసే స్తుంటే రక్షించాలని ముందుకురికాను కాని రాక్షసులు నన్ను చూసి నాపై ఆ హత్య మోపుదా మని 'దొంగ' అని తరిమారు అక్కడినుండి తప్పించుకొని ఇలా వచ్చాను ఆ హత్య చూసి మనస్సులోని కొద్ది ఆశా అడుగంటిపోయింది అమాయకులైన మనుష్యులనే బ్రతుకనీయక పోతే — దొంగ హంతకుడనే ముద్రపడిన నన్ను ఈ మనుష్యులు తమ మధ్య బ్రతుకనిస్తారా ?" సత్యం వణుకుతున్న కంఠంతో మాటాడ్డం మానుకున్నాడు

"బాగుంది! ఎందుకు బ్రతుకనిస్తారు ? ఏం లాభం నీవు దొమ్మీచేసి పరుగెత్తిరావడం ఎక్కడికి పోతా విప్పుడు ? ఎక్కడికి వెళ్లినా పోలీసులు మళ్లీ పట్టుకుపోతారు నీవు చేసిన తప్పు గ్రహించ లేదు ఆవేశంలో జైలు ఒక చిన్న నరకకూపం మరి అన్నిరోజులు ప్రత్యక్ష నరకాన్ని ఈ ప్రపం చంలో అనుభవించి మళ్లీ ఎందుకొచ్చావు ఇందు లోకే ? టైపిస్టు ఉద్యోగం నీలో ప్రాణం ఉండేలా చేసింది దానితోపాటు నీ కోరికలను

భార్య -"ఏమండీ! అమ్మాయి నలా ఎన్నిరోజులు ఇంట్లో ఉంచుకుందామంటారు"

భర్త -"ఆగవే! మంచి సంబంధం రానీ"

భార్య -"మీచాదస్తంగానీ, ఏదోవచ్చిన సంబంధంతో బంధం వేయక ఏమిటండీ 'ఆగవే' అంటారు. అమ్మాయి వయస్సు కన్నాముందే 'మంచి సంబంధం కాకున్నా' మావాళ్ళు నాపెళ్లి చేయలేదూ!"

యస్. నారాయణరావు,
(హైదరాబాద్)

ఆశయాలను మూలమట్టం చేసివేసింది నీకు తెలుసు ఆ ఉద్యోగంవల్ల నీ జీవితం అలానే గడిచి పోయేదని పరిస్థితులకి ఎదురుతిరిగి నిన్ను మరో విధంగా పైకి లేపుకుందామని ప్రయత్నించావు నీకు తెలుసు ఈ ప్రపంచంలో ప్రతివాడు ఏదో విధంగా చాటు మాటుగా ఒకవిధంగా దొంగతనం గానే బ్రతుకు వెళ్లబుచ్చుతున్నాడు నీవుమాత్రం సఫలీకృతుడవు కాలేదు అయినా సత్యం ! ఏముంది జీవితంలో మనలాంటివాళ్లకి నా విషయమే చూడు ఒకప్పుడు మహా ధనవంతుణ్ణి సారా వ్యాపారం చేసేవాణ్ణి భార్యా — బంధువులు మహా పజావుగా ఉండేది జీవితం ప్రతివాడు సారాబట్టీ పెట్టేసరికి ప్రభుత్వం అరెస్టు చేయడం మొదలుపెట్టింది నా వ్యాపారం దెబ్బ తిని మా కుటుంబాన్ని చీల్చివేసింది ఆ కథంతా ఎందుకు చెప్పమంటావు నేను మాత్రం ప్రస్తుత పరిస్థితుల్లోకి వచ్చేసాను ప్రొద్దున, సాయంత్రం ఫకీరులా బిచ్చమెత్తుకోడం డబ్బులు కూడబెట్టి నల్లమందు కొనుక్కోడం ఈ కుక్క ఎక్కడి నుండో దారితప్పి వచ్చి నాతోనే ఉండిపోయింది. కుక్క—నేను బ్రతుకు లాక్కొస్తున్నాము ఇంకేం ఉందని ? ఏనాడో చచ్చిపోతాను, ఈ దగ్గు — గుండెనొప్పితో బ్రతుకు అనవసరం దానికో అర్థంలేదు ఈ సంసారం, ఈ సంఘం, చదువులు మర్యాదలు అన్నీ చివరికి శ్మశానానికి దారితీస్తాయి ''

"నేను బ్రతికాను పెద్దఎత్తుననే నీవు బ్రతికావు టైపిస్టుగా జీవితం ఒకవిధంగా యాంత్రికంగా సాగిపోయింది నీకు ఎదురుగా ఉన్న పరిస్థితులలో పడి కిమ్మనకుండా కొంతకాలం కొట్టుకపోయావ్ నేను అంతే ఈ మనుష్యులు అంతే అంతకంటె పెద్ద విశేషమేమీ లేదు" అంటూ శ్వాసపీల్చి పెద్దగా దగ్గాడు ఫకీరు

సత్యం దూరంనుండి మాటాడినట్టు మెల్లిగా అన్నాడు — "అయితే ఏంచేద్దాం ? మనకి దారి ఏది ? అదృష్టం చెప్పుచేతల్లో కీలుబొమ్మలా బ్రతికేకంటే చేసేదేముంది ఈ లోకంలో నాకు తెలుసు నేను మళ్లీ పట్టుబడొచ్చు ఈసారి మరణశిక్ష విధిస్తారు అంతకంటె ఏముంది ఇక్కడ త్రిశంకుస్వర్గంలాంటి భూమి అక్కడ కొనవూపిరితో ప్రాణం పీల్చుకొనే జైలు నేను చచ్చినా — నీవు చచ్చినా సానుభూతి చూపేవాడు ఎవ్వడూ ఉండడు పైగా పనికిరానివారు చచ్చేరులే అని ఈసడించుకుంటుంది లోకం అందుకే నీకేమి దారితోస్తుందో చెప్పు ?"

అప్పుడే మూడు గంటలు వినబడ్డాయి.

ఏదో దీర్ఘ ఆలోచననుండి తేరుకుని ఫకీరు అన్నాడు — "అవును సత్యం ! జీవితం నిరర్థకం ఇక్కడ ఏ అభివృద్ధి పథకాలైనా బ్రతకనేర్చినవాడి కొరకే ఉపయోగపడతాయి కాని నాకు — నీకూ కాదు బ్రతుకుచేతుల్లో ఓడిపోయాం అందుకే ఈ సంఘం మనకి ఆశ్రయం ఇవ్వదు నా కో ఆలోచన తట్టింది ఇన్నిరోజులనుండి అనుకున్నటు వంటిది ఈనాడు నాకు నీవు జతగా దొరికావు ''

"ఏమిటది తొందరగా చెప్పు !" అని ఆశ —ఆతృతతో అడిగాడు సత్యం

"ఏమిలేదు నాదగ్గర నల్లమందు ఉంది మోతాదు మించి వేసుకుందాం మత్తుగా రాయి వలె పడిపోయి ప్రాణాలు వదలివేయొచ్చు నీక్కు తెలుసు—నాకు తెలుసు మనకి ఆశ ఏ కోశానా లేదని మరి ఇంకెందుకు బ్రతికి ఏమంటావు ?"

సత్యం మూలిగాడు ఫకీరు నల్లమందు తయారుచేస్తున్నాడు దూరంనుండి ఎక్కడో కోడి కూసింది



వేతూ మునసబు అతని వెనకాలనుంచి ముందుకు వచ్చాడు రాజారావు సమాధానమేమీ యివ్వకుండా ఒకసారి క్రౌర్యం ఉట్టిపడుతున్న మునసబు ముఖంలోకి చూశాడు

"మీరంటే ఇంతవరకు ఏదో సద్భావం ఉంది రోడ్డుకాచి ఇలా ఒక గౌరవనీయమైన కుటుంబం లోని అమ్మాయితో నడిరోడ్డుమీద మంతనాలు సాగిస్తున్నా రనుకోలేదు" అన్నాడు మునసబు

"ఏమిటా అర్థంలేని మాటలు ?" కోపంతో అన్నాడు రాజారావు

మునసబు వికటంగా నవ్వాడు

"ఆమె నాకు క్రొత్త కాదు లలితకు, ఆమె అక్కకు నేను కొన్నాళ్ళు చదువు చెప్పిన సంగతి మీకు తెలియంది కాదు"

"నాకు తెలుసయ్యా—తెలుసు అన్నీ తెలుసు .. ఏవో ఎత్తులువేసి అమాయకురాలైన లలితను మోసగిద్దా మనుకుంటున్నావేమో ఈ విషయం నరసింహప్ప దొరవారికి తెలిస్తే నల్గిని నలిపి నట్టు నలిపేస్తారు జాగ్రత్త" అంటూ వెళ్ళి పోయాడు మునసబు

రాజారావు రూక్షణంగా ఒకసారి మునసబును చూ ముందుకు నడుస్తున్నాడు

"నిజంగానే లలిత అమాయకురాలు మనుష్యు ల్లోని క్రౌర్యం, సంకుచితభావాలూ ఆమెకేం తెలుసు ? ఆమెను మోసపుచ్చడానికి తనేమీ ఎత్తులు వేయలేదే మునసబు అన్నట్టు లలితను తాను ఓ శిష్యురాలిగానే భావిస్తున్నాడు ఆమె ఏవో తనమీద వూహలు కల్పించుకుంటున్నది ఆ వూహ లకు గుళ్ళూ గోపురాలు కట్టుకుంటున్నట్టుంది ... భగ్నమైతే ఆ సుకుమారి భరించగలదా ? దానికి తను బాధ్యుడా ? తను తెలిసి ఆమె కేమీ ఆశలు కల్పించలేదే ! మరి ఆమె కెందుకూ అంత దగ్గరితనం, అభిమానం తనమీద ?" అని యోచిస్తూ నడుస్తున్నాడు రాజారావు

అలివేణి వూలచెండు తలలో పెట్టుకుంటూ బాల్కనీలోకి వచ్చింది ఆమె దృష్టి పది గజాల దూరంనుంచి వస్తున్న రాజారావుమీద పడింది సంభ్రమాశ్చర్యాలతో 'వెదకబోయిన తీగ' అను కుంది

"లక్ష్మి లక్ష్మి " అని పిలిచేప్పటికి దాసీది "ఏంటమ్మగారు" అంటూ బాల్కనీలోకి వచ్చింది అలివేణి చేయెత్తి రాజారావును చూపి "ఆయనేకదూ రాజారావుగారంటే" అని ప్రశ్నిం చింది 'ఔ' నని తలూపింది లక్ష్మి

"ఆయన్ను ఇక్కడకు పిలుచుకురావే లక్ష్మి" అంది అలివేణి

"అమ్మ బాబోయ్—దొరగారికి తెలిస్తే ఇంకే మైనా ఉందా ?" భయాందోళనలతో అంది లక్ష్మి

అలివేణి నవ్వి "నీకేం భయంలేదే ఎప్పిదానా దొరవారే పిలిచి మాట్లాడమన్నారులే వూ వెళ్ళు తొందరగా" అంది

లక్ష్మి వోసారి అలివేణి ముఖంలోకి చూసి "సరేనమ్మా" అంటూ గబగబా క్రిందకు వెళ్ళింది

రాజారావు తలవంచుకు నడుస్తున్నాడు అప్ప టికే అతను అలివేణి ఇల్లు దాటాడు

# ఆదర్శాలు-అంతర్యాలు

(18వ పేజీ తరువాయి)

"అయ్యగారూ అయ్యగారూ" అంటూ లక్ష్మి వెనుకనుంచి కేకవేసింది

రాజారావు వెనక్కు తిరిగి చూసి తనను కాదేమో ననుకొని ముందుకు సాగాడు

లక్ష్మి రెండు అంగల్లో అతన్ని సమీపించి "మిమ్మల్నే అయ్యగారూ" అంది

"ఎందుకు ?"

"మిమ్మల్నొకసారి మా అమ్మగారు రమ్మం టున్నారు" అంది లక్ష్మి

"మీ అమ్మగారా నన్నా ? ఎవరామె ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు రాజారావు

పైన బాల్కనీలోంచి ఇదంతా చూస్తున్న

తండ్రి - (కొడుకుతో)
అబ్బాయీ! తరగతి పిల్లలలో ఫస్టుగా చదివి, మీ మేష్టారి మెప్పు సంపాదించుకోరా.

కొడుకు - ఇంకా ఎప్పటో ఏమిటి నాన్నా నిన్ననే మేష్టారు నన్ను మెచ్చుకున్నారు

తండ్రి - (సంతోషంగా) ఏమని మెచ్చుకొన్నారురా బాబూ

కొడుకు - బడిలో పిల్లలందరూ "నీలాగే పాఠములు చదివితే పాఠశాల త్వరలోనే మూసివేయచ్చు" అని మెచ్చుకొన్నారు నాన్నా!

బి లక్ష్మణకుమార్ (కాకినాడ)

అలివేణి "ఉత్త అమాయకుడిలా ఉన్నాడే" అను కుని నవ్వుకుంది

"చలమయ్య దొరవారి " అంటూ లక్ష్మి పైకి బాల్కనీవైపు చూసింది

రాజారావు దృష్టి ఆవైపు పడింది

చిరునవ్వులు చిందుతూ అలివేణి అప్సరసలా బాల్క నీలో నిలుచుని ఉంది

చలమయ్యదొరకు ఒక ఉంపుడుకత్తె ఉందని విన్నాడే కాని ఆమె ఈమేననీ, ఇంత అందగత్తె అని రాజారావుకు తెలియదు

"ఆమె ఎందుకు పిలుస్తున్నది తనను ? వెళ్ల డమా—మానడమా ?" అని తర్కించుకుంటు న్నాడు రాజారావు

"రండయ్యగారు" అంది లక్ష్మి

రాజారావు ఒకసారి మళ్ళీ బాల్కనీవైపు చూశాడు

అలివేణి నవ్వుతూ కళ్ళతోనే స్వాగతం చెప్పింది.

"తనతో ఈమెకేం పని ? ఇందులో కుతంత్ర మేమైనా ఉందా ? అయినా వెళ్ళి మాట్లాడితే వచ్చిన నష్టమేమిటి ?" అను కున్నాడు రాజారావు అలా అనుకుంటూనే అతను లక్ష్మి వెంటనే బయలుదేరాడు

బాల్కనీలోంచి చూస్తున్న అలివేణి "ఆయ నన్నట్టు అందగాడే" అనుకుంటూ లోపలకు వెళ్ళింది

అద్దంలో ఒకసారి చూసుకొని ముంగురులను సరిచేసుకుంది అలివేణి ఒకసారి తనను తాను చూసుకొని మురిసిపోతూ చరచర రాజారావుకు ఎదురుపోయి "రండి లోపలికి" అంది

ఆ పలుకుల్లో ఎంతో తియ్యదనం !

ఆ చూపుల్లో ఏవో వింత సోయగాలు !

ఆ చిరునవ్వుల్లో ఏవో మధురక్షణాలు !

ఆ నడకలో, ఆ నిలుచోవడంలో ఏన్నో వయ్యా రాలు !

ఆమె పులుముకున్న సుగంధ ద్రవ్యాలు గుబా ళించాయి

ఆమె అందచందాలకు ముగ్ధు డయ్యాడా అన్నట్టు రాజారావు అడుగులో అడుగు వేసు కొంటూ అలివేణి వెంట ఆమె గదిలోకి వెళ్ళాడు.

"ఇలా కూర్చోండి" అంటూ అలివేణి అతనికి సోఫా చూపింది

రాజారావు అచేతనంగా సోఫాలో కూర్చున్నాడు.

"ఒక్క నిముషం కూర్చోండి—ఇప్పుడే వస్తా" అంటూ లోపలకు వెళ్ళింది అలివేణి

ఒకసారి గదంతా కలయచూశాడు రాజారావు.

ఎంతో అందంగా, ఆకర్షణీయంగా అలంక రించబడి ఉంది గది గోడలకు అమర్చిన ఛాయా చిత్రాలు, తైలవర్ణ చిత్రాలు ఎంతో ముచ్చటగా ఉన్నాయి

"చలమయ్యగారికి ఇంత కళాతృష్ణ ఉందా" అను కున్నాడు రాజారావు

ఒక కుడ్యంపై భాగంలో అమర్చిన బోసి నవ్వులు చిందుతున్న బాపూజీ చిత్రం, దానికి ఇరు పార్శ్వాలలో శాంతిదూత జవహర్లాలు, భారతా ధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ చిత్రాలు, ఆ కుడ్యా నికి ఎదరుగా ఉన్న కుడ్య పైభాగంలో జైప్రకాష్, బోసు చిత్రాలు చూసి "ఇవన్నీ చలమయ్యగారి దేశభక్తికి తార్కాణాలు కాబోలు" అని రాజా రావు నవ్వుకున్నాడు

"ఏమిటి మీలో మీరే నవ్వుకుంటున్నారు" అంటూ అలివేణి వచ్చేప్పటికి ఆమెవైపు తిరిగాడు రాజారావు

చేతిలో వెండి పళ్ళెం పట్టుకొని వయ్యారంగా నిలుచుంది అలివేణి

చిన్న స్టూలు అతను కూర్చున్న సోఫా దగ్గ రకు లాగి, దానిమీద వెండి కంచెం పెడుతూ "ఫలహారం తీసుకోండి" అంది

"ఇప్పు డివన్నీ ఎందుకండీ ?" తడబడుతూ అన్నాడతను

"ఎన్ని ఉన్నాయి రెండు మైసూరు పాకులు, మూడు అరటిపళ్ళుగా .. తీసుకోండి"

అంటూ అలివేణి అతని కెదురుగా ఉన్న సోఫాలో కూర్చుంది

అతని కెంతో సిగ్గుగా ఉంది ఒక్క అరటి పండు మాత్రం తీసుకొని "ఇక చాలండి" అన్నాడు తల వంచుకునే

"ఉహూ అవి కూడా తీసుకోవాల్సిందే మీరు బిడియపడుతున్నారు" నవ్వుతూ అంది అలివేణి

తలెత్తి ఆమెవంక చూశాడు రాజారావు

అందాలు చిందుతున్న కళ్ళు, నునుపైన చెక్కిళ్ళు చిరునవ్వుతో గుంటలుపడి ఎంతో ఆకర్షణీయంగా ఉన్నాయి ముచ్చటగా గడ్డంక్రింద చిన్న పుట్టుమచ్చ కోరికలు రేకెత్తించే యౌవనపు జిగి

ఆమె ముఖంలోకి సూటిగా చూడలేక తల వంచుకున్నాడు రాజారావు

"ఆ ఒక్క మైసూరుపాకైనా తినండి" అంది అలివేణి

"క్షమించండి ఇక తినలేను" తల వంచుకునే అన్నాడు

"అయితే కాఫీ తెస్తా" నంటూ లేచింది అలివేణి

"అబ్బే ఇంకేం వద్దండి" అన్నాడు రాజారావు

చిరునవ్వుతో వెండిపళ్ళెం తీసుకొని లోపలకి వెళ్ళింది అలివేణి

"ఈమె ముందు ఉంటే మనస్సేం పని చెయ్యదేం ? ఈమె అందచందాలకు తను ముగ్ధుడైపోతున్నాడా ? ఏదో తెలియని ఉద్రేకం తనలో కలుగుతున్నది అది లలితను చూసినప్పుడు కలగలేదేం ? లలిత ఈమె అంత అందకత్తె కాకపోవచ్చు కాని లలితపైన కలిగే భావం ఈమె మీద కలగడం లేదేం" అని ప్రశ్నించుకున్నాడు రాజారావు

లలిత సహజ సౌందర్యాన్ని అవ్యాజంగా తను ప్రేమిస్తున్నాననీ, ఉన్న అందానికి అలంకరించుకున్న కృత్రిమపు మెరుగులు చూసి ఈమెను కామిస్తున్నానేమో ననీ అనుకున్నాడు "ఏ చెట్టు క్రిందనో ఉన్న రాతి విగ్రహాన్ని పూజిస్తున్నట్టు లలితను పూజిస్తున్నాడు తను ఆ రాతివిగ్రహాన్ని ఆలయంలో ప్రతిష్ఠించి దానికి అలంకారాలు చేస్తే కలిగే భావమూ అలివేణిని చూస్తే కలిగే భావమూ ఒకేవిధమైనవేమో చ చ ఏమిటి తను ఒక నీచమైన స్త్రీని దేవుడితో పోలుస్తున్నాడా ?" అని ప్రశ్నించుకున్నాడు రాజారావు

ఇంతలో అలివేణి వెండి కప్పులో కాఫీ తెచ్చి అతనిముందు పెట్టింది

"మీకు వీణ వాయించడం వచ్చు అనుకుంటా" అన్నాడు రాజారావు

"వాయించమంటారా ?" ఆమె కళ్ళు నవ్వుతున్నాయి

"అబ్బే వూరికేనే అడిగా—అమూల వీణ కనిపిస్తే " అన్నాడు రాజారావు

అతను ఇష్టంలేకపోయినా, సభ్యత్వం కోసం కాఫీ త్రాగుతున్నాడు అలివేణి మూలనున్న వీణను తెచ్చి అతనికి ఎదురుగా తివాచీమీద కూర్చుని తంత్రులను మీటుతూ పాట ప్రారంభించింది.

వీణ తీగెలమీద ఆమె అందమైన వ్రేళ్ళు నాట్యం చేస్తున్నాయి ఆమె పాటలోంచి కంఠంలోని మాధుర్యం ప్రవిస్తున్నది

ఆమె వీణ మీటుతూ పాటపాడుతూ, మధ్య మధ్య మత్తు కళ్ళను అతని ముఖంలోకి సారించేది అలా చూస్తూ చిరునవ్వులు చిందుతూ పాట విసిరితే రాజారావు తన్మయుడైపోయాడు ఆ తన్మయత్వంలో ఏదో దివ్యానుభూతి పొందాడు అంతలోనే అతనిలో అంతర్గతంగా ఉన్న నిగ్రహశక్తి మేలుకొన్నది క్షణంలో చెదరిన హృదయాన్ని పదిలపరచుకున్నాడు

"ఇంకోటివాయించమంటారా?" అంది అలివేణి

"ఇక చాలండి నేను తొందరగా వెళ్ళాలి" అన్నాడు

"అప్పుడే ?"

"అవును—వెళ్ళాలి ఇంతకూ మీరు పిలిపించిన కారణం చెప్పనేలేదు" అన్నాడు

"మీదగ్గర చదువుకోవాలని బుద్ధిపుట్టింది"

"నాదగ్గరా ?" ఆశ్చర్యంగా అన్నాడు రాజారావు

"మీరు కొన్నాళ్ళు నరసింహప్పగారి అమ్మాయిలకు చదువు చెప్పారుటగా నాకు చదువుకోవాలని ఉందని మా దొరవారితో అంటే వారు మీదగ్గర చదువుకోమన్నారు మీరు బాగా చెప్తారుటు రేపు మీకు కబురు పంపుదా మనుకున్నా అదృష్టవశాత్తు మీరే మా ఇంటి ముందుగా వెడుతూ కనిపించారు" అంది అలివేణి

"చలమయ్యగారే ఆమెను తనదగ్గర చదువు చెప్పించుకోమన్నాడా ? చాలా చిత్రంగా ఉందే" అనుకున్నాడు రాజారావు

"ఏమిటి ఆలోచిస్తున్నారు మీరు ఎంత కావాలంటే అంత ఫీజు ఇస్తాను" అతని కళ్ళల్లోకి చూస్తూ అంది

"డబ్బుకోసం ప్రైవేట్లు చెప్పేవాడిని కాదని బహుశః మీకు తెలియ దనుకుంటా" అన్నాడు రాజారావు

"క్షమించాలి నేను ఆ ఉద్దేశంతో అనలేదు ఏదో నా శక్తికొలది ఇద్దామనుకున్నా"

"సరే ఇంక నే వెడతానండి" అంటూ రాజారావు లేచాడు

"మరి ఎప్పటినుంచి వస్తారు ?"

"ఆలోచించి కబురుచేస్తాలెండి"

"అంటే నాకు చదువు చెప్పడం ఇష్టంలేదన్న మాట" కొంటెగా చూస్తూ అంది అలివేణి

"నాకు చాలా పనులున్నాయి తీరిక ఉంటుందో ఉండదో ?"

"పోనీ మీ రిక్కడకు రావడానికి తీరుబడి లేకపోతే నేనే మీ ఇంటికి వస్తా" అంది గోముగా

"ఏ సంగతీ మీకు కబురుచేస్తాగా" అంటూ రాజారావు చరచర బైటకు వచ్చాడు

"ఫర్వాలేదు కొంతవరకు దారిలోకి వచ్చినట్టే ఆ కళ్ళు ఆ మీసకట్టు, ఉంగరాల జుట్టు నిజంగా ఎంత అందంగా ఉన్నాడు చలమయ్య ఇతనిముందు బలాదూరు" అనుకుంది అలివేణి, అతను కూర్చున్నచోటనే సోఫాలో కూర్చుంటూ

(సశేషం)

# సమస్య

(17-వ పేజీ తరువాయి)

పోవటం ఏంబావుంటుంది చెప్పు? మీ ఇద్దరికి పెండ్లి చేయించే భారం నాది మీ నాన్నగారితో స్వయంగా నేవచ్చి మాట్లాడుతాను నా మాట ఆయన కాదనరని నా ఉద్దేశ్యం ఏమంటావ్?"

"మా నాన్నగారితో మాట్లాడినా ప్రయోజనం ఉండదని నా అనుమానం నిర్ణయాలన్నీ జరిగిపోయి, నిశ్చయమైన వ్యవహారాన్ని తిరిగి మొదటికి తెస్తారని నేనూహించలేను"

"గట్టి చిక్కే వచ్చింది రామం! అమ్మాయి నిన్ను తప్ప ఇంకొణ్ణి చేసుకోనంటున్నది నీవేమో నీ పెండ్లి నిశ్చయమైనదంటున్నావు నాకు మంచి సమస్యే దొరికిందే!" మౌనంగా వూరుకున్నాడు రామం

"సరే నాయనా మీ నాన్నగారితో మాట్లాడుతే లాభం ఉండవచ్చు మీ పరీక్షలవగానే మీ వూరువచ్చి అన్ని వ్యవహారాలు చక్కబెట్టుకోవాలి ఎవరెవరికి, ఎవరెవరు రాసిపెట్టారో అప్రకారమే జరుగుతుంది ఇక నే వెళ్లొస్తా రామం"

"మంచిదండీ, నేనిలా అన్నానని ఏమీ అనుకోకండి" సీతారామయ్యగారు వెళ్ళినతర్వాత ఆలోచనలోపడ్డాడు రామం

రామం తిరుపతిలో ఎం ఎస్సీ ఫైనల్ ఇయరు చదువుతున్నాడు సీతారామయ్యగారి ఇంటి మిద్దెపైనున్న రూములో వుంటున్నాడు క్రితం ఏడాది హాస్టల్‌లో వుండి చదువుకున్నాడు కానీ అక్కడి వాతావరణము, అల్లర్లు, గలాటాలు సరిపోలేదు రామానికి అందుకని ఈ సంవత్సరం హాస్టల్ వదిలేసి రూములో వుంటున్నాడు

రామం రూములో చేరిన మొదట్లో అతను ఫలానా అని తెలియకపోయినా క్రమేపీ సీతారామయ్యగారు అన్ని విషయాలు రామంద్వారా కనుక్కున్నారు ఇంతకూ రామం ఎవరోకాదు సీతారామయ్యగారి చిరకాల మిత్రుడు, దూరపు బంధువు అయిన లక్ష్మీనారాయణగారి ప్రథమ పుత్రుడే

సుశీల బి యస్సీ ఫైనల్ చదువుతున్నది అంతేకాక, సుశీల సబ్జక్టు, రామం సబ్జక్టు ఒకటే రామం మంచితనం, వినయ విధేయతలు చూచి సీతారామయ్యగారు మురిసిపోయారు అప్పుడే ఆయనకు రామాన్ని తన అల్లుడుగా చేసికోవాలన్న ఊహ జనించింది ఈ ఊహే సుశీలను రామం వద్దకు అర్థంకాని పాఠాలను చెప్పించుకునేందుకు పంపింది రామం, సుశీల ప్రేమకు కారణభూతమైంది ఇదే సీతారామయ్యగారికి కూడా కావలసింది ఇందులో పూర్తిగా కృతకృత్యులైనారు ఆయన ఇక ఆయనకు మిగిలింది, వారిద్దరి పెండ్లి జరిపించటం

ఇంతకూ రామం చిక్కులోపడ్డాడు సుశీలపై రామానికి మనసు పడింది ఎన్నిసార్లు అతని హృదయాన్ని ప్రశ్నించుకున్నా, 'సుశీలను ప్రేమించింది' అన్న సమాధానమే వస్తున్నది పైగా ఆమెను వివాహమాడాలన్న కోర్కెను బయట పెడుతున్నది కానీ అతనుమాత్రం ఏంచేయగలడు? అరుణను చేసుకుంటానని తండ్రికి మాట ఇచ్చాడు క్రితం సంవత్సరం ఈ నిర్ణయం చేసికునేటప్పటికి అతను ఎవ్వరినీ ప్రేమించివుండలేదు అందుకనే అప్పుడు అతనికి ప్రేమంటే ఏమిటో ప్రేమపాశాలెలావుంటాయో బొత్తిగా తెలీదు కనుకనే అరుణసంబంధానికి సులభంగా వప్పుకున్నాడు రామం అడ్డుచెప్పకుండా వుప్పుట్లయితే, అతనికి అరుణతో వివాహం అప్పుడే అయిపోయివుండేది ఇప్పుడతనికి అరుణను పెండ్లాడాలనిలేదు మరి ఇప్పుడతని హృదయం సుశీలపరమైందిగా? అందుకని సుశీలనే వివాహమాడాలన్న కోర్కె బలమైంది సుశీలను వివాహమాడితే అరుణకు అన్యాయం చేస్తున్నానేమోనన్న అతని అనుమానానికి అంత ప్రాధాన్యత లభించలేదు

*　　　*　　　*

పరీక్షలైపోగానే, అందరివద్దా శలవు తీసికొని వాళ్ళవూరు వచ్చేడు రామం రామం రాకతో ఇంట్లో, అంతా సంతోషించారు

"ఏరా పరీక్షలన్నీ బాగా వ్రాశావుకదా? క్లాసు వస్తుందికదా?" అని ప్రశ్నించాడు తండ్రి

"అంతగా చిక్కిపోయావేమిరా అబ్బాయీ? ఆరోగ్యం బాగా చూచుకున్నావా? లేదా? ముందు స్నానం చేసిరా భోజనంచేసి అన్నివిషయాలు తీరికగా మాట్లాడుకోవచ్చు" అని తల్లి తొందర పెట్టింది

భోజనాలు చేస్తున్నప్పుడు చెప్పాడు రామం

"నాన్నగారూ! మీ స్నేహితులు సీతారామయ్యగారు వచ్చేవారం భార్యను, కూతుర్నీ తీసికొని ఇక్కడకొస్తారట ఈ విషయం మీకు చెప్పమన్నారు"

"అలాగటా! వాడినిచూచి ఐదేండ్లకుపైగా అయింది బాగున్నాడా? ఏమిటి విశేషం?" అంటూ లక్ష్మీనారాయణగారు ఉప్పొంగిపోయారు, పాత స్నేహితుణ్ణి కలుసుకోబోతున్నానన్న సంతోషంతో

"ఏరా కృష్ణా, పరీక్షలన్నీ అయిపోయినాయా? బాగా వ్రాశావుకదా?" అని రామం తమ్ముణ్ణి ప్రశ్నించాడు

"బాగానే వ్రాశానన్నయ్యా! అయితే ఫస్టుక్లాసు వస్తుందో రాదోనన్న అనుమానం వుంది" అన్నకు సమాధానమిచ్చాడు తమ్ముడు కృష్ణ

కృష్ణ ఆ వూరిలోనే బి య్యే చదువుతున్నాడు. రామం, కృష్ణా ఇద్దరే లక్ష్మీనారాయణగారికి సంతానం ఇద్దరూ చాలా సన్నిహితంగా, చనువుగా వుంటారు

రామం వచ్చి నాల్గురోజులైంది అబ్బాయి వచ్చాడుకదా, ఆ పెండ్లేదో జరిపించేస్తామని అనుకున్నారు లక్ష్మీనారాయణగారు కొడుకుని పిల్చి ఒకటి రెండుసార్లు ఆ ప్రస్తావన తెచ్చేరు వచ్చే మాసారంభంలో పెండ్లిజరిపే ఉద్దేశ్యంలో వున్నట్లు వెల్లడించారు రామం బదులాడలేక పోయాడు సుశీలసంగతి చెప్పి, ఆమెను వివాహమాడుతానన్న కోర్కెను తండ్రితో చెప్పలేక పోయాడు అరుణను వివాహమాడలేనని చెప్పడానికి సాహసించలేకపోయాడు చూస్తూ చూస్తూ సుశీల

కు ద్రోహంచేయడానికి మనస్కరించలేదు అరుణకు అన్యాయం చేస్తున్నానేమోనని బాధ పడసాగాడు

ఆదినమే సీతారామయ్యగారు, సుశీలతోనూ, భార్యతోనూ దిగారు లక్ష్మీనారాయణగారికి పరమానందమైంది చిరకాలమిత్రుణ్ణి గుచ్చి కౌగలించుకొని ఉక్కిరిబిక్కిరిచేసివేశారు ఆ దినం పంచభక్ష్య పరమాన్నాలు చేయించారు మిత్రుడితో చాలాసేపు సంభాషించారు మిత్రుడిరాక లక్ష్మీనారాయణకు మహదానందం కలిగించింది

కృష్ణ, రామంలు ఆ దినం సాయంకాలం చెరువు కట్టపై షికారుకెళ్తున్నారు చెరువులో నీరు కొద్దిగావుంది ఇద్దరూ కట్టపై మౌనంగా నడక సాగిస్తున్నారు రామం హృదయంలో శాంతి లేకుండా పోతున్నది సుశీలనే ఎల్లాగైనా వివాహమాడాలని నిర్ణయించుకున్నాడు ఇన్నాళ్ళు అరుణను చేసికుంటానన్న తను, ఇప్పుడు వున్నట్టుండి అరుణను చేసికోనని నాన్నగారితో చెప్పడానికి ధైర్యం చాలలేదు ఎల్లాగైనా అరుణను చేసికోకుండా తప్పించుకోవాలి తనకు తానై ఏ నిర్ణయం చేసికోలేకపోయాడు కృష్ణతో చెప్తే ఏదైనా పరిష్కారం సూచిస్తాడేమో! వాడు తప్పకుండా సరైన మార్గం సూచించగలడు కృష్ణవైపు చూచి "కృష్ణ" అని పిల్చాడు రామం

బదులు రాలేదు కృష్ణ మౌనంగా నడుస్తున్నాడు ఏదో విషయాన్నిగూర్చి దీర్ఘాలోచనలో వున్నట్లున్నాడు తిరిగి పలకరించడానికి రామం సాహసించలేకపోయాడు.

"ఇక్కడ కూర్చొని కాసేపు, చీకటి పడగానే వెళ్దాం! రారా!" అన్నాడు రామం నిశితంగా ఆలోచిస్తున్న కృష్ణవైపు చూస్తూ

ఇద్దరూ కట్టపై కూర్చున్నారు

చీకటిపడగానే ఇంటివేపు బయలుదేరారు

రామం, కృష్ణ వరండాలోకి వచ్చేసరికి హాల్లోనుంచి మాటలు వినవస్తున్నాయి "ఇప్పుడు పన్నేంచేయమంటావురా సీతా? అబ్బాయికి ఈ పెండ్లి నిశ్చయమైపోయింది దాన్ని తప్పించి, రామానికి సుశీలను చేసికోటం ఏంబావుంటుంది చెప్పు? పైగా ఈ పెండ్లి తప్పిస్తే ఆ వాసుదేవయ్య ఎంత కుమిలిపోతాడు అరుణ ఎంత బాధపడుతుంది అసలు నా మర్యాదసంగతి ఆలోచించావా?"

"ఏం చెప్పేదిరా నారాయణా? సుశీల రామాన్ని ప్రేమించింది రామాన్నితప్పించి ఇంకోర్ని చేసికొనంటున్నది రామంగూడా సుశీలను మనస్ఫూర్తిగా ప్రేమించాడు ఒక్క విషయంరా! అరుణను చేసికోడం రామానికి ఇష్టమో లేదో మరొక్కమారు అబ్బాయితో మాట్లాడి తేల్చుకోకూడదూ?"

"ఏమిటీ? రామం సుశీలను ప్రేమించాడా? అరుణను తప్పకుండా చేసికుంటానని మాట ఇచ్చి ఇంతపని చేశాడా వాడు!"

"అవునురా సుశీలను రామం ప్రేమించాడనేది ఖాయం కానీ ఆవిషయాన్ని అతను బయటకు రానివ్వలేదు ఒక్క కోరికరా నారాయణా! చిరకాల మిత్రుణ్ణి, అర్థిస్తున్నా, రామాన్ని సుశీలకు చేసికోమని నా కోర్కె మన్నించవూ?" దీనంగా ప్రార్థేయ పూర్వకంగా అడిగారు సీతారామయ్యగారు

కాసేపు లక్ష్మీనారాయణగారు మాట్లాడలేకపోయారు

"నేనేమి చెప్పేదిరా? నీతో వియ్యమందడం కన్నా నాకు కావలసినదేముంది? కానీ, నిర్ణయించిన పిల్లను తప్పించి నీ కూతుర్నకు చేసుకుంటే ఆ వాసుదేవయ్యగారికి, అరుణకూ అన్యాయం చేసినవాడినవుతాను చిరకాలమిత్రుడి కోర్కెను ఈ సందర్భంలో ఎలా మన్నించాలో బోధపడకుండా వుంది"

"ఒకపనిచేయరా నారాయణా! మీ పెద్దవాడికిచ్చి చేసేబదులు, అరుణను కృష్ణకిచ్చిచేస్తే సరిపోతుందిగదరా ? నీ వేలాగూ ఆ వాసుదేవయ్యతో వియ్యమందుతావుగదా? ఈవిధంగాచేస్తే నీ వెవ్వరికీ అన్యాయం చేయవు ఇంతకూ వాసుదేవయ్యను ఒప్పించటం నీ చేతిలో వుంది"

---

కొత్తగావచ్చిన ఒక ఆసామితో రెండవవాడు ఏమయ్యా మీావూరినించేనా రావడం.

వచ్చినఆసామీా: ఆ! మాావూరినించే

1 వ ఆసామీా: మరి ఇంత ఆలస్యంగా వచ్చావేం?

2 వ ఆసామీా: ఫస్టు బస్సుకే వచ్చాను

1 వ ఆసామీా: ఫస్టు బస్సు ఇక్కడికి 8 గం॥లకే వస్తుందే!

2 వ ఆసామీా: మనం లేచే టైముకి ఫస్టు బస్సయ్యా!

నండూరి సుబ్రహ్మణ్యం (పెద్దాపురం)

---

సంశయంలో పడ్డారు లక్ష్మీనారాయణగారు

బయటినుంచి అంతా వింటున్నారు రామం, కృష్ణ

రామానికి, సీతారామయ్యగారు సూచించిన మార్గం నగభారాన్ని తగ్గించి, సంతోషాన్ని కలుగజేసింది

ఇక ఉపేక్షింపక తండ్రితో తను గూడా ఈ విషయంలో కలుగజేసికోడం మంచిదనుకున్నాడు రామం, కృష్ణ ఇద్దరూ హాల్లోకి ప్రవేశించారు

"అరుగో! అబ్బాయిలు ఇద్దరూ వచ్చారు" అన్నారు సీతారామయ్యగారు

రామం మెల్లగా నాన్నగారిని సమీపించాడు తండ్రితో మాట్లాడాలని నోరు తెరిచేటంతలో కృష్ణ మాటలు వినవచ్చాయి

"నాన్నగారూ! నన్ను క్షమిస్తానంటే ఒక సంగతి చెప్పాలనుకున్నా" అన్నాడు కృష్ణ, ఆశ్చర్యంవేసింది లక్ష్మీనారాయణగారికి

"ఏమిట్రా అది? చెప్పు మధ్యలో నీవేదో గొడవ తెచ్చినట్లున్నావే ఊ! కానీయ్!" అంతలోనే, "లక్ష్మీనారాయణగారూ!" అంటూ హడావిడిగా లోపలకొచ్చిన వాసుదేవయ్యగారిని చూచి "రండి వాసుదేవయ్యగారూ! ఏమిటి విశేషం? చాలా అదుర్దాగా వచ్చారే ఇల్లా కూర్చోండి" అన్నారు లక్ష్మీనారాయణ

"కొంచెం మీతో అర్జంటుగా మాట్లాడాలి. దయచేసి ఓసారి బయటకు వస్తారా?" అన్నారు వాసుదేవయ్య, కూర్చున్న కుర్చీలోంచి లేస్తూ

"ఫర్వాలేదు వాసుదేవయ్యగారూ! ఇక్కడ క్రొత్తవాళ్ళెవరూ లేరు" అంటూ సీతారామయ్యగార్ని పరిచయంచేసి ఇలా అన్నారు లక్ష్మీనారాయణగారు, "ఏం చెప్పదలచుకొన్నారో అంతా చెప్పేయండి"

చెప్పడానికి కాస్త సంకోచించారు వాసుదేవయ్య

"ఫర్వాలేదు చెప్పమంటున్నాగా నేను ఇక సంశయం ఎందుకండీ? ఇక్కడున్న వారంతా మన వాళ్ళే ఊ! కానీయండి" తొందర చేశారు లక్ష్మీనారాయణ

"అరుణను రామానికిబదులు మీ కృష్ణకు చేసుకోరాదుటండీ?" అంటూ సూటిగా ప్రశ్నించాడు వాసుదేవయ్యగారు

లక్ష్మీనారాయణగారు తెల్లబోయి తెప్పరిల్లారు. సీతారామయ్యగారు ఆశ్చర్యపోయారు రామానికి ఇదేంఅర్థంకాలేదు

"ఏం సంగతండీ? అరుణ కృష్ణను ప్రేమించిందా ఏమిటి?"

"సరిగ్గా ఊహించారండీ! మా అరుణ, మీ కృష్ణ ఒకర్నొకరు ప్రేమించుకున్నారట తనకు కృష్ణనిచ్చి చేయమని లేకుంటే పెండ్లేవద్దని భీష్మించుకు కూర్చుంది మా అరుణ మీరేమంటారు?"

అంతలో కృష్ణ అందుకున్నాడు

"నాన్నగారూ! మీతో ఇందాక చెప్తానన్న విషయం చెప్తున్నాను అరుణ, నా క్లాసుమేటని మీకు, రామానికి కూడా తెలుసు ఆమె, నేను కాలేజీలో చేరిన మొదటిసంవత్సరంనుంచి ప్రేమించుకున్నాము ఈ సంగతి ఎవ్వరికీ తెలియదు కాని పోయినసంవత్సరం అన్న రామానికి అరుణను చూసి పెండ్లి నిశ్చయించేసరికి నామతిపోయింది. వద్దు అని చెప్దామనుకున్నాను, కానీ చెప్పలేకపోయాను బహుశః పెండ్లిజరిగే పరిస్థితేవుంటే చెప్పివుండేవాడినేమో! పాపం! అరుణగూడా ఈ పరిస్థితిని వారించలేకపోయింది ఆ తర్వాత గూడా మా ప్రేమ మామూలుగా సాగిపోయింది అరుణకు అన్నతో పెండ్లి నిశ్చయమైందని తెలిసి నా మనస్సు మార్చుకుందామని యత్నించాను కాని లాభం లేకపోయింది అరుణపరిస్థితిగూడా అంతే అయింది మే మిద్దరము గాఢంగా ప్రేమించుకున్నాము పెండ్లాడాలని నిశ్చయించుకున్నాము నేను ఇన్నాళ్ళు ఈ విషయం మీతో చెప్పకుండా దాచాను మీతో చెప్ప సాహసించలేకపోయాను ఇప్పుడు ఆ సమయం వచ్చింది ఇందులో మా తప్పులుంటే క్షమించండి నాన్నగారూ నేను అరుణనే వివాహమాడుతాను రామం అన్నయ్యకు సుశీలనుఇచ్చి కళ్యాణం జరిపించండి" 



హెర్క్యులెస్ అన్‌చైన్డ్‌లో యులిసెస్ (గాబ్రియెల ఆంటోని) హెర్క్యులెస్ (స్టీవ్‌రీవ్స్) అయోలె (సిల్వాకోస్కినా)

చిత్ర సమీక్ష :

# హెర్క్యులెస్ అన్‌చైన్డ్

గ్రీక్ పౌరాణిక వీరుడు హెర్క్యులెస్ సాహస కృత్యాలు ఆధారంగా నిర్మాత బ్రూనోవైలాటి నిర్మించిన హెర్క్యులెస్ అన్‌చైన్డ్ అన్న వర్ణ చిత్రాన్ని ఇటీవల మద్రాసు సఫైర్ థియేటరులో పత్రికా విలేఖర్లకు చూపించారు.

స్థూలంగా ఈ చిత్రకథ యిది. హెర్క్యులెస్ (స్టీవ్ రీవ్స్) ఇథేకానుండి తన భార్య అయోలె (సిల్వా కోస్కినా) మిత్రుడు యులిసెస్ (గాబ్రియెల ఆంటోని) లతో తన స్వగ్రామం థేబ్స్‌కు బయలుదేరతాడు. యులిసెస్ తండ్రి ఇథేకారాజు లెయర్టెస్ (ఆండ్రియాపా టుసియా) ఏదైనా ప్రమాదం సంభవించే పక్షంలో తనకు తెలియ పర్చేందుకని కొన్ని పావురాలను హెర్క్యులెస్‌కు దానికి యిస్తాడు.

హెర్క్యులెస్ ప్రభృతులు థేబ్స్‌కు వెళ్తూ ఉండగా దారిలో ఆంటియస్ అనే రాక్షసుడు ఎదురై హెర్క్యులెస్ బండి గుర్రాలను అయోలెను స్వాధీనపర్చుకోవాలని ప్రయత్నిస్తాడు. హెర్క్యులెస్ ఆ రాక్షసుణ్ణి సముద్రంలో పడవేసి పీడ వదిలించుకుంటాడు.

ఈ ముగ్గురూ అలా వెళ్తూ నరకానికి ద్వారం ఉన్నాయని చెప్పబడే ఒక గుహను చేరుకుంటారు. అక్కడ వారికి థేబ్స్ రాజు వృద్ధుడు అయిన ఈడిపస్ (సిజర్ ఫాంటోని) కన్పిస్తాడు. ఆ వృద్ధుని కుమారులు ఇటియోక్లిస్ (సెర్జియో ఫాంటోని) పాలినీసెస్ థేబ్స్ రాజ్యాన్ని చెరి సగం పంచుకునేందుకు అంగీకరిస్తారు. కాని ఇటియోక్లిస్ ఆతరువాత తనమాట తప్పుతాడు. హెర్క్యులెస్ పాలినీసెస్‌కు రాజ్యం ఇచ్చేటట్లు ప్రయత్నిస్తానని వృద్ధునకు వాగ్దానం చేస్తాడు. అన్న దమ్ముల కలహాలవల్ల గుండె చెదరిన ఈడిపస్ నరకానికి పోతాడు.

హెర్క్యులెస్ బృందం థేబ్స్ చేరుతారు. హెర్క్యులెస్ ఇటియోక్లిస్‌తో రాయబారం చెప్పి తనమాట వినకపోతే పాలినీసెస్ ఆర్గివ్‌ల సహాయంతో థేబ్స్ మీదికి దండెత్తి రావచ్చుని హెచ్చరిస్తాడు. ఇటియోక్లిస్ పాలినీసెస్‌కు రాజ్యం ఇవ్వటానికి అంగీకరించినట్లు నటిస్తాడు. ఆ వార్త పాలినీసెస్‌తో చెప్పేందుకు యులిసెస్ హెర్క్యులెస్‌లు బయలుదేరతారు.

దారిలో వారు లిడా రాజ్యం చేరుకుంటారు. అక్కడ మతిమరుపు కలిగించే జలం త్రాగి హెర్క్యులెస్ తన జ్ఞాపకశక్తిని పోగొట్టుకుంటాడు. ఆ ప్రదేశానికి రాణి ఓంఫేల్ (సిల్వియా లోపెజ్) సైనికులు హెర్క్యులెస్‌ను యులిసెస్‌ను తమ రాణి సన్నిధికి తీసుకుపోతారు. ఆ రాణి హెర్క్యులెస్ అందాన్ని చూచి కామిస్తుంది. యులిసెస్ మూగవాడుగా నటిస్తూ హెర్క్యులెస్‌కు జ్ఞాపకశక్తి కలిగించాలని వ్యర్థ ప్రయత్నాలు చేస్తుంటాడు. హెర్క్యులెస్ బంధితుడైన వార్త తన తండ్రి లెయర్టెస్‌కు పావురం ద్వారా పంపుతాడు. ఆ వార్త తెలిసి లెయర్టెస్ తన అనుచరులతో అక్కడికి వస్తాడు.

హెర్క్యులెస్ తనవద్దకు ఏ సందేశం తీసుకు రాకపోవటం గమనించి తొందరపాటుతో పాలినీసెస్ ఆర్గివ్ సైన్యంతో థేబ్స్ కోటను ముట్టడిస్తాడు. ఇటియోక్లిస్ కోటను రక్షించుకొనేందుకు ప్రయత్నిస్తూ అయోలెను బంధిస్తాడు.

ఈలోపల యులిసెస్ ఓంఫేల్ ప్రియులకు నిర్మించిన ప్రతిమల రూపం ఇస్తుంటోందని గ్రహించి హెర్క్యులెస్‌ను స్మృతిలోకి తెచ్చేందుకు ప్రయత్నిస్తాడు. ఈ సమయానికి లెయర్టెస్ తన అనుచరులతో వస్తాడు. రాణి ఓంఫేల్ వారికి అతిథి మర్యాదలు చేయిస్తుంది. క్రమంగా హెర్క్యులెస్ విస్మృతి జలప్రభావం తగ్గిపోవటంవల్ల స్మృతి పొంది తనవారిని తెలుసుకుంటాడు.

హెర్క్యులెస్‌పైన తమకము తీరని రాణి ఓంఫేల్ హెర్క్యులెస్ మినహా మిగిలిన గ్రీక్ లందరినీ చంపివేయాలని ప్రయత్నిస్తుంది. హెర్క్యులెస్ ప్రభృతులు తప్పించుకుపోగా నిస్పృహతో తాను ఆత్మహత్య చేసుకుంటుంది.

థేబ్స్ నగరద్వారాన్ని పాలినీసెస్ తన సైనికులతో ముట్టడిస్తుంటాడు. హెర్క్యులెస్ తనకు అవకాశం ఇవ్వకపోతే అయోలెను పులులకు వేస్తానని బెదిరిస్తాడు ఇటియోక్లిస్. హెర్క్యులెస్ అతని మిత్రులు పిటిలోగుండా చాటుగా నగరంలో ప్రవేశిస్తారు. హెర్క్యులెస్ సింహాన్ని చంపివేస్తాడు. తరువాత జరిగిన యుద్ధంలో ఇటియోక్లిస్ మరణిస్తాడు.

వర్ణ ఛాయాగ్రహణం భారీ సెట్టింగులు కన్నుల పండువుగానే వున్నా నటన విషయంలో చెప్పుకోదగిన గొప్పతనం లేదు. నటీనటులు దరు యాంత్రికంగా నిచేసినట్లుందే గాని ఎక్కడా హృదయాన్ని కదిలించగల నటన చూపలేదు. మాయలమారి రాణి ఓంఫేల్‌గా సిల్వియా లోపెజ్ కొంత ప్రశంసనీయంగా నటించింది. రాణి ఆత్మహత్య చేసుకునే ఘట్టం ప్రేక్షకుల భావవైవిధ్యాన్ని లోనుచేస్తుంది. మిగిలిన నటీనటులు యథోచితంగా నటించారు.

ఆద్యంతం ఉత్కంఠ ఎక్కడా చెడని ఈ చిత్రానికి దర్శకుడు పియత్రో ఫ్రాన్సిసి ★

"నాగరాజ్"

# వార్తాభరణం

## భిక్షారి రాముడు

వాడేనే—చెలి వాడేనే

మోడిచేసి నను విడనాడేనే అన్న పాటకు రాజసులోచన నృత్య పూర్వకాభినయం చేయగా యిటీవల గోల్డెన్ స్టూడియోలో చిత్రీకరించారు. మధుర గాయని పి. సుశీల ఈ పాటను పాడారు. ఈ నృత్య సన్నివేశ చిత్రీకరణంలో కాంతారావు మీనాకుమారి రమణారెడ్డి సి ఎస్ ఆర్ జి వరలక్ష్మి బుష్పేంద్ర మణి ప్రభృతులు కూడా పాల్గొన్నారు. నాగభూషణ (ఏదినిజ) ప్రముఖపాత్ర ధరిస్తున్న ఈ చిత్రానికి దర్శకుడు కథా రచయిత పాలగుమ్మి పద్మరాజు ఛాయ బుల్ బుల్ అప్పారావు, సంగీత బి గోపాలం నృత్యం పసుమర్తి.

చిత్రం ఇప్పటికి ఏడు రీళ్లకు పైగా తయారైంది. పీరు త్వరలో హైదరాబాద్‌కు ఔట్ డోర్‌కు వెళ్లనున్నారు. అక్టోబరు నెలాఖరుకు విడుదలచేయాలని నిర్మాత శ్రీ బి ఆర్ నాయుడు ప్రయత్నిస్తున్నారు

## శుభోదయా చిత్రం పేరు మార్పు

శుభోదయా పిక్చర్సువారు తాము నిర్మిస్తున్న చిత్రానికి మనుకాలం అన్న పేరు మార్చి వారసత్వం అని పేరు పెట్టారు ఈ చిత్రానికి ప్రస్తుతం న్యూటోన్ స్టూడియోలో షూటింగ్ జరుగుతోంది

తాపీ చాణక్య దర్శకత్వంలో నిర్మింపబడుతున్న ఈ చిత్రంలో అంజలీదేవి రామారావు రేలంగి గిరిజ బాలసరస్వతి ప్రభృతులు నటిస్తున్నారు ఘంటసాల సంగీత దర్శకత్వంలో శ్రీమతి పి లీల పాడిన పాటకు గిరిజ అభినయాన్ని ఇటీవల చిత్రీకరించారు.

ఈ చిత్రానికి నిర్మాతలు : రంగా శాస్త్రి



రాజకమల్ కళామందిర్‌వారి ఘూల్ బార్ కలియాఁ లో ఒక సన్నివేశం

## వరలక్ష్మీ వ్రతం

కనకదుర పూజామహిమతో విశాలాంధ్రలో విజయపతాక నెత్తిన వర్ధమాన దర్శక నిర్మాత శ్రీ విఠలాచార్య నిర్మిస్తున్న వరలక్ష్మీవ్రతం చిత్రచ్ఛేదకుల (సెన్సారు) అడకత్తెరనుంచి బయటపడింది ఈనెల 25 న తేదీన విడుదల కానున్నది ఈచిత్రంలో కలిసి వచ్చిన జంట కాంతారావు కృష్ణకుమారి రాజనాల బాలకృష్ణ మీనాకుమారి ముక్కామల ఎ త్యనారాయణ మిక్కిలినేని శాంతి ప్రభృతులు నటిస్తున్నారు కథ : జి కె మూర్తి సంగీతం రాజన్ నాగేంద్ర.

ఇదేచిత్రంకు తమిళ కన్నడ భాషలలోకి తర్జుమా కూడా శరవేగంతో సాగిపోతోంది

## దేశద్రోహి

ఈ జానపద చిత్రాన్ని మాతృశ్రీ పిక్చర్సువారు తెలుగులో నిర్మిస్తున్నారు దీనిలో బి యస్ సరోజ శాంతాబాయి మీనాక్షి కుచలకుమారి శీలా, బాల విజయ ప్రేమనజీర్ తిక్కురిసి మొదలగువారు నటీ నటులు సంగీతం దక్షిణామూర్తి దర్శకుడు జి ఆర్ రావు స్టూడియో అరుణాచలం నిర్మాతలు కె వి క్రిష్ణ రెడ్డి విజయ కుమార్ యీ చిత్రాన్ని సెప్టెంబరులో విడుదల చేయడానికి అన్ని మెరుగులూ దిద్దుతున్నారు. ఈ తర్జుమా చిత్రంలో జనార్దన్ అనే నేపధ్య గాయకుడు పరిచయమవబోతున్నారు ★



సావిత్రీ కళామందిర్
సాంఘిక చిత్రంలో సావిత్రి



సావిత్రీ కళామందిర్
సాంఘిక చిత్రంలో రాజనాల



విక్రమ్ ప్రొడక్షన్స్
పెండ్లి తాంబూలాలు లో జమున

# హరివంశం

(15–వ పేజీ తరువాయి)

విష్ణువు 'వల్లె' యనినాడు

శోణితపురమునకు ఆ విష్ణువు ఒంటరియై పోలేదు బ్రహ్మను వెంటబెట్టుకొని పోయినాడు. సకల దేవతలను వెంటబెట్టుకు పోయినాడు నందిని వెంటబెట్టుకు పోయినాడు అందరును ఛద్మవేషములు అంగీకరించినారు నందియేమో గంగిరెద్దుగా మారెను విష్ణువుయేమో స్తోత్రపాఠకుడాయెను బ్రహ్మ తౌర్యత్రికములు పల్కెను ఇంద్రుడు చేగంట బ్రోయువాడాయెను ఇట్లు వారు శోణితపురమునం దంతటను క్రుమ్మరిల్లిరి ఆనాడు నంది భరతమున తన ప్రావీణ్యము నంతయును ప్రదర్శించెను బ్రహ్మ వేదములను వూదెను గంటానినాదముచేత ఇంద్రుడు దిక్కులు ముఖరితము లగునట్లు చేసెను మరి లక్ష్మీ జనార్దనుడు శివపరములైన మంత్రములనే స్తోత్రములుగా పల్కెను శోణితపురము వారాయాటను ఒడ్డు విరిగినట్లు చూచిరి రాజభటులును చూచిరి ఎన్నడు విచిత్రముగా నాయట వారికి విచిత్రమైనది అద్భుతమును అనిపించినది వారిని భటులచేత సింధురుడు ఆస్థానమునకు ఎలిపించినాడు ఆ పిల్పించుట వాని పతనమునకు, మరణమునకు దారితీసినది

సింధురుని సభలో నాడు వేదములు శివుని స్తుతించినవి విష్ణు మాయకు వశులై రాక్షసులు ఏది ఏమియో తెలియలేక పోయినారు బ్రహ్మయు, విష్ణువును, ఇంద్రుడును శివుని స్తోత్రములు చేయుచుండగా, నంది తాండవ మాడినాడు సింధురుని హృదయమున నున్న పరమశివుడు ప్రీతుడై వారిముందు ఆవిష్కృతుడైనాడు సింధురుని హృదయమును వదిలిపెట్టినాడు అప్పుడుగాని అతనికి వైష్ణవ మాయయన నేమో అర్థము కాలేదు కాని ఏమిచేయును! శివుడు అనినాడు: "సింధురా! నీవు వైష్ణవమైన మాయకు లోనై మోహితుడవై పోతివి నేను దయచేసిన వరమును రక్షించుకోలేక పోతివి నేను పోవుచున్నాను" సింధురుడు ఏమియు ననలేదు పరమశివుడు విష్ణువుతో, బ్రహ్మతో, ఇంద్రాది బృందారకులతో, నందితో కైలాసమును చేరుకొనినాడు

సింధురునకు ఇప్పుడు శివునిమీద, తక్కుంగల దేవతలమీద కోపము బలిసినది వానికి శివుని యందు కామమును, లోభమును అధికమైనవి. మహానంద! జీవితములో నరకము అన్నది ప్రవేశించుటకు మూడు మార్గము లున్నవి అవి ఇవి. కామమును, క్రోధమును, లోభమును అప్పుడు సింధురుడు కైలాసమున మీదకు పోవలయునా! కాశిక మీదకు పోవలయునా అని ఆలోచించినాడు. కాశిక కైలాసముకన్నను శివునకు ప్రియమైనది. కావున కాశికమీదకే పోయెదనుగాక అనుకొని సింధురుడు, ఆనందకాననముపై విరుచుకొని పడినాడు గంభీరమైన వాని కంఠగర్జిత ఘోషము మేఘముల ఘోషము అనుకొని, ఆకాశమున చాతకములు, భూమిమీద నెమళ్ళు ఉల్లసిల్లినవి వాడు కొమ్ములతో తొండములతో తోటలను, వనములను పొడుచేయుగా, అందలి వృక్షములను పెకలించి దశదిశా ముఖములలో విసరివేయుగా, దిక్కులలో [illegible]

**హుంకారముతో భూమిని ఉర్వ్రాటించగా, బ్రహ్మాండ భాండము కదిలిపోయినది విబుధ నిర్ఘరిణిలో నీరు వాని గండూషములకు ఆగలేకపోయినది వాని యొక్క చరణ ఘట్టనమునకు భూమి గదిలిపోయినది కపటకిటి జరఠ కమఠభుజగ పరివృఢులు గూని గిల్లబడినారు కఠోరఘూత్కార ఎవన వాతాభిఘాతములకు జీమూతవ్రాతములు చెదరిపోయినవి కర్ణతాళ దుందుభిధ్వానములకు ధరణీకుధరగుహాక్రోడములు ప్రతిధ్వనులను ఈనినవి గర్వమునకు నివాసదుర్గము, క్రోధమునకు విహారధారాగృహము, దర్పాంధకారమునకు కాళరాత్రి సమయమునై వాడు ఆనందకాననములో విలయవిహారము నచరించినాడు కాశీసీమ పంచక్రోశ ధరిత్రీ పరిధిలో నున్న వసీ సౌధవ్రాట్ప్రవీధులను వాడు చిందినాడో! చెండాడినాడో! మట్టినాడో? జరిమినాడో! విరిచినాడో! క్రొచ్చినాడో! విఘట్టించినాడో! దంచినాడో! త్రుంచినాడో! చక్కాడినాడో! మోదినాడో! తొడసినాడో! కెడపినాడో! కరిసురవ్రత్య నీకునిహేలా సంచారము కాశికలో ఉదగ్రభంగిగా కొనసాగినది ప్రమథులు గజిబిజి అయిపోయినారు భూతములు కళవళించి పోయినవి సింధురుడు మారులేక కాశిపై తన ఉద్ధతి నంతయు చూపించినాడు**

పరమశివునకు నవ్వు వచ్చినది ఆయన మూడు కన్నులడనును నవ్వినాడు "సింధురుడు క్రొవ్వినాడు వానికి చేటుకాలము వచ్చినది కానిచో విట్టులుగా చిన్నకు చేయిసాచి నన్ను చేరగా వచ్చెడివాడా!" అనుకొనినాడు ఆయన చేతిలో త్రిశూలము వచ్చి నిలచినది సర్వయాతుధానరథినీలయకాలము ఆ త్రిశూలము ఆ త్రిశూలముతో పరమశివుడు భక్తునిపైకి నడిచినాడు తీవ్రాంశుకోటి భాశ్ఛటాభాసురమ్మైన కుంభపదమున దానిని నాటి వాని కలుషములను రక్తధారలతో తొలగ నెట్టగా పరమశివుడు భక్తునిపైకి నడచినాడు

పరమశివుని రాకయే కదా సింధురుడు కోరుకొనుచున్నది! ఆయన రాగా వాడు నిర్మలాంతకరణుడైనాడు వానిలో కామము, క్రోధము, లోభము—అన్నియు శమించినవి వాడు పరమశివునితో ఇట్లు అనినాడు ఓ! విశ్వనాథ! పుట్టినవారికి మరణములు నియతములు మరి ఆ చనిపోవుటకు ముందు నిన్ను నాకువలె చూడకనినవాడు ఎవ్వడు! ఎవ్వడు నిన్ను, నాకు వలె, చరాచర విశ్వవిధాతృసృష్టికి పట్టపురాజును, అనత సుపర్వ కిరీట తటీవిటంక సంఘట్టిత పాద పీఠుని, కరుణావయోనిధిని, చూడగల్గినాడు? చూచి కృతార్థుడు కాగల్గినాడు అమరవంద్య! త్రిశూలాయుధమున పీరి ఒడలి తిత్తొల్చి తోలు పచ్చడము చేసి ఉత్తరాసంగముగ తాల్చి నీవు ఉండగా నేను పుట్టిన పుట్టువు ధన్యమే ఏవగును! అంధకవైరి! నాపైన నీకు దయ ఉన్నదా! ఉన్నదో, నీ స్కంధమునందు నా ఒడలి చర్మము దుర్గంధములేక, కర్కశముగాక, చినుగక, ేయక ఉంటుందిగాక! నాకు ఈ వరము దయచేయి తరువాత నన్ను సంహరించు నా హృదయములో నిన్ను నిల్పుకొనలేకపోయిన నా యీ బ్రతుకు ఎందుకు! కంఠేకాల! నన్ను సంహరించు సంహరించి కృత్తివాసుడవుకా!"

పరమశివుడు వానిని సంహరించి కృత్తివాసుడైనాడు గగనగంగా తీరములో ఇక్కడనే వాని ఆ సంహారము జరిగినది

**అంతలో రథము గంగ ఒడ్డున కృత్తివాస [illegible]** ★

## మనము—మన దేహస్థితి

(12-వ పేజీ తరువాయి)

కొన్ని యీ పని చేస్తే మరీ మంచిది శరీరం వేడికే కరిగిపోయే సపోజిటరీ, వేసవి వేడిని భరించలేదు అప్పుడు వీటిని కుండ నీళ్ళలోనో, వీలుంటే రిఫ్రిజి రేటరులోనో వుంచడం మంచిది శిశువులకు, పిల్ల లకు పెద్దవారికీ, పనికివచ్చే సైజుల్లో వీటిని మందుల కొట్లో అమ్ముతారు రోగి వయస్సునుబట్టి పైన చెప్పిన జాగరూకతలతో దీనిని ఉపయోగిం చడం ప్రతివారికీ చాలా అవసరం గ్లిసరిన్ ఎనిమా గానీ, గ్లిసరిన్ సపోజిటరీగానీ లేనిచోట్ల, చిన్న సబ్బు ముక్క సన్నగా మొన వచ్చేటట్లుచేసి, నీటిలో ముంచి మొనవైపు ముడ్డిలోకి తోసి వెయ్యవచ్చును కాని యిది కరగడానికి చాలాసేపు పడుతుంది కరిగే వరకు మూల స్థానాన్ని యిరిటేట్ చేస్తుంది కొన్ని సబ్బుల్లో క్షారగుణం (Alkalinity) ఎక్కువగా వుంటే ముడ్డిదగ్గర పుండు ఏర్పడుతుంది అత్యవ సరమై విధిలేనప్పుడుతప్ప, యీ పద్ధతి అవలం బించగూడదు

కొందరు జ్వరాల్లో విరేచనములకు — సాల్టు యిస్తారు జ్వరంతోనే శరీరంలో నీరు ఇగిరిపోతు న్నప్పుడు విరేచనముల ద్వారా మరీ పోయేటట్లు చేస్తే ప్రమాదాన్ని రెట్టింపు చేసుకోడమే కాని కొన్ని విషపదార్థములను శరీరంలోనుంచి వెళ్ళగొట్టడానికి విరేచన కారకలవణములు (Salinepe rgative) వినియోగించవలసివస్తుంది అది వైద్యులు, అవసర మైనప్పుడు వాడతారు సామాన్యులు, విరేచనాలకు మందులు తినడం అనేక సందర్భాల్లో అనేక ప్రమా దాలకు దారి తీస్తుంది — తీసింది టాన్సిలై టిస్‌లో, టాన్సిలుమీద చీము, ఉబుకుతుందని చెప్పేను 'ఆక్సిజన్'ను త్వరగా ఉత్పత్తిచేసే వస్తు వులు వేడినీళ్ళలోవేసి ఆ నీళ్ళతో పుక్కిలించితే యీ చీము తుంపరలు తొలిగి, ప్రాణవాయు వుతో దహనమైపోతవి పొటాసియం పెర్మాంగ నేటు, పొటాసియంక్లోరేటులు—యిటువంటి వస్తు వులు అపగింజంత పొటాస్సియం పర్మాంగనేటు కణ ముగానో పది గ్రెయినుల పొటాసియం క్లోరేటో సగ ఓడి అవున్సుల వేడినీళ్ళలోవేసి తరుచు పుక్కి లిస్తుంటే నోటిలో చీము తొలిగి, దుర్గంధం పోయి సుఖంగా వుంటుంది ఈపై వస్తువులు డాక్టరు సంతకం లేకుండా మందుల కొట్టువాళ్ళు యివ్వరు ఇవి దొరకనప్పుడు టేబుల్‌సాల్టు ఒక చెమిచా ఒక గాజు గ్లాసుడు వేడి నీళ్ళలోవేసి పుక్కిలించవచ్చును. కాయగూరలు, కుళ్ళిపోవడానికి కారణం కొన్ని క్రిములు ఉప్పు క్రిమి సంహారక వస్తువు దీనికి నీటిని గుంజుకునే శక్తికూడా వున్నది ఎన్నేళ్ళు ఉన్నా వూరగాయలు చెడిపోకుండా వుండడానికి కారణం ఉప్పుకున్న క్రిమి సంహారక శక్తియే అందువల్లనే అన్నిదేశాల్లోనూ రుచికే కాకుండా క్షేపక వస్తువులాగా కూడా (Preservative) ఉపయోగించబడు తున్నది గొంతు వాపులో ఉప్పుకున్న విలువ యింతా అంతా కాదు పుక్కిలింతలు బాధను ఉపశమించడానికి, సహాకరిస్తేనేగాని నివార ణకు ఉపయోగించవు టాన్సిలైటిస్ నివారణ వచ్చే వారం చర్చిస్తాను ★

---

## మనము—మన రాష్ట్రం

(14-వ పేజీ తరువాయి)

పునరుద్ధరించా లనడంలో అర్థంలేదు ఆమాటకు వస్తే శ్రీకాకుళం, విశాఖజిల్లాలు వెనుకబడినవే, గుంటూరు, కృష్ణా జిల్లాలలో కూడా డెల్టా ప్రాంతం మినహాయిస్తే, వెనుకబడిఉన్న మెట్ట తాలూకా లనేకం ఉన్నాయి వీ టన్నింటికి విడివిడిగా బోర్డులో పెట్టాలనడం సమంజసమేనా? ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, అన్ని ప్రాంతాల ప్రతినిధులతో సాగుతున్న ప్రజాప్రభుత్వం అన్ని ప్రాంతాల సమగ్రాభివృద్ధి ఆ ప్రభుత్వం కర్తవ్యం శాసనసభ్యులైనవారు ప్రాంతీయ దృక్పథంతో వ్యవహరించడం క్షంతవ్యంకాదు

*           *           *

తృతీయ ఆర్థికసంఘం అధ్యక్షుడు శ్రీ ఎ కె చాందా రెండు రోజులుగా హైదరాబాదులో చర్చలు జరిపి, చివరకు ఆంధ్రప్రభుత్వం తమ విజ్ఞాపనలో పేర్కొన్న కోర్కెలలో ఒక్కటిగూడా అంగీకరించ డానికి వీల్లేదన్నట్లు కుండ బద్దలు కొట్టారు

ఆంధ్రప్రభుత్వం కోర్కెలలో ప్రధానమైనవి ఆదాయపు పన్నులో రాష్ట్రాలకు జనాభాను బట్టి వాటా పంచాలని, (2) పంచదార, వస్త్రాలు, పొగాకు వీటిపై అదనపు ఎక్సయిజు సుంకాలను మామూలు ఎక్సయిజు సుంకాలతో కలిపి, పంపిణీ వాటాను మొత్తంలో 25% నుంచి 50% కు పెంచాలని (3) రైలు ఛార్జీలపై పన్నును, ఆయా రాష్ట్రాలలో రైలు ఛార్జీలద్వారా వచ్చే మొత్తాన్నిబట్టి దామా షీగా పంచాలని, (4) పొగాకు పన్నులో ప్రత్యేక వాటా ఇవ్వాలని, (5) పన్నులలో ఈ వాటాలు గాకుండా అదనపు గ్రాంటుగా ఏటా 6 కోట్లు కేంద్రం నుంచి ఇప్పించాలని

తమ ఈ కోర్కెలు ఎంత సబబైనవో రాష్ట్ర ప్రభుత్వం 207 పుటలు గల తమ విజ్ఞాపనలో సహేతుకంగా వివరించింది ఇప్పటి ఆదాయాన్ని, మూడవ ప్రణాళికలో కొత్తగా వేసే పన్నుల మొత్తాన్ని లెక్క చూసుకొన్నా వచ్చే ఐదేళ్లలో 60 కోట్లు లోటు తేలుతుందని నిరూపించింది మూడవ ప్రణాళికకు ద్రవ్యసేకరణలో 26½ కోట్లు, నాగార్జునసాగర్‌కు ఇచ్చిన అప్పుపై వడ్డీ 780 లక్షలు, జిల్లాపరిషత్తులకు సమితులకు, పంచాయితీ లకు యివ్వాల్సింది 6 కోట్లు, సిబ్బందికి పెంచిన జీతాల క్రింద 13 25 కోట్లు రోడ్లకు 6 కోట్లు, మొత్తం 59 కోట్లు 65 లక్షలు లోటు వస్తుం దని, ఇది తాము సేకరించుకోలేని మొత్తమని స్పష్టంగా చెప్పింది ఎంచవర్ష ప్రణాళికల మూలంగా రాష్ట్రప్రభుత్వం బాధ్యతలు, ఖర్చులు పెరిగాయని ఇక అక్కే పన్నులు విధించే అవకాశాలు కూడా మృగ్యమని వాదించింది

ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక సమస్య లేమిటో కూడా రాష్ట్రప్రభుత్వం తేటతెల్లంగా చెప్పింది రాష్ట్రంలో తెలంగాణా, రాయలసీమలు చాలా వెనకబడిన ప్రాంతాలని, ఒక్క కోస్తా జిల్లాలు తప్ప రాయల సీమ తెలంగాణాలలో వ్యవసాయం అభివృద్ధి కాక అడపాదడపా క్షామంతో బాధపడుతున్నవని వ్యవసాయం లోనే గాక పరిశ్రమల విషయంలో కూడా రాష్ట్రం వెనుకబడి ఉన్నదని మొరపెట్టుకొన్నది

ఇవన్నీ అర్థం పర్థంలేని కోర్కె లన్నట్లుగా శ్రీ చాందా ఒక్క ముక్కలో కొట్టేశారు పైగా తృతీయ ఆర్థిక సంఘంవల్ల ఆంధ్రకు పెద్దగా ఒరిగేదేమీ లేదని, ఏదైనా ఆశ పెట్టుకొనిఉంటే నిరాశ చేసుకోమని సలహాయిచ్చారు కేంద్రానికి రాబడిపన్ను ద్వారా వచ్చే మొత్తాన్ని పూర్తిగా రాష్ట్రాలకే యివ్వాలని, జనాభా పద్ధతిగా పంచి పెట్టాలని రెండవ ఆర్థిక విచారణ సంఘమే అంగీకరించింది అయితే వెంటనే పద్ధతిని తారు మారు చేసేందుకు ఇష్టంలేక నూటికి 90 వంతులు జనాభా పద్ధతిని, తతిమ్మా 10 వంతులు వసూళ్ల పద్ధతిన యివ్వాలన్నది ఇప్పుడు తతిమ్మా పది వంతులను కూడా చేర్చి జనాభా దామాషాన పంచడానికి, ఇంకా కొన్ని ఇతరములైన పన్నులను ఎంపిణీ మొత్తంలో చేర్చడానికి అభ్యంతర మేమిటో చెప్పకుండా అన్నిరాష్ట్రాలకు ఒకే సూత్రాన్ని అనుసరిస్తామన్నారు చాందా కేవలం వసూళ్లను బట్టి పన్నులో వాటా పంచితే, పారిశ్రామికంగా పెక్కై వచ్చిన రాష్ట్రాలదే పైచేయిఅయి వెనుకబడిన ఆంధ్ర వంటి రాష్ట్రాల గతి అధోగతే అవుతుంది ప్రత్యేక సమస్యలతో సతమత మవుతూ పెద్దలోటు ఎదుర్కొం టున్న రాష్ట్రాలకు ప్రత్యేక సహాయం చేయాలన్నది న్యాయమైన సూత్రమేనని, అందుకే పంజాబ్‌కు అద నంగా ఏటా 6కోట్లు ఇవ్వతగునని శ్రీచాందా ఇదివరలో చెప్పారు కాబట్టి ఆంధ్రకు కూడా ప్రత్యేక ఇబ్బందు లున్న సంగతి ఆయన గుర్తించడం మేలు

ఏదో ఒక నాగార్జునసాగర్, తుంగభద్ర లాంటి ప్రాజెక్టులనుగాని, కృష్ణా, గుంటూరులాంటి కోస్తా జిల్లాలనుగాని చూచి యావదాంధ్రదేశం వ్యవసాయ కంగా సంపన్నమైన దేశం అనుకోడంలో ఆయన చాలా పొరపడ్డారు తుంగభద్ర ప్రాజెక్టు పూర్తి అయినమాట నిజమే కాని ఎంత భూమి సాగులోకి వచ్చింది, నాగార్జునసాగర్ పూర్తి అయి ఫలితానికి రావడానికి ఎన్నేళ్ళు పడుతుంది అన్నది ఆయన ఆలోచించినట్లు లేదు లక్షలాది ఎకరాలు సాగులోకి (ఎప్పుడో) వస్తాయి గనుక (తెలంగాణా, రాయల సీమల సంగతి మరిచిపోయి) ఆంధ్రరాష్ట్రం వెనుక బడిన ప్రాంతం ఏమిటి అని ఆశ్చర్యపడ్డారు

వ్యవసాయికంగా అభివృద్ధి అయిన రాష్ట్రం గనుక ఇక పరిశ్రమ లెందుకు మీకు, వ్యవసా యంతో తృప్తిపడండి అన్నట్లు మాట్లాడారు రాష్ట్రంలో వినియోగించుకోగల ఖనిజసంపద బోలె డంత ఉంది అందుకు పరిశ్రమలు ముఖ్యంకాదా? పరిశ్రమలు అభివృద్ధి చెందితేనేగాని రాబడిపన్ను, అమ్మకం పన్ను వగైరాల ద్వారా రాష్ట్రానికి వచ్చే ఆదాయం బాగా పెరగదు పారిశ్రామికంగా పైకి వచ్చిన మద్రాసు, బొంబాయి, మైసూరు వంటి రాష్ట్రాలకు, ఇతర రాష్ట్రాలకు తేడా ఎంత ఉందో అందరూ ఎరిగినదే పారిశ్రామిక రాష్ట్రాలలో ప్రభుత్వానికి వచ్చే ఆదాయంలో చాలా భాగం పరిశ్రమల నుండి, కంపెనీల నుండి వస్తున్నదే పైగా నిరుద్యోగ సమస్య భారీ, పరిశ్రమం మధ్యరకం పరిశ్రమల ద్వారానే తీరుతుంది కాని కేవలం వ్యవసాయంతో తీరదు పోనీ వ్యవసాయ వరకు అను వినియోగించుకోగల పరిశ్రమలైనా పెంపొం దించుకోడమైనా అవసరం గదా మొత్తం మీద శ్రీ చాందా ధోరణి విపరీతంగానే ఉంది వారి ఈ అభిప్రాయాలు పూర్తిగా తృతీయ సంఘం ఆర్థిక నివేదికలోకి ఎక్కితే ఆంధ్రకు అపకారం తప్పదు. ★

# ధ్రువతార

(8-వ పేజీ తరువాయి)

ఎంగిలిపడు. సగం నీరసం తగ్గుతుంది" అన్నాడు

అతడు లేచి కప్పుకునివున్న దుప్పటి తీసి కుర్చీ మీద ఉంచి చొక్కా విప్పుతూ, "నువ్వు వంట చెయ్యటం ఏమిటిరా? ఇంట్లో నీ భార్య ఏమైంది? మనం మునుపు కలుసుకున్నప్పుడు ఆ కొత్తల్లోనే పెళ్లి అయిందన్నావుగా?" అని అడిగాడు

కాళిదాసు మొహం మరోవైపుకు తిప్పుకుని బాధగా, "అవును చెప్పాను ఇప్పుడామె లేదు నా జ్ఞాపకాలలో మాత్రమే మిగిలిపోయింది" అన్నాడు

ఆ వ్యక్తి నివ్వెరపోయి కొద్దిక్షణాలు శిలా ప్రతిమవలె కూర్చుండిపోయాడు కాళిదాసు మళ్లీ అతనివైపు చూసి, "నువ్వింక లేవరా బాబూ! పెందలాడి నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని మాట్లాడుకుంటూ కూర్చోవచ్చు" అన్నాడు.

తర్వాత యిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం చెయ్యటం ప్రారంభించారు అన్నీ వారి చిన్ననాటి ముచ్చట్లు ఆ వ్యక్తి ఫోర్తు ఫారం చదివేరోజుల్లో తెలుగుపండితుడి ముక్కుపొడుం డబ్బా కాజేసి ఆయనను నవ్వులపాలు చెయ్యటం మొదలుపెట్టి, అతను గ్రామఫోను, బాగుచెయ్యటందాకా గుర్తుకు తెచ్చుకుని మాట్లాడుకున్నారు ఆవ్యక్తి కొంతసేపాగి, "ఆ తెలుగు పండిట్ పేరు సోమయాజులు కదూ? అప్పటికే అరవైయేండ్లు వుండే వాయనకు ఇప్పటి కింకా బ్రతికివుంటా డంటావా?" అని అడిగాడు కాళిదాసు ఉదాసీనంగా నవ్వి "ఏమో! ఆయనకొక కొడుకుండేవాడు. పరమ దుర్మార్గుడు పేకాటలూ, జూదాలూ ఆడుతూ అడ్డమైనవాళ్ల సాంగత్యమూ చేసి తండ్రికి గుండెలమీద కుంపటిలా ఉండేవాడు ఆయన అల్లుడు, భార్యను వదిలేస్తే ఆమె ఎప్పుడూ పుట్టింట్లోనే ఉండేది నీకు గుర్తున్నదా? వారి వాకిట్లో ఒక రాచవుసిరిగచెట్టు ఉండేది మనందరమూ రాళ్లుపెట్టి కొట్టి కాయలు రాల్చుకుని, 'ఉప్పూ, కారమూ' నంచుకుని తింటూవుండేవాళ్లం ఆయన మనలను తిడుతూ వుండేవాడు" అన్నాడు

ఆ వ్యక్తి బాధగా, "ఇప్పు డాయనను తలుచుకుంటూవుంటే జాలిగా ఉంది చేసిన తప్పుకు క్షమాపణ చెప్పుకుందామన్నా ఆయన ఉన్నాడో లేడో?" అన్నాడు

"అవును మనం తెలిసో తెలియకో కొన్ని తప్పులు చేస్తాం కొంతమందికి వ్యథ కలిగిస్తాం అయినా మనం వాటిని మననం చేసుకుని క్షమాపణచెప్పేటంతటి సంస్కారం మనలో వచ్చేసరికి అవతలివా రీ ప్రపంచంలో ఉండరు ఇక ఆ బాకీ ఎన్నటికీ తీరదు" అన్నాడు కాళిదాసు

ఇద్దరి భోజనాలూ అయిన తరువాత కాళిదాసు ఆ స్థలం బాగుచేసి వంటయింటితలుపు వేసి ముందుగదిలోకి వచ్చాడు. ఆ వ్యక్తి ఉదాసీనంగా కుర్చీలో కూర్చుని ఉన్నాడు కాళిదాసు నవ్వుతూ, "అయితే నీ సంగతులేవీ చెప్పనేలేదు ఏంచేస్తున్నా విప్పుడు?" అని అడిగాడు అతడు తల వంచుకుని, "ఏమీలేదు" అన్నాడు కాళిదాసు మళ్లీ, "పోనీ, ఎక్కడ ఉంటున్నావో చెప్పు. మీవాళ్లంతా ఎక్కడ ఉంటున్నారు?" అని అడిగాడు అతడు దుప్పటి వంటినిండా కప్పుకుంటూ, "నావాళ్లంతా పోయి చాలాకాలమైంది ఇప్పుడు ఒక పినతండ్రీ, నీబోటి ఒక రిద్దరు స్నేహితులూ తప్ప కావలసినవా రెవరూ లేరు" అన్నాడు

కాళిదాసు నిట్టూర్చి, "విచిత్రంగా ఉంది. ఎలాంటివాడివి ఎలా తయారైనావురా! నీ తెలివితేటలూ, నీ చురుకుదనమూ టీచర్లనే ముగ్ధులను చేసేవి నువ్వు రకరకాల అద్దాలతో, ఫిలుములతో మీ యింటిముందు గదిలో గోడమీద సినిమా వేస్తూవుంటే నిన్నొక మాంత్రికుడిలా గౌరవించేవాళ్లం మీ వూళ్లో ఉన్న యిల్లు అమ్మివేశావని మునుపు చెప్పావు అయితే నువ్వు దేశాలు పట్టి తిరుగుతూ ఏం ఘనకార్యం చేస్తున్నట్టు" అని ప్రశ్నించాడు

అవ్యక్తి ఏమీ సమాధానం చెప్పలేదు తల వంచుకొని నేలవంక చూస్తూ కూర్చున్నాడు

కాళిదాసు మళ్లీ, "నువ్వు అన్యథా భావించనంటే ఒక్కవిషయం చెబుతాను. మనం తెలివిగలవాళ్లమయినంతమాత్రాన ఏమీ లాభం లేదు మన తెలివితేటలూ, మన శక్తీ ఏదోఒక విధంగా నలుగురికీ ఉపయోగపడాలి నువ్వు ఏపనీ చెయ్యకుండా తిరుగుతున్నానని చెబుతున్నావు అది చాలా అన్యాయమైన విషయం. నీ వంట్లో సత్తువ వుంది నీకు తెలివితేటలున్నాయి నువ్వు పని చెయ్యకపోవడం తప్పని నీకు తోచడంలేదూ? కొలిమిముందు కూర్చుని వళ్లంతా చెమటలు కారుతూవుండగా పనిచేసుకునేవాడి కున్న మాత్రం సంతృప్తి నీకు ఉంటుందా? కష్టపడగలిగిన వయస్సు వచ్చినప్పటినుంచీ, జవసత్వా లుడిగిపోయి మరొకరి అవసరం లేనిదే గడవని స్థితి వచ్చేదాకా మనం పని చేస్తూనే ఉండాలి ఆపని ఎటువంటిదైనా సరే చెయ్యటమే మనవంతు మరుగుదొడ్లు శుభ్రంచేసేవా రున్నారు వారి పని అది మనం వారితో నిమిత్తంలేకుండా కాలం గడుపుతాం అయినా వా రొక్కపూట వారి పని చెయ్యకపోతే మనపని దుర్భర మవుతుంది వారికీ, వారి పనికీ ఉన్న విలువ అప్పటికిగాని తెలిసిరాదు కష్టపడి పనిచేసేవాడికి పదవులలో ఉన్నవారికంటే నిజానికి సుఖమూ, సంతృప్తీ ఎక్కువగా ఉంటాయి మన సంఘం ఒక యంత్రంవంటి దనుకుంటే మనమంతా అందులో భాగాలవంటి వారం ప్రతి వ్యక్తీ ఒక చీల వంటివాడు ఏ భాగం పనిచెయ్యక పోయినా మొత్తం యంత్రమే అసమర్థమైపోతుంది" అన్నాడు

అంతటా నిశ్శబ్దంగా ఉంది చల్లనిగాలి తెరలుతెరలుగా కిటికీలోనుంచి వీస్తున్నది. ఆ వ్యక్తి మోకాళ్లచుట్టూ చేతులు కట్టుకుని

మౌనంగా కూర్చునిఉన్నాడు. కాళిదాసు లేచి అల మారు తలుపు తెరుస్తూ, "నువ్వు ఇక్కడ ఉండిపో రాదూ? ఇంటర్ వ్యూ అయినవాడివి నేను తెలిసిన వారందరిని కలుసుకుని ప్రయత్నిస్తాను రెండు మూడు రోజుల్లోనే ఒక చిన్న ఉద్యోగమైనా దొరక్కపోదు. హాయిగా 'రాజీవడి కొడుకు కన్నంత' ధీమాతో ఇక్కడే ఉండిపోవచ్చు" అన్నాడు.

ఆ వ్యక్తి అర్ద్రమైన స్వరంతో "అవును అలా చేయటం నాకూ యిష్టమే కాని యిప్పు డింక ఎలా .... ?" అని విచారిస్తూ మొహాన్ని చేతులతో కప్పుకున్నాడు కాళిదాసు ఆశ్చర్య పోయాడు అతనికేమీ అంతుబట్టలేదు అతడు కాస్సేపాగి "పోనీలేరా! అనవసరంగా మాట్లాడి నిన్ను కష్టపెట్టినట్టున్నాను క్షమించు లేచి యిలా యీ మంచంమీద పడుకో పొద్దు పోయింది" అన్నాడు

తర్వాత వా రిద్దరూ చెరో మంచంమీదా పడు కున్నారు ఒక అరగంట గడిచిపోయింది ఆవ్యక్తి నిద్రపోలేదు ఏదో మాట్లాడబోయి కాళిదాసుకు నిద్రపట్టిన విషయం గమనించి అతడు మళ్లీ ఆలోచనలో పడ్డాడు బల్లమీద కాళిదాసు పడుకో బోతూ తగ్గించివుంచిన దీపం ఉన్నది అలమారు తలుపు తీసి ఉన్నది కిటికీలన్నీ తెరిచే ఉన్నాయి వాకిలితలుపు లోపల గడియవేయబడి ఉంది కిటికీ పక్కగా చాపమీద పసిపిల్లవాడూ, పని మనిషి గాఢంగా నిద్రిస్తున్నారు ఉత్తరంవైపు పంచలో పిల్ల లిద్దరూ చదువు కట్టిపెట్టి పడుకున్నారు కాబోలు, అటువైపునుంచి ఏమీ శబ్దం వినిపించటంలేదు

ఆ వ్యక్తి కొద్దిసేపు ఆలోచించి నెమ్మదిగా లేచాడు చప్పుడుకాకుండా బొటనవ్రేళ్లమీద నడిచి అలమారు దగ్గరికి వెళ్లి ఒక్క క్షణంసేపు ఆ అరలలో ఉన్న వస్తువులవంక చూశాడు తర్వాత క్రింది అరలో ఉన్న ఒక నోటు పుస్తకం, పై అరలో ఉన్న కలమూ తీసుకుని బల్లముందు కుర్చీలో కూర్చుని, దీపాన్ని పెద్దది చేసి ఆ పుస్తకంలో ఒక పేజీలో నాలుగైదు పంక్తులు వ్రాసి కలం అక్కడే ఉంచి దీపం తగ్గించాడు తర్వాత లేచి ఒక్క క్షణం కాళిదాసు మొహంలోకి చూసి, నీళ్లు నిండిన కళ్లను దుప్పటి చివరలతో తుడుచుకుంటూ నెమ్మదిగా నడిచి ముందుగది తలుపును చప్పుడు కాకుండా తీసి గుమ్మందాటి, మళ్లీ తలుపులను దగ్గరగా లాగి వీధిలోకి వెళ్లిపోయాడు

బయట వెన్నెల కాస్తున్నది ఆకాశంలో మబ్బులు చిద్రుపలు చిద్రుపలుగా ఉన్నాయి పడమటివైపున ఒక నక్షత్రం బంగారు రంగులో మెరుస్తున్నది

అతడు నడుస్తున్నవాడల్లా తుపాకి దెబ్బతిన్న వాడిలా ఆగిపోయాడు వీధిచివరలో రాత్రి దుస్తులు ధరించివున్న పోలీసు లిద్దరూ చేతుల్లో లాఠీలతో ముందుకు వచ్చారు అందులో ఒక పోలీసు వేగంగా అతన్ని సమీపించి రెండవ అతనితో, "ఇడుగో ఈ మహానుభావుడే" అన్నాడు రెండవ పోలీసు నిట్టూర్చి, "అమ్మయ్యా! బతికించాడు లేకపోతే తెల్లవారి, ఎస్ ఐ గారు స్టేషనుకు వచ్చి, పోదా ఆర్డరు వేసి సిబ్బందిని పంపించే దాకా మన మీ చలిలో మంచాని ఉండవలసి వచ్చేది" అంటూ అతని చెయ్యి పట్టుకున్నాడు వీధిలో మరోవైపున కాపలావున్న పోలీసు లిద్దరూ కూడా ఇదిచూసి వీరిని కలుసుకున్నారు అతన్ని మధ్యలో నడిపించుకొంటూ నలుగురు పోలీసులూ వేగంగా నడిచిపోయారు

కొద్దిసేపటిలో తెల్లవారుతుందనగా పిల్లవాడు గుక్కపట్టి ఏడుస్తూండగాకాని అప్పలమ్మకు మెళకువ రాలేదు ఆమె మేలుకుని పిల్లవాణ్ణి జోకొట్టి మళ్లీ నిద్రవుచ్చి లేచి వాకిలి తలుపు తియ్యబోయి ఆగిపోయింది గడియవేసి లేదు తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి 'కాళిదాసు వాకి ట్లోకి పోతూ తలుపులు దగ్గరగా వేసి వెళ్లా డేమో' అనుకుందామంటే ఆయన ఇంకా లేవనే లేదు ఆమెకేమీ అర్థంకాక కాళిదాసు దగ్గరికి వచ్చి 'బాబుగారూ' అని పిలిచి లేపింది అతడు లేచి కళ్లు నులుముకుంటూ 'ఏమిటి?' అని అడి గాడు పనిమనిషి కొద్దిగా భయపడుతూ, "మీరు రాత్రి తలుపు గడియవెయ్యటం మరిచి పోయినారా బాబుగారూ ?" అని అడిగింది కాళిదాసు ఉలికిపడి పక్క మంచంవైపు చూశాడు ఆ మంచం ఖాళీగా ఉంది

అతడు అనుమానంగా, "రాత్రి నా స్నేహితు డొకాయన వచ్చాడుగా! అతనేమైనా వీధిలోకి వెళ్లాడేమో చూడు" అన్నాడు ఆమె వాకిట్లోకి వెళ్లినతర్వాత అతని దృష్టి బల్లమీదవున్న



పుస్తకంమీద పడింది అతడు ఉలికిపడి దాన్ని చేతి లోకి తీసుకుని యిలా చదువుకున్నాడు

"కాళీ! నీఅంత మంచిస్నేహితు డెవడికీ ఎక్కడా ఉండడు నువ్వు సానుభూతితో యిచ్చిన సలహా పాటించలేని అభాగ్యుణ్ణి జీవితమంతా నా చేజేతులా నాశనం చేసుకున్నాను నామీద, నాకు కావలసిన కొద్దిమంది పెట్టుకున్న ఆశలను వమ్ము చేసి సుఖం చాలా త్వరగా అనుభవించాలని నేను పెడదారులు పట్టాను ఆ పద్ధతులు ఫలించ కుండానే నా పాపం బద్దలైంది ప్రస్తుతం నేను " తర్వాత అతడే విషయాలు వ్రాద్దా మనుకున్నాడో వాటిని వ్రాయలేదు ఆ వ్రాత అసంపూర్తిగా ఉంది

కాళిదాసు చేష్టలుడిగి శిలావిగ్రహంలా కూర్చుండి పోయాడు అతని కిదేమిటో అంతుబట్టలేదు అతని మెదడు మొద్దుబారిపోయింది పనిమనిషి మురళీ రూబెనూ వెంటరాగా హడావిడిగా లోపలికి వచ్చి, "బయట ఎవరూ లేరు బాబూ!" అన్నది మురళి, "ఏమిటి మేష్టారూ అది ?" అని అడి గాడు కాళిదాసు, "అతను వెళ్లిపోయాడు" అంటూ ఆ కాయితాన్ని చిన్నచిన్న ముక్కలుగా చింపివేశాడు మిగిలినవారు ముగ్గురూ, "అలా చెప్పకుండా వెళ్ళే అవసరం ఏమిటో! వెడుతూ ఏమేమి వస్తువులు చేతబట్టుకుని పోయాడో" అంటూ అలమారులోనూ, ఇతరచోట్లా వెదికి చూస్తే "ఫరవాలేదు. ఎక్కడ ఉండవలసినవి అక్కడే ఉన్నాయి. అదృష్టమే సుమీ" అనుకున్నారు.

కాళిదాసు అలాగే చాలాసేపు కూర్చున్నాడు. ఏదో జ్ఞాపకంరావలసిన విషయం అతని మన సులో దాగుడుమూత లాడుతున్నది. వాకిట్లో ఉన్న పున్నాగచెట్టుక్రింద లెక్కలేనన్ని పూలు రాలిఉన్నాయి ఉత్తరంవైపు వరండాలో మురళీ రూబెనూ, ఏ అభ్యాసంలోనో లెక్కలు తేలికగా ఉన్నాయి కాబోలు, ఉత్సాహంగా రెండు నిముషాల కొకటిచొప్పున సాధిస్తున్నారు. పనిమనిషి, పిల్ల వాడిచేతికి ఆడుకునేందుకు తాళంచెవులు యిచ్చి, యిల్లూ వరండా చిమ్మి, పాచిపని చేసేందుకు వెళ్లి పోయింది పసివాడు చాపమీద పడుకుని ఏదో అర్థంలేని వాగుడు వాగుతూ ఆడుకుంటున్నాడు.

కాళిదాసు విసుగుతో లేచి పెరటిలోకి వెళ్లి తన పనులన్నీ పూర్తిచేసుకుని కుంపటిమీద కాఫీకి నీళ్లు పడేశాడు ఎవరో ఇద్దరు, ముగ్గుర పిల్లలు పూలకోసం వచ్చి అడిగి, అతని అనుమతి తీసుకుని మందార పువ్వులు ఒక్కొక్కటిగా కోసు కుంటున్నారు కాళిదాసు పాలు కాగినతర్వాత కాఫీ కలపబోతూ పనిమనిషిని కేకవేసి "ఇలా వచ్చి ఈ కుంపటిమీద స్నానానికి నీళ్లు పడెయ్య వమ్మా" అని చెప్పాడు నిజానికి అత డెప్పుడూ తన స్వంతపనులలో మరొకరి సహాయం తీసు కోడు ఇవ్వాళ అతని మనసంతా చికాకుగా ఉంది. 'ఈ జానకిరామారావు ఇలా రావటం ఏమిటి ? చెప్పకుండా అలా వెళ్లిపోవడం ఏమిటి ? వాడి కేవో వ్యక్తిగతమైన బాధలుండి ఉంటాయి లేకపోతే మనస్థిమితం ఏమైనా చెడిందేమో! ఏమైనా వాడు దయనీయమైన స్థితిలో ఉన్నాడు. వాడు వ్రాసిన ఆ నాలుగు పంక్తులలోనూ ఏదో క్షోభ, బాధ ధ్వనిస్తున్నాయి'

పనిమనిషి కాగుతో నీళ్లు తీసుకువచ్చి కుంపటి మీద ఉంచింది కాళిదాసు ఆమెతో, "కూరలన్నీ అయిపోయాయి అప్పలమ్మా! ఆ చిక్కుడుపాదు దులుపుకురా" అన్నాడు ఆమె నవ్వి, "అన్నీ కోస్తే ఏ రెండువీశల కాయలో ఉంటాయి బాబుగారూ! పదిహేనురోజుల నుంచి దాని జోలికి పోనేలేదుగా" అన్నది కాళిదాసు 'అయితే మరీ మంచిది అన్నీ కోసి కొన్ని నాకు ఉంచి మిగిలినవి మీరందరూ పట్టుకుపొండి" అన్నాడు. ఆమె వెళ్లబోతూ, "బాబుగారూ! నేను చెప్పిన సంగతి ఏంచేశారు ? అదే ఉయ్యాల " అని అడిగింది కాళిదాసు కాఫీగ్లాసు కిందవుంచి, "చూస్తాను లేవమ్మా! లేడికి లేచిందేచేళా ?" అన్నాడు ఆమె నవ్వుతూ చేతులను చీరెతో తుడుచుకుంటూ వెళ్లిపోయింది

కాళిదాసు లేచాడు అతని మనస్సంతా చీకా కుగా ఉంది అతడు మధ్య గదిలో ఒక పాత పెట్టె తెరిచాడు అందులో ఏవో పాత కాయితాలూ, దస్తావేజులూ ఉన్నాయి కాస్సేపు వెదికి ఆ కాయి తాలమధ్యలో నుంచి కాళిదాసు ఒక పాత ఫోటో పైకి తీశాడు అది బాగా మాసిపోయి ఉంది. అక్కడక్కడ ఏవో పురుగులు కొట్టివేయగా తూట్లుపడివుంది అది నలుగురు స్నేహితుల ఫోటో నలుగురూ ఆ రోజుల్లో కలిసి చదువు కుంటూ కలిసి ఆడుకుంటూ ఉండేవారు ఎడమవైపు చివరగా కూర్చున్నవాడు కాళిదాసు అప్పు డతడు తండ్రి చాటున తోయిగా నిశ్చింతగా ఉండేవాడు ఒక్కడే

# ధ్రువతార

కొడుకు కాబట్టి అతనికి ఇంట్లో చాలా విలువ ఉండేది తండ్రి అతనేమి కావాలంటే అదల్లా తెచ్చి యిచ్చేవాడు ఫొటోలో అతని ప్రక్కగా కూర్చున్నవాడు మార్కండేయులు అతని తండ్రి ఘనాపాఠీ వేదవేదాంగాలు చదువుకున్నవాడు అప్పటికే యీ దేశీయమైన చదువులకు రోజులు చెల్లిపోగా ఆయన కుమారుడి భవిష్యత్తున గురించి జాగ్రత్తగా ఆలోచించి 'మారే పరిస్థితులతో, కాలంతోబాటు మనమూ మారక తప్పదు' అనుకుని అతన్ని ఇంగ్లీషు చదువులో ప్రవేశ పెట్టాడు అతడు రెండు సంవత్సరాల క్రితం ఏ వూళ్ళోనో కనిపించాడు 'ఎక్కడో గుమాస్తాగా పనిచేస్తున్నాననీ, 'ఎక్ఖైరాళ్ళ వస్తున్నాయనీ' చెప్పాడు అతడు చాలా బాధపడుతున్నట్టు కనిపించాడు చివరకు విడిపోతూ 'మనం ఏదో అపమార్గంలో పడ్డామోయ్ ఈ చదువు లింత కన్నా పనికిరావు' అన్నాడు కూడా

మూడోవాడు సాంబశివరావు వాడు మరీ బీదవాడు వాడి తండ్రి వాడి చిన్నతనంలోనే పోయాడు వారాలు కుదుర్చుకుని వాడు చాలా కష్టపడి చదివేవాడు వాడికి మంచి గుడ్డలైనా ఉండేవికావు కాళిదసు ఇంట్లో వాడు వారాన కొకరోజు భోజనం చేసేవాడు ఒకసారి తన తండ్రి భోజనానికి వచ్చినవాణ్ణి చూసి, జాలిపడి చవకలో ఒక లాగూ, చొక్కా కొనియిచ్చిన ఉదంతం కూడా కాళిదాసుకు జ్ఞాపకం వచ్చింది వాడి పని యిప్పుడు బాగానే ఉంది ఒక చిన్న స్టేషనులో స్టేషనుమాస్టరుగా పనిచేస్తూ కాస్త సుఖపడుతూనే ఉన్నాడు

నాలుగోవాడు జానకిరామారావు వీడు అప్పుడప్పుడు కనిపిస్తూనే ఉన్నాడు గాని వీణ్ణి గురించి ఏమీ తెలియరావటంలేదు అదొక పెద్ద చిక్కు సమస్యలా ఉంది చిన్నతనంలో వాడి చెయ్యి చూసి ఒకడు "ఈయన మణికట్టుమీద యీ గీత ఉంది చూశారూ ఇది యీయనను మహా భాగ్యవంతుడిగా చేస్తుంది అలా కానిపక్షంలో జైలుపాలన్నా చేస్తుంది" అని చెప్పగా తామందరూ నవ్వడం గుర్తుకువచ్చింది

ముందు గదిలో సందడి వినిపించి కాళిదాసు ఆ ఫొటోను పెట్లో పడేసి యివతలికి వచ్చాడు పనిమనిషి, మరళి, రూబెనూ చిక్కుడు కాయలను కుప్పగా పోసి ముంచుని వున్నారు అవి దాదాపు రెండు వీశేలుంటాయి కాళిదాసు గుండెమీద చెయ్యి వేసుకొని, "అమ్మయ్యో ! ఇన్ని కాయలు నే నొక్కణ్ణీ ఏంచేసుకోను ? అందరూ సాయం పట్టాలి" అన్నాడు అతడా కుప్పను నాలుగు భాగాలుచేసి అందులో ఒకభాగం తనకు ఉంచుకున్నాడు మిగిలిన మూడు భాగాలూ మూడు కాయితాలలో కట్టి పనిమనిషి కొకటీ, మరళి కొకటీ, రూబెన్‌కు మరొకటీ యిచ్చాడు

రూబెన్ ఆ పొట్లం తీసుకుని, "మేష్టారూ ! చిక్కుడుకాయల్లో పిండిపదార్థాలూ, విటమిన్లూ ఎక్కువగా ఉంటాయి కదండీ ?" అని అడిగాడు మురళి, "అవును సైన్సులో విటమినుల పాఠం నిండా చిక్కుడుకాయలే ఇవి వంటికి చాలా మంచివి" అన్నాడు కాళిదాసు నవ్వి మురళిని చూపిస్తూ, "ఆ ! అవి తినే వీడిలా బలిసిపోతున్నాడు" అన్నాడు మురళి ఒక్క క్షణం ఆగి నవ్వుతూ "నేను సన్నగా ఉన్నాననేగా మీ ఎగతాళి చేస్తున్నారు ? ఈ పరీక్షలైపోనివ్వండి అప్పుడిహ మొదలుపెడతాను వ్యాయామం" అన్నాడు

తర్వాత వారు ముగ్గురూ వెళ్ళిపోయారు. కాళిదాసు ఒంటరిగా మిగిలిపోయాడు బల్లమీద ఉన్న గడియారం తొమ్మిది గంటల చూపిస్తున్నది

కాళిదాసు దృష్టి గుమ్మంపైగా గోడమీద ఉన్న తన భార్య ఫొటోమీద పడింది అతడు సోమరిగా అలా చూస్తూ కుర్చీలో కూర్చున్నాడు అతని మనస్సాగరం కల్లోలితమైపోయింది ఏదో అవ్యక్తమైన బాధ ! ఏవో స్మృతులు !

తాను ఉద్యోగంలో చేరిన కొత్తలో తన తల్లికి ఎవరో యీ సంబంధంగురించి చెప్పారు ఆమె కాళిదాసుతో, "ఆయ నెవరో అంతగా కలవాడు కాదట ఏదో కొద్దిపాటి సంపాదనతో రోజులు వెళ్ళబుచ్చుతున్నాడుట ఒక్కతే ఆడపిల్ల అనీ, పిల్ల అందంగా ఉంటుందనీ, సంప్రదాయం మంచిదనీ రాఘవులు చెబుతున్నాడు చూసివద్దామా ?" అని అడిగింది తాను 'సరే' నన్నాడు ఈలోపల అక్కడికి ఆ రాఘవులనే వ్యక్తిద్వారానే కబురు చేరింది ఒక శనివారం సాయంకాలం బయలుదేరి యిద్దరూ ఆవూరు చేరుకుని ఆ రాఘవుల యింట్లో నిద్రచేసి మరునాటి ఉదయం పిల్లను చూసుకునేందుకు వెళ్ళారు ఆ మాటలూ యీ మాటలూ అయిన తర్వాత పిల్లను తీసుకుని వచ్చారు ఆ అమ్మాయి నెమ్మదిగా నడిచి వచ్చి చాప మీద కూర్చుంది ఒంటిమీద చెప్పుకోదగిన ఆభరణా లేవీ లేవు చేతుల కొక జత సన్నటి బంగారు గాజులు మాత్రం ఉన్నాయి మెడ బోసిగానే ఉంది ధరించిన దుస్తులు సామాన్యంగానే ఉన్నాయి అయినా ఆ పిల్ల అందం విలక్షణమైనది చూసినకొద్దీ చూడాలనిపించే మూర్తి చక్కని శరీరచ్ఛాయ ఒత్తుగా పొడుగ్గా పెరిగిన నల్లని జుట్టు గుండ్రని మొహం చెంపలకు చేరెడేసి అందమైన కళ్ళు ఆ కళ్ళలో అమాయకత్వం

కాళిదాసు తల్లి, "నీపే రేమిటమ్మా ?" అని అడిగింది ఆపిల్ల తల వంచుకొనే ఉండి ఆఖ్నే బలవంతం చేయించుకోక, 'శివకామసుందరి' అని జవాబు చెప్పింది కాళిదాసు అంత అందమైన పేరు ఎన్నడూ వినివుండలేదు ఆమె మళ్ళీ, "నువ్వు సంగీతం నేర్చుకుంటున్నావా ?" అని అడిగింది ఆ ప్రశ్న విని ఆపిల్ల చిత్రంగా సిగ్గుపడింది ఆమెతల్లి, "జవాబుచెప్పు" అని హెచ్చరించగా "వూ !" అని తలవూపింది అలా అనటంలో, "ఏదీ ? వస్తే ఒక పాట పాడి వినిపించు" అంటారేమోననే భయం స్పష్టంగా కనిపించింది అదృష్టవశాత్తు కాళిదాసు తల్లి అలా అడగలేదు తర్వాత తమ వూరికి వచ్చి తల్లీ కొడుకూ సంప్రదించుకొని 'సంబంధం నచ్చిందనీ', 'కట్నం కానుకల

ప్రయోజనం లేదనీ, మోహహార్తం పెట్టించే విషయం పిల్ల తండ్రితో మాట్లాడవలసిం'దనీ రాఘవులుకు ఉత్తరం వ్రాశారు తర్వాత ఎప్పుడో రాఘవులు చెప్పాడు ఆ ఉత్తరం చేరిననాడు ఆ యింట్లో ఆనందం వెల్లివిరిసిందట తల్లి ఆ అమ్మాయిని దగ్గరికి తీసుకొని కళ్లనిండా నీళ్లు నింపి "ఎంత అదృష్టవంతురాలివే తల్లీ" అన్నదిట తండ్రి ఆర్ద్రస్వరంతో, "దానికి మహారాణీ యోగం ఉంది" అన్నాడట

తర్వాత వివాహం జరిగిన నీడెనిమిది నెలలకే ఆ పెదపిల్ల కాపురానికి వచ్చింది వస్తూ, ఆ ఇంటికి ఒక పాత పిడేలు తప్ప మరేమీ తీసుకు రాలేదు కాళిదాసుతల్లి, ఆ పిల్లా పాలూ నీళ్లూ లాల కలిసిపోయారు కాళిదాసు ఎప్పుడూ ఎరుగని ఒక అనంత సముద్రంలో పూపిరాడ నంతగా మునకలు వేశాడు ఆమెలో ఉన్న మహత్తరమైన గుణం అమాయకత్వం ఆమె దృష్టిలో కాళిదాసు ఒక మహా మనిషి ఆమె మనసా, వాచా, కర్మణా, కాళిదాసును దృష్టిలో ఉంచుకొనే నడుచుకునేది

ఒకనాటి వింత సంఘటన కాళిదాసుకు జ్ఞప్తికి వచ్చి గుండెలను కరిగించివేసింది అదొక వెన్నెల రాత్రి అర్ధరాత్రి దాటిఉంటుంది హఠాత్తుగా ఆమె మేలుకున్నది కాళిదాసును కంపిస్తున్న హస్తాలతో తట్టి, "ఏమండీ లేవరూ ?" అని పిలిచి లేపింది తర్వాత కళ్లనీళ్లు పెట్టుకుని కూర్చుంది ఎంతసేపటికీ మాట్లాడదు చివరకు కాళిదాసు కోపం తెచ్చుకోగా వణుకుతున్న కంఠస్వరంతో యిలా చెప్పింది "ఏమిటో పీడకల కుంకుమ భరిణె దొర్లిపోయి కుంకుమ అంతా నేలపాలయి నట్టు కల వచ్చింది .."

నీళ్లతో నిండిన ఆమె కళ్లు వెన్నెలలో మిల మిల లాడుతున్నాయి కాళిదాసు నవ్వి, "అక్కే ! ఏమీ పరవాలేదు అవన్నీ మనసులో ఉంచుకో గూడదు కలలన్నీ నిజమైతే యీ ప్రపంచం యిలా ఉండదు నాకొక రోజున అంతెల బిందెలు దొరికినట్లు కల వచ్చింది ఏదీ ? దొరకనే లేదుగా హాయిగా పడుకుని కన్నుమూ, నిద్రపో" అన్నాడు.

ఆమె కళ్లు మూసుకుని పడుకుంది కాళిదాసు అమాయకమైన ఆమె మోహంలోకి చూస్తూ ఉండగానే ఎక్కడో కోడి కూసింది

గతాన్ని స్మృతికి తెచ్చుకుంటూ శిలాప్రతిమ లాల కూర్చున్న కాళిదాసు, వాకిట్లో ఎవరో విప్పు గాని కేక వినిపించి ఉలిక్కిపడ్డాడు బల్లమీద ఉన్న గడియారంవైపు చూస్తే పదిగంట లయింది తనను చూస్తే తనకే అసహ్యం వేసింది ఎన్నడూ యిలా జరుగలేదు ఈ జ్ఞాపకా లీనాడు తనను కిమరిగా చేశాయి ఇక వంట చేసుకుని తిని కీయే వ్యవధి లేదు స్నానంచేసి వెంటనే వెళ్లి కీపారి

అతడు స్కూలుకు వెళ్లేసరికి రెండో గంట కూడా అయిపోయింది క్లాసులు ప్రారంభమైనాయి అతడు రిజిస్టరులో సంతకంచేసి టీచర్సు రూమ్‌లో అడుగు పెట్టాడు క్లాసు లున్నవారు తప్ప మిగిలినవా రందరూ అక్కడ కూర్చుని ఉన్నారు

క్లాసులలో పాఠాలు చెబుతున్న టీచర్ల గొంతులు కొద్దిగా వినిపిస్తున్నాయి. కాళిదా

# ధ్రువతార

ఒక కుర్చీలో కూర్చుని తర్వాత తాను చెప్పవలసిన పాఠాలు చూసుకోవటం ప్రారంభించాడు పట్టాభి జేబులోనుంచి సిగరెట్టు తీసి "ఏమయ్యా! మహానుభావా ? అలా నీరసంగా ఉన్నావేం ? భోజనం చెయ్యలేదా ?" అని అడిగాడు కాళిదాసు తల అడ్డంగా వూపి, "లేదు" అన్నాడు పట్టాభి సిగరెట్టు వెలిగించి అగ్గిపుల్లను కిటికీలో నుంచి విసిరిపారేసి, "బేష్! నేనూ భోజనం చేసిరాలేదు నిద్రలేచేసరికే తొమ్మిదిగంట లయింది 'ఇంటర్వెల్' లో పోదాం పద మా అయ్యరుగారి చేతివంట రుచిచూడవచ్చు" అన్నాడు

మధ్యాహ్నం విరామసమయంలో ఇద్దరూ హోటలుకు బయలుదేరివెళ్ళి భోజనం చేశారు తిరిగి మళ్ళీ స్కూలుకు వచ్చేసరికి కాళిదాసుకోసం ఒక పోలీసు జవాను కాచుకుని ఉన్నాడు శంకరశాస్త్రిగారు కాళిదాసును అతనికి చూపించి, "అదుగో ఆయనే కాళిదాసు" అని చెప్పాడు అతడు లేచివచ్చి "మీకోసమే వచ్చాను మేష్టరుగారూ! ఇలా ఒక్కసారి వస్తారా ? మాట్లాడాలి" అన్నాడు

కాళిదాసు ఆశ్చర్యపోయి అతనివెంట నడుస్తూ, "ఏమిటి ?" అని అడిగాడు అతడు టోపీ చేతిలోకి తీసుకుని, "నిన్నరాత్రి మీ యింటికి జానకిరామారావనే ఆయన వచ్చాడు ఆయన రైలు దిగుతూ ఉండగానే మాకు సమాచారం అందింది అధికారులు వెంటనే చర్యతీసుకునే వీలులేకపోవడంవల్ల అతనిమీద నిఘా ఉంచాము మీయింట్లో ఆయన చాలాసేపు ఉండి దాదాపు పన్నెండు గంటల సమయంలో బయటికి వచ్చాడు. మళ్ళీ ఎక్కడికైనా పారిపోదామని కాబోలు! ఆయనను అప్పటికప్పుడే పట్టుకుని తీసుకుపోయాము ఈ ఉదయమే 'స్పెషల్ వ్యాను'లో ఎక్కించుకుని తీసుకుపోయారు డ్యూటీనుంచి వస్తూ యీ విషయం మీ చెవిన వేసిపోదామని వచ్చాను ఆయన మీ బంధువా ?" అని అడిగాడు

కాళిదాసు ఆశ్చర్యంతో, "కాదు; స్నేహితుడు అయితే ఇంతకూ ఏమిటి అతని అపరాధం ?" అని అడిగాడు పోలీసు జవాను, మీకుతెలియదా ? ఆయన "దొంగనోట్లు అచ్చువేసిన ముఠాలో ముఖ్యమైనవాడు దాదాపు యిరవై రోజులనుంచి తప్పించుకుని తిరుగుతున్నాడు" అని చెప్పాడు

కాళిదాసుకు వెంటనే జ్ఞాపకం వచ్చింది అతడు స్తబ్ధుడై చిత్రిత ప్రతిమలా నిలబడిపోయాడు కాస్సేపటికి తేరుకుని పోలీసు జవానుతో 'అయితే శిక్ష పడుతుందంటారా ?" అన్నాడు అతడు మేజోడు సవరించుకుంటూ "అందుకేమీ సందేహం లేదు అంతా పట్టుబడిపోయారు ఆ యంత్రం కూడా డిపార్టుమెంటువారికి స్వాధీనమైపోయింది మీరింకా అదృష్టవంతులు తెల్లవారితే సెర్చి ఆర్డరు తీసుకుని మీ యింటిమీదికి వచ్చేవారు అప్పుడు మిమ్మల్ని కూడా యిందులో ఏదో ఒక విధంగా ఇరికించేవారు" అని చెప్పాడు

అతడు తర్వాత వెళ్ళిపోయాడు కాళిదాసు ఖిన్నుడైనాడు అతని మనస్సు ఈ ఉదంతం విన్న తర్వాత మరింతగా కలవరపడింది (సశేషం)

# న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

ర్యంకోసం అజ్మీరు, ఢిల్లీ, కూర్గులాంటి చిన్న చిన్న సంస్థానాలు సృజించారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సిక్కూ చుట్టుపట్ల కొంత ప్రాంతాలు కొంత కాలంపాటు ఒక సంస్థానంగా ఏర్పడ్డాయి అస్సాం, మణిపూర్, త్రిపురాలు ఇప్పుడు కేంద్ర స్థానాలుగా వున్నాయి

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం ఏర్పడటానికి కారకుల్లో శ్రీ నెహ్రూ ఒకరు. పంజాబ్ నుంచి హిమాచల్‌ప్రదేశ్‌ను ఎలా వేరు చేసింది సర్దార్ పణిక్కర్‌గో, ప్రభుత్వోద్యోగంనుంచి తప్పుకున్న శి సి చౌధురియో ఎప్పుడో ఒకరోజున తప్పకుండా వివరిస్తారు ఒక్క సత్యం మాత్రం ద్యోతకంగా తేలుతోంది న్యూఢిల్లీ, హిమాచల్‌ప్రదేశ్‌లోవున్న చిన్న సైజు ప్రజాస్వామిక ప్రభుత్వాలు అదృశ్యమైనట్లుగానే కూర్గు, అజ్మీర్‌లు కూడా అదృశ్యమైపోయినై ఇందువల్ల నిరుద్యోగం, ఒకవర్గం కాంగ్రెస్ వారికి ఆదరణలోపించటం జరిగాయి న్యూఢిల్లీలో ఇప్పుడు ఉదాహరణకి ఇద్దరు మాజీ మంత్రులు డా యుధ్‌వీర్‌సింగ్, శ్రీ అమన్ పింఛన్ పుచ్చుకుంటున్నారు సర్దార్ గర్‌ముఖ్ నిహాల్‌సింగ్ గవర్నరయ్యారు పాపం డా సుశీలానయ్యర్, చౌధురి బ్రహ్మప్రకాశ్, డా వరమార్‌లేమోవున్ పార్లమెంటు సభ్యులే ఇదంతా విపక్షతవల్ల జరిగిందేగా! చౌదరి బ్రహ్మప్రకాశ్‌కన్న డా పార్‌మర్ కొంత నయం ఇప్పటికే ఒక లెఫ్టినెంట్ గవర్నరు వున్న హిమాచలప్రదేశ్‌కు వచ్చే ఎన్నికల తర్వాత విస్తృతాధికారాలు లభిస్తాయి అసలూ! ఈ చిన్న చిన్న కూటాలు తమంతట తాను పరిష్కరించుకోటానికి కాంగ్రెస్ అవకాశమివ్వదుగదా!

*     *     *

న్యూఢిల్లీ పార్లమెంటరీ నియోజకవర్గంనుంచి పోటీచేసేందుకు కాంగ్రెస్ టిక్కెట్లకోసం కుమ్ములాట అప్పుడే మహా ఉద్ధృతంగా సాగిపోతున్నది అందరికన్న ఎక్కువగా ఉబలాట పడుతున్నది శ్రీమతి రాజన్ నెహ్రూ ఈవిడ ప్రధాన కార్యదర్శి భార్య లోగడ కొన్ని వారాలుగా ఈవిడ గారు ప్రభుత్వోద్యోగుల బాగోగుల్నిగూర్చి మహా శ్రద్ధ తీసుకుంటున్నది తన ఇల్లును వదిలిపెట్టి ఈవిడగారు తానెంత బీదగా బతుకుతోందో న్యూఢిల్లీ ప్రజలకు అర్థమయ్యేటట్లు చేస్తే పార్లమెంటుకు ఎన్నిక కావచ్చు ఈవిడ ఇంటి మరామతువల్ల పన్ను చెల్లింపుదారుడిపై తగు మాత్రంగా, ఏదో ఓ లక్ష రూపాయలు మాత్రమే పడింది సరే ఇక కాంగ్రెస్ టిక్కెట్టుకోసం కలలు గంటున్న వాళ్ళలో రెండోవ్యక్తి, పునరావాస శాఖ మంత్రి శ్రీ మెహర్‌చంద్ ఖన్నా

*     *     *

సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి శ్రీ వివియన్‌బోస్ నేరనిరోధకచట్టం బలపరిచేవారిలో ఒకరు ఈ సందర్భంలో ఆయన ఇలా అంటారు

"ఈచట్టం రాజకీయ ప్రత్యర్థుల నోరుమూయించేందుకే వినియోగం చేయటం జరిగిందని ఆరోపణలు వున్నాయి ఈ ఆరోపణలన్ని సుప్రీంకోర్టు విచారణకు వచ్చిన కొన్ని హెబియస్ కార్పస్ దరఖాస్తుల్లో వున్నాయి అంటే ఈ ఆరోపణలు విచారణకు వచ్చేముందరే దరఖాస్తుదార్ల విడుదల కావటం జరిగింది అందువల్ల ఆరోపణలగూర్చి దర్యాప్తు జరగలేదు. ఇలాంటి ఆరోపణ పైన ఒక వ్యక్తి నిర్బంధం జరిగిందని నిరూపించగలిగినట్లైతే ఆ వ్యక్తిని న్యాయస్థానాలు విడిపించివేస్తాయి

భారతదేశం జనాభా 40 కోట్లు దరిదాపుల్లో వుంది 131 నిర్బంధాలు మొత్తం జనాభాలో 0003% అవుతువున్నమాట. కారణమేదైతేనేం, దేశీయవ్యవహారాల మంత్రి వాదనలవల్ల ఈచట్టాన్ని 1957 చివరిదాకా పొడిగించటం జరిగింది

ఈ శాసన కాలపరిమితి అంతంతో ప్రభుత్వం ఈ చట్టాన్ని 1960 దాకా అంటే మూడేళ్ళపాటు పొడిగించాల్సిందిగా కోరింది అప్పటికి నిర్బంధంలో వున్నవారి సంఖ్య 205 చట్టంపట్ల వ్యతిరేకత బలంగావున్నా ప్రభుత్వం తన పథకం కొనసాగించుకోగల్గింది 1960 జూన్ 30 తేదీకి నిర్బంధితుల సంఖ్య 94 ప్రస్తుత పరిస్థితి ఇది

ఈలోగా ఈ చట్టంపై న్యాయస్థానాల్లో విమర్శలు, భారతదేశంలో నేర నిరోధక చట్టానికి గల అవకాశాలపై వ్యాఖ్యానాలు జరిగాయి చిట్ట చివరకు ఈ క్రింది విషయాలను నిర్ధారించటం జరిగింది :

1 నిర్బంధితుణ్ణి, నిర్బంధించిన కాలానికి 24 గంటల్లోగా ఒక న్యాయాధికారిముందు హాజరు పెట్టాలి

2 నిర్బంధితునికి కారణాలను న్యాయస్థాన పరిశీలించవచ్చు

3 అసంతృప్తికరమైన ఆధారాలపై జరిగిన నిర్బంధం చెల్లదు

4 రాజ్యాంగంలోని 22 వ అధికరణాన్ని అక్షరాలా గౌరవించాలి

5 నిర్బంధాధికారికి సంతృప్తికరమనిపించిన ఆధారాల పున పరిశీలన జరగదు

6 ఒక వ్యక్తి నిర్బంధం ప్రాథమిక హక్కులకు భంగం కలిగించేదిగా వుందేమో, న్యాయస్థానాలు పరిశీలించాలి

న్యాయస్థానాలముందుకు వచ్చిన కేసులలో ఈ క్రింది రెండు విషయాలు తేలాయి

1 ప్రభుత్వోద్యోగుల్లో, వీలైనంత అధికారం చేజిక్కించుకొనే ప్రయత్నంపట్ల మొగ్గు సహజంగా వుంటుంది ఈ ప్రయత్నం ఒక్కొక్కప్పుడు వారి అధికార పరిధులను అతిక్రమించేటట్లు కూడా చేయటమేగాక, వీలైతే తమను ఇరుకునపెట్టే నిబంధనలను త్రోసి రాజనటానికి ప్రయత్నించటం పట్ల కూడా దోహదం చేస్తుంది

2 ఇలాంటి అవాంఛనీయ పరిస్థితులను అదుపు చేసేందుక, న్యాయ సూత్రాలను అతిక్రమించే ప్రయత్నాలను గట్టిగా అణచివేసేందుకుగానూ న్యాయస్థానాలు వీటిపైన ఒక చూపు వుంచటం అవసరం ★

# గళ్లనుడి కట్టు-66



## అడ్డం

1 చిమ్మం పిడుగు.
3 జగములోని జంతువు మరొకరూపము.
5 కుమారుడు
7 శివంయములోని చెలికత్తె.
9 ఎంతో !
10 తినుకత్తి మొత్తము
11 అటునుంచి అంగీకారము
12 మిడుతకు 'బ్రతుకు' ఏది ?
14 పుచ్చుకొనకూడనిది !
16 చిందరవందర అయిపోయిన మృగము.
18 కదలిక
20 కరతలామలకములోనే పువ్వు
21 వదిలివేసినది
22 కామక కుడివైపి
23 ఇహము కానిదే !
25 తిరగవేసి చదివితే కంటికి ఇంపు
29 పాపిపదము, జాగ్రత్తగా చూడాలి తర్వాత ఏమైపోతుందో !
30 ఫేనము

## నిలువు

1 తం
2 చేతిలో పట్టేది
3 ఒంటరివాడు, ఏ పక్షి ?
4 చిన్నకొండ
5 మిక్కిలి కొలిచిచూస్తే నిప్పువేసే చోటు కనిపిస్తుంది
6 ఎటునుంచైనా నిద్ర !
7 అంతా !
8 యాగమే !
13 బుద్ధికి సంబంధించినదే తల్లక్రిందులైపోయింది
15 వలచని మెరుపా, పాదరసమా ?
16 వలకలమధ్య దాక్కున్న మ్రాను
17 అణి—
18 మానెపదార్థము
19 ఇంద్రుని ఉద్యానవనంలో కూతురు !
24 రక్తపరీక్షలోనే జలగను పట్టెయ్యాలి
26 దక్షిణంవైపు చిక్కను
27 పుణ్యంచేసేవాడు మాత్రం కాదు
28 చంద్రునికి వదలవలసినదా ?

## 65-వ గళ్లనుడికట్టుకు జవాబు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వె | ల | త | ■ | ప్ర | సా | ద్ | ■ | రా | జా | జి |
| హ్మ | ■ | గ | ■ | తి | ■ | ప | ■ | ణ | ■ | డి |
| ■ | నా | రా | య | ణ | ■ | సం | జీ | వ | య్య | ■ |
| రా | గం | ■ | ము | ■ | ■ | ■ | వ | ■ | తి | స్న |
| య్ | ■ | అ | న | క్క | ■ | అ | డు | గు | ■ | లం |
| ■ | రం | గా | ■ | మొ | రా | ర్జ | ■ | డొ | లు | ■ |
| ప | ■ | మి | ధి | ల | ■ | లు | స | కు | ■ | పి |
| త్రం | ఎ | ■ | రో | ■ | ■ | ■ | ప్త | ■ | గ | క్షి |
| ■ | స | దా | శి | వ | ■ | కా | మ | రా | జ | ■ |
| అ | ■ | ర్ | ■ | ర | ■ | శ్మీ | ■ | యం | ■ | మా |
| మె | హ | తా | ■ | స | ద | రు | ■ | చ | వ | న్ |

ఒకవ్యక్తి-ఒరేయ్ నిన్నుగాని నేను కొట్టానంటే జన్మజన్మాలకూ జ్ఞాపకముండాలి.

మరియొకవ్యక్తి-ఒరేయ్ నేను గాని నిన్ను కొట్టానంటే అసలు నీకు జ్ఞాపకశక్తే ఉండదురా!

జాటూరు చంద్రమౌళిదాస్ (ఘటకేశ్వరం)

* * *

జడ్జి -నీకొమరణశిక్ష తప్పదు. దానికి బదులుగా నీవు రాకెట్ లో అంతరిక్షానికి వెళ్ళిరా, బ్రతకడం సంభవిస్తే నిన్నొదిలేస్తాం

ముద్దాయి - వద్దు-సార్-వద్దు. ఇక్కడ ఉరితీస్తే ఫలానా చోట చచ్చానన్నైనా నా బంధువులకు తెలుస్తుంది ఇక్కడే చంపండి బాబూ

కొమ్మూరి రాజారావు (మాచ్ ఖండ్)

# హాస్యకథలు

## గాడిద వచ్చింది!

ఏకాంతంగా సంగీత సాధన చేసుకొంటున్న స్నేహితుణ్ని సమీపించి ఒకడు 'వురేయ్ నాన్నా, అంతబిగ్గరగా అరుస్తావేం? గాడిదలువచ్చేను జాగ్రత్త.

స్నేహితుడు! గాడిదలురావడమంటె. మాటలా? హేమాహేమీలైన గాయకులు పాడినా అవి రావుగదా, నా గాన మాధుర్యానికి పరవశం చెంది విందామని వస్తున్నాయి! (వ్రేలుతో అతనివంక చూపించి) ఒకగాడిద అప్పుడేవచ్చేసిందిగా!!

అప్పారి సూర్యప్రకాశ్
(నిజామాబాద్)

* * *

భార్య:— ఏమండీ! షాపులో రకరకాల చీరలు వచ్చాయిట కదండీ!

భర్త!- అవును వచ్చాయి

భార్య - ఏమేమి రకాలు వచ్చాయండీ?

భర్త!- రెండురకాలు

భార్య'- అవి ఏమిటండీ?

భర్త - ఒకటి నేను కొనలేనివి రెండు నీకు నచ్చనివి "

పి ఆర్ సుగుణామణి (కోవెలకుంట్ల)



* * *

## "ప్రారంభోత్సవం"

"ఒకవంతెన ప్రారంభోత్సవం బ్రహ్మాండంగా జరిగింది. చాల మంది తిరిగి వెళ్లిపోయారు ఒక వృద్ధుడు మాత్రం అదే పనిగా వంతెన కేసి చూస్తూ నిలుచుండటం కార్యకర్తలకు ఆశ్చర్యం కలుగ జేసింది అందులో ఒకాయన వినయంగా "అయ్యా! మీరింకా ఎందుకు నిలబడ్డారు" అని అడిగాడు "అది ఇంకా కూలలేదే అని చూస్తున్నాను" అన్నాడు వృద్ధుడు

టి మధుసూదన్ (హైదరాబాదు 4)

* * *

## అనుమానం

ఒక చోట బ్రహ్మాండమైన సర్కస్ప్రదర్శనం జరుగుతోంది ఒక అమ్మాయి సైకిలు మీద కూర్చుని వెనకాల యిద్దర్ని, ముందు ముగ్గుర్ని, భుజం మీద యిద్దర్ని, కూర్చోపెట్టుకుని స్పీడుగా తొక్కుతోంది చప్పట్లు మిన్నుముట్టాయి ఇదంతా చూస్తున్న ఒక కుర్రాడు తన ప్రక్కనున్న పోలీసుతో— "ఏమండీ వెధవది మేము సైకిలు మీద యిద్దరు ఎక్కితేనే పట్టుకుంటారు కదా మరి ఆ అమ్మాయి సైకిలు మీద అంత మందిని కూర్చోపెట్టుకుని తొక్కుతూంటే మీరు మాట్లాడక కూర్చున్నారేం "

మండలపర్తి భుజంగరావు (భీమవరం)

* * *

## నేరేడు

భోజమహారాజూ, కాళిదాసూ ఒకరోజున విహారార్థమై ఒక వనములోకి ప్రవేశించి, సేవకుడిచేత, నేరేడు పండ్లను కోయించి చెరొక పోగూ ముందు పోసుకుని తింటున్నారు కాళిదాసు పరాధ్యాన్నంగా తినటం కనిపెట్టిన భోజుడు, తన నేరేడు గింజలను కాళిదాసు గింజలలో కలిపేసి—"కాళిదాసు గారూ మీరు చాలా పండ్లను తినినట్లున్నారు", అని అన్నాడు. అప్పుడు కాళిదాసు—"అవును మహారాజా! కానీ మీరు పండ్లలోని గింజలను కూడా తినినట్లున్నారు" అని అన్నాడు

మండలపర్తి భుజంగరావు (భీమవరం)

* * *

ఒకనాడు భార్య సోమరియైన తన భర్తతో ఈలాగున అంది!- ఏమండీ! మీరు ఇంటిలో నాకెప్పుడూ సాయం చేయరేమిటి? ఇలాగైతే ఎలా!

అప్పుడుభర్త భార్యతో. "ఎంతమాట! ఎంతమాట! నేను సాయం చేయడం లేద! నువ్వు ఇల్లు వూడ్చేటపుడు నేను మంచం మీద కూర్చుని కాళ్ళెత్తటం లేదూ?" అన్నాడు

జె సత్యనారాయణ ప్రసాద్
(విశాఖపట్నం)


Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras 1 Chief Editor S Sambhu Prasad.

